# భరతచరిత్రము

## ద్వితీయ, తృతీయాశ్వాసములు


గ్రంథకర్త:

భద్రాచలసంస్థానపండితుడు,

శ్రీమత్తిరుమలైయచ్చాన

కాండూరు వేంగిట తిరుమలాచార్యులు అయ్యవార్లు.



ఆంధ్ర ఆర్టు ప్రెస్, ఏలూరు.

1941





[ వెల రు 1—8—0

# విజ్ఞాపనము.

ఇది శ్రీరామచంద్రుని సోదరుడగు భరతుని చరిత్రము. లోకమున మనుజుల చిత్తమును వశపరచుకొనుటకు ప్రధాన శక్తియుక్తములు. 1. దారేషణము 2. ధనేషణము 3. పుత్రేషణము. ఈ ఈషణత్రయమును ఎంతటి ధైర్యవంతుడును జయించలేడనుట యతిశయోక్తి కానేరదు. ఈభరతుడు తనకు నిరభ్యంతరముగ సంప్రాప్తమైన మహారాజ్యవైభవమును ధర్మమునందుగల విశ్వాసమును పురస్కరించుకొని తృణప్రాయముగ విడిచి దనకత్యంత సమీపమునయున్న సర్వాంగసుందరియగు ప్రాణప్రేయసిని గూడవిడిచి కేవలవిరక్తుడై తనకు నిమిత్తములేకున్నను "జ్యేష్ఠభ్రాతా పితృసమః" అను యార్యోక్తి ననుసరించి రామునివలె దానును గూడ మానసిక కష్టములననుభవించుట ధర్మమని భావించి జటావల్కలములను ధరించి యధశ్శాయియై వన్యాహారియై మహానగర సమీపమున నున్న పల్లెలో శ్రీరామచంద్ర పాదుకలను శ్రీరామునిగనె దృఢముగనమ్మి మహారాజ్యమునకు పాదుకలె పరిపాలకములని వాటికి పట్టాభిషేక మొనర్చి శ్రీరామ పాదుకలయందు శరణ వరణ మొనర్చి రాజ్యపాలనా స్వత్వమును నివేదించుచు తదితరము నంతను మఱచి తదేక పరతంత్రుడై తైలధారావిచ్ఛిన్న దృఢభక్తిసంతానుడై పదునాలుగు వత్సరములు కాలక్షేపము నొనర్చినవాడు. శ్రీరామచంద్ర భగవానుని కరుణకు పాత్రుడు. గాన భగవత్ప్రపత్తిని సంపూర్ణముగ నొనర్చిన వారిలో సత్యోత్తముడు. గాన భగవంతునిసంశ్రయించుటకు పరమభాగవతుని పరమభక్తునాశ్రయించుటయె మిగుల సులభోపాయమునినమ్మి దీనికి 'భరతచరిత్ర' మని నామకరణ మొనర్చితిని. పైగా దీనిని శ్రీరామచంద్రునకే కృతినొసంగితిని. మరియు శ్రీ సీతారామ లక్ష్మణ భరతశత్రుఘ్నులలోకి మహాతేజస్సులోని వారు గాన నిందెవ్వరిని సంశ్రయించినను పరమ పురుషునాశ్రయించినటులనే అని భావించితిని. వాల్మీకియు శ్రీమద్రామాయణమున "సీతాయాశ్చరితంమహత్" అని వచించినగదా!

శనివారప్పేట,
ఏలూరు తాలూకా.
1-1-1941.

ఇట్లు,
శ్రీభగవద్భాగవత విద్వజ్జన విధేయుడు.
తిరుమలై యచ్చాన్ కాండూరు వేంకట
తిరుమలాచార్యులు అయ్యవార్లు.

# —♦ శ్రీ రుక్మిణీ శ్రీ కృష్ణ దేవస్తోత్రము. ♦—

ద్వారకాపురనేతారం కుండినేశ్వరనాయకీం
యాదవానామలంకారం వైదర్భానామలంక్రియాం॥ ౧
యదువంశసముద్భూతం వైదర్భాన్వయ సంభవాం
తనయం వసుదేవస్య సుతాం భీష్మక భూపతేః॥ ౨
గర్గోక్తమతసంచారం బ్రాహ్మణానుమతేస్థితాం
దేవకీగర్భసంభూతం కుండినేశప్రియాత్మజాం॥ ౩
పుండరీకపలాశాక్షం పద్మపత్రాయతేక్షణాం
మదేభమందగమనం మ[illegible]వాం సీపగచ్ఛతిం॥ ౪
శ్రీవత్సాంకభుజామధ్యం రత్నహారభుజాంతరాం
చక్రాలంకృత హస్తాబ్జంపద్మాలంకృతపాణికాం॥ ౫
సర్వలోకప్రియాధారం సర్వానందప్రదాయినీం
లోకాభిరామం శ్రీకృష్ణం రుక్మిణీం లోకమాతరం॥ ౬
దివ్యసింహాసనాసీనం దివ్యాలంకారభూషితౌ
మనుక్షణకటాక్షాభ్యామన్యోన్యేక్షణ కాంక్షిణౌ॥ ౭
అన్యోన్యసదృశాకారౌ త్రైలోక్య గృహదంపతీ
ఇమావాయువాం ప్రణమ్యాహం భజామ్యనకభక్తితః॥ ౮
అనయాస్తుతియస్తుత్యా శ్రీకృష్ణంరుక్మిణీంసదా
తస్యతౌతనుతాం ప్రీతౌసంపదస్సకలా అపి॥ ౯
ఇతిదంకృష్ణదేవస్య రుక్మిణ్యాశ్చ విశేషతః
కృతం తిరుమలార్యేణ వేంకటోపపదేనచ॥ ౧౦
దయాపాలాన్వయోత్థేన భారద్వాజేన ధీమతా
తత్పదద్వంద్వదాసేనస్తోత్రం సద్యోవిముక్తిదం॥ ౧౧
యఃపఠేత్ప్రాతరుత్థాయ సర్వకామాన్ సవాప్నుయాత్
య ఇదంపఠతే స్తోత్రం రుక్మిణీకృష్ణమోహ్వలశం॥ ౧౨
ఇహలోకేచ సంప్రాప్త సర్వైశ్వర్యాభిపూజితః
శ్రీవైకుంఠమవాప్నోతి సనరో హాతకిల్బిషః॥ ౧౩

శ్రీరస్తు.

శ్రీ ఝైనమః.

# భ ర త చ రి త్ర ము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీరామచంద్ర పావన
వీరార్చిత విబుధవినుత విశ్వస్తుత్యా
దారిత దానవ నికరా
మారాధిక దేహవిభవ మహితాభరణా॥ ౧

క. ఘోర నిశాచరమర్దన
నారదముఖ సనుతచరిత నతబుధవినుతా
వారిద ఘనసిభ దేహా
సారామలచరిత రామ సరసిజ నయనా॥ ౨

వ. అవధరింపుము.

క. ఈలీల రాజపుత్రులు
వాలాయము వృద్ధినొంది సొంపుగ సిరివ్రా
జాలంబుఁ నేర్చి గురువులచే
హేలం గ్రీడించుచుండ వెలసిరి మిగులన్॥ ౩

గీ. వారిలోపల రాముఁడు వరగుణుండు
సర్వసంప్రీతిఁ గలిగించె చంద్రుఁబోలి
సర్వతేజోభిభావియై సవితయట్లు
సత్యధర్మపరాక్రమ శాలియయ్యె॥ ౪

క. వారల లోపల రాయుడు
చారుతరంబైన కేశవసరణినిజనుల
న్వారని ప్రీతినిఁగూర్చెను
సారార్థము లెల్లఁదెలిసి శతధృతిసగిరిస॥ ౫

ఉ. అందరు వేదతత్త్వవిదు లందఱు శౌర్యగమావిలాసు లం
దందరు సర్వభూతహిత మార్గపథగ్ర పిపగ్రగణ్యులే
యందరు నీతిశాస్త్రవిదు లన్యులు కార్యము లెల్లఁజేయగాఁ
నందరుఁ జాలువారలతి సాత్త్వికభావ ప్రవీణులై॥ ౬

వ॥ అందు శ్రీరామచంద్రమూర్తి

గీ॥ గజమునెక్కును గజసాది గణము మెచ్చ
నశ్వమును దోలు నశ్వజ్ఞు లలరగాను
రథముఁదోలును రథికులు రహిని బొగడఁ
దెలుగుధను రాగమమితరు తెలుగనగ్గ॥ ౭

గీ॥ లక్ష్మివర్ధనుఁడైనట్టి లక్ష్మణుండు
లోకరాముని రాముని లోనిభక్తి
నిరతిశయ నిత్యదాస్యంబు నియతిఁబూని
సేవఁజేయును విడువక శీలగరిమ॥ ౮

గీ॥ కుడిబుజము నాఁగఁ నిష్ఠుఁడు కులహితుండు
లక్ష్మిఁగలవాఁడు శూరుడు లక్ష్మణుండు
ప్రాణతుల్యుఁడు భక్తుఁడు పరమహితుడు
రామునకు సర్వలోకాభిరామునకును॥ ౯

గీ॥ అతని విడనాడి నిద్రింప డతని విడిచి
యిష్టమృష్టాన్నమును దినఁ డిష్టపడడు
వేటకేగినఁ నతనిని వెంబడించు
రామఛాయయొ యితడని రాజులెన్న॥ ౧౦

చ॥ భరతుని లక్ష్మణానుజుడు భక్తినిబాయక సేవఁజేయునా
భరతుడు లక్ష్మణానుజుని ప్రాణసముండని యెంచుఁ నాత్మలో
కరమనురక్తిఁగల్గి క్షణ కాలమునైనను వీడఁబోని సో
దరులకుఁగల్గు మైత్రిఁగని తల్లియుఁదండ్రియు పొంగిరింపుగన్॥ ౧౧

వ. దశరథనృపాలుడు దనయుల దన ప్రాణంబులకంటెఁనధికంబుగ, గనుంగొనుచు చౌలోపనయనాది సర్వసంస్కారంబుల యుక్తకాలములఁ జఱపి యంకురిత యౌవ్వనులగు వారికి సత్వరంబుగఁ బరిణయమహోత్స వంబులఁ జరిపి యానందించవలెనను కుతూహలంబునఁనాప్తులఁ బిలపించి సన్మానించి దనమనంబునఁగల యభిలాషఁ దెలిపి

గీ. రాఘవుల కర్హమైయొప్పు రాజసుతల
వెదకిఁగనుగొనిఁ ఎలుపుడు వేడ్కమీరు
సఖ్యసంబంధములపట్ల సములువలయు
కనులఁగనుగొందు కళ్యాణ కార్యములను॥ ౧౨

## —♦ విశ్వామిత్రా గమనము ♦—

వ. అనిఁ బలుకుచున్నయపుడు దౌవారికుండొకడు సన్నిధి కేతెంచి సవినయంబుగఁ జేతులుమోడ్చి జయ(ము)బువలికి “ రాజేంద్రా! మహా తపోధనుండగు విశ్వామిత్ర మహర్షి మన సింహద్వారమునకు విచ్చేసి భవద్దర్శనంబునకై యభిలషించుచున్నవాడని వక్కాణించిన విని భూపాలుండు దిగ్గునఁ గద్దియదిగ్గి యర్ఘ్యమును, పాద్యమును, గోవునుగొని విప్రవరుల్తోడనరా వశిష్ఠసహితుడై యేగి బ్రహ్మ తేజోభిరాముడు పరమేష్ఠిసదృశుడు అగు విశ్వామిత్రమహర్షిం గను గొని తత్కాలోచిత దండప్రణామంబుల నర్పించి కుశలంబడిగి ”

గీ॥ అర్ఘ్యపాద్యాదులర్పించి యాదరించి
యబ్జజాతుని నర్చించు నమరవిభుని
చందమున హర్షవశమున సంయమీంద్రు
పూజ్యపాదుని గనుగొని పూర్ణభక్తి॥ ౧౩

వ. దశరథమహారాజు చేతులుజోడించి యభిముఖముగ నిలువబడి "మహాత్మా మీరట శతానందుడన్న."

సీ. క్షత్రియుండైపుట్టి క్షత్రియ దేహంబు నిజతపోమయటంకనిహతిచేత
నిపుణతఁ జెక్కుచు నిర్మలబ్రాహ్మ్య దేహంబు నెడలించె దివ్యశక్తిఁ
నింద్రపదవ్యయముగాని యింద్రహీనముగాని చేయఁగఁ దలఁపెట్టి చేయుపనుల
బ్రతిమాలిమాన్పెను బ్రహ్మ[illegible]మున ప్రతిసృష్టిఁ జేసెను
ప్రభుత నెవఁడు॥

గీ. యతఁడె యతిథియై యరుదెంచె నగరునాఁడు
భాగ్యమేమని వర్ణింతు భవ్యతరము
గాధిపుత్రుని వర్ణింప గలుగువారు
గలుగ రెవ్వరు శక్యంబు గాదుగాన॥ ౧౪

గీ. గాధిపుత్రుని కరుణను గాంచగలుగు
భాగ్యమబ్బెను బహుతపః ఫలమువలన
సవిత్రవంశంబు సత్కీర్తి సంయుతంబు
వాంఛలెల్లను సమకూరె వాసిగాను॥ ౧౫

గీ. అనుచు కరములు జోడించి యధికభక్తి
వినయవినమిత శీర్షుఁడై వినుతిఁ జేయు
దశరథావన్యుని గనుగొని ధన్యతముని
గాధితనయుఁడు పలికెను గరుణతోడ॥ ౧౬

వ. విశ్వామిత్రుఁడు దశరథునితో మాటలాడుట

ఉ. సేమమె నీకు బుత్రులకు సేమమె కాంతల కాశ్రితాళికి
న్సేమమె నీదు మంత్రులకు సేమమె రాజ్యరమావధూటికి
న్సేమమె విత్తసంతతికి సేమమె గోద్విజ బంధుకోటికి
న్సేమమె నీదుమిత్రులకు సేమమెగా సకల ప్రజాళికిన్॥ ౧౭

క. అతిథులను బూజసేతువె
యతిభక్తినిగొలుతె దేవతావళినెల్లన్
మతిమంతులైన మంత్రులు
హితవాదులెవారుఁ జెప్ప హితముల వినదే॥ ౧౮

వ. అను విశ్వామిత్రవాక్యంబుల విని దశరథుండు వినయ వినమితుడై

క. అనఘాత్ములైన మీరలు
ఘనకృప మాభవనమునకు గ్రక్కునరాగన్
మన మతిసంతసమందెను
ఘనశుభములుఁ గలిగె సర్వ కలుషము లుడిగెన్॥ ౧౯

క. ఘనకౌశిక తపనోదయ
మునఁబోయెను గాఢతమము మోదముఁ గలిగెం
ఘనబంధు చక్రములరెను
మనమునగల కోర్కెలెల్ల మహిసిద్ధించెన్॥ ౨౦

వ. అని దశరథుండు వినయ యుక్తముగ బలుకు వాక్యంబుల వినుచు విశ్వామిత్రుండు

క. అనఘు వశిష్టమునీంద్రుని
ఘనగౌరవమొప్పఁగాంచి కలకలనగుచుం
మునినాథ సేమమేగద
గనినాడను నిన్నుచాల కాలంబునకున్॥ ౨౧

వ. అనవిని వశిష్టసంయమీంద్రుడు విశ్వామిత్ర మహర్షికరంబు దనకరంబునబట్టి దనసేమంబు దెలుపుచుఁ నతనిసేమంబుఁ దెలసెనంత విశ్వామిత్రుండు దశరథవశిష్టాను గమ్యమానుడై రాజభవనంబునఁ

దనకై యమర్చఁబడిన యాసనంబున సమ్యగుపవిష్టులైనవారల
తోడఁ నుపవిష్టులై యుండ దశరథుండు వినయంబున కౌశికమహా
మునీంద్రునుం గాంచి కరంబులు మోడ్చి

—♦ దశరథుని వినయవాక్యములు ♦—

ఉ. సూనులు లేనివాఁడు దన సుందరపుత్రులఁ గన్న మోదమున్
వానలు లేక సస్యములు వాఁడగ వర్షముఁ గన్న మోదమున్
దానగఁ గోరు సన్నిధులు గ్రక్కునఁ గాంచిన గల్గు మోదము
న్మానసమందుఁ గంటిఁ గద మాన్యుఁడ నీవిట కేగుదెంచినన్॥ ౧౨

ఉ. కామిత మేమిఁ గల్గినను గ్రక్కున దాచక వేగఁ జెప్పుమీ
భూమి సమస్తమైన మరి భూరిధనంబులనైన తెంపున
న్నామకమైన ప్రాణముల మత్తగజాశ్వరథాళినైన నే
నేమరకుండ నిచ్చుటకు నెంచితి సంశయ మేలఁ గోరుమీ॥ ౧౩

క. మహి నేలినావు తొలుతను
మహితర్షి వియగుచు పిదప మహిమాఢ్యుఁడవై
విహిత తపోవిభవంబున
మహితబ్రహ్మర్షి వగుచు మహి వెలసితిగా॥ ౧౪

ఉ. పావనమూర్తి వీవు నను భవ్యునిఁ జేయఁగ నెంచి సత్కృపన్
దైవము భంగి వచ్చితివి ధన్యుఁడనైతిని నాదు తాతలుఁ
బ్బావనులైరి నా తపము పండెను భవ్యశుభంబుఁ గల్గె భూ
పావళిలోన మాద్యశుఁడు బాల్పడ నేరడు లోకమందు కౌశికా॥ ౧౫

క. అడిగిన లేదనువాఁడిత
డడుగక యేయున్న హాయి యడిగిన నితఁడే
యడియాసఁ నివ్వకుండినఁ
గడు తేలిక యగును గాదె ఘనబృందమునన్॥ ౧౬

క. అనితలచి యడుగకుండకు
మనఘాత్ముఁడవీవు యేది యడిగిననైనన్
వినయంబునఁ నర్పించెదఁ
ననుమానమువీడియడుగు మతికృపచేతన॥ ౨౬

క. అడిగినది యడిగినపుడే
కడువేగముతోడఁ నివ్వ గడగితిఁ ననఘా
వడియడుగము రఘువంశజు
లిడకుందురె యర్థి యడుగ నేదియునైనన్॥ ౨౭

ఉ. మారట బ్రహ్మవీవునను మాన్యునిఁ జేయగఁవచ్చినావుగా
కారయ నీకశక్యముల నన్యులు దీర్పగఁ జాలియుందురే
కారుణిక గ్రాగగణ్యాయిక (గావుముకార్యముఁ జెప్పివేగమే
వారనిశక్తిఁ జేసెదను వాంఛితమెట్టిదియైన గట్టిగా॥ ౨౮

వ. మహాత్మా! సంశయింపకుము. వాంఛితమునుఁ జెప్పుము. నీవేదికోరి నను లేదన కొనంగెదననిఁ బలుకు దశరథ వాక్యంబులువిని కౌశికుండు

## —♦ విశ్వామిత్రుని సంభాషణము ♦—

చ. వికసిత వక్త్రపంకజుడు విస్మిత దేవమునీంద్ర సంచయ
ప్రకటిత చారుచర్యుడు తపః ప్రతిభాయుతుడామునీంద్రుడో
సకల గుణాఢ్యదానమాన సత్యశమంబుల నీమపూర్వుల
న్నుకరముగాగ గెల్చితివి సువ్రతధీరవశిష్ట శిష్యుడా॥ ౩౦

ఉ. వేడిన దేదియైనఁ గృప వేగమనిచ్చెదఁ నంచు బల్కుటఁ
స్వేడగఁ బూనినాడనిట వేడబమేమియులేదు నామదిం
బోడిమిమించు కోరికను భోరునఁ జెప్పెద దానినిచ్చియే
నాడును బొంకడంచనెడి నవ్యయశస్సునుబొందు మీాఘరన్॥ ౩౧

ఉ. చేయఁగ నెంచి యజ్ఞమును చెన్నుగ దీక్ష వహించియుండఁగా
మాయలనేర్చు రక్కసులు మామక యజ్ఞవిఘాతకృత్యము
ల్జేయఁదలంచి చేరుదురు చెన్నటిమూకలతోడ క్రూరులై
పాయక నస్త్రశస్త్రముల పల్మరుఁ గొట్టుచురయ్య పార్థివా॥ ౩౨

క. నెత్తురు తేఁకల ముంచుచు
మొత్తుచు వెన్నెముకగముల మొరటులు ప్రేవుల్
కత్తులచే పెకలించుచు
మిత్తికి బలియిత్తురచట మిడికెడిమునులన్॥ ౩౩

క. మారీచ సుబాహులునా
ఘోరాసురు లనుజులరయ ఘోరాకారుల్
దూరీకృత సౌజన్యులు
పారీణులు శస్త్రఘాతుల పటు బలశాలుల్॥ ౩౪

ఉ. వారలు జేయువిఘ్నముల వారణభీతిని యిల్లువీడి నే
వారయనీదు సన్నిధికి సత్యథకాశను వచ్చినాడ నో
ధీర కకుత్స్థవంశ్యవర దీక్షవహింపగ బోవువాడ నా
కోరిక దీర్చఁబంపుమిక కోరిక దెల్పెద పార్థివోత్తమ॥ ౩౫

క. పాపాత్ములైన దైత్యుల
శాపంబున సమయజేసి శమనునిపురికి
న్వేపుచ్చఁగలనుగానీ
కోపించుట నొల్లు దీక్ష గొనియుండుటచే॥ ౩౬

—♦ విశ్వామిత్రుని కోరిక ♦—

గీ. ముద్దుమొగమున ముంగురు లొమ్మరయువాని
పిల్లకూకట్ల మురిపెంపు పెంపువాని
రాము రఘురాము సద్గుణారాము చారు
కమలదళనేత్రు నీసుతుఁ గరుణ బంపు॥ ౩౭

గీ. పూర్ణచంద్రుని ముఖమున పూనుకువాని
కంజమిత్రుని కాంతిని గెలచువాని
సోమశేఖరు సోలించు సొగసువాని
విధికివిద్దెల గరపెడి విధమువాని॥ ౩౮

శా. నాచేరక్షితుడైన రాముడలనా నారాత్మసానీకము
న్వాచాగోచర విక్రమక్రమమున న్వాతంబు వృత్తంబుల
న్నీచాధః కరణ ప్రవృత్తిదనుజు న్నిర్నిద్ర భావంబునన్
ధీచాతుర్య సమార్జితాస్త్రపటలో ద్దీప్తాత్మ తేజః ప్రభన్ ౩౯

గీ. నీసుతుని చేతవారలు నిజముగాను
జత్తురితరులచేవారు జావరధిప
కమలమిత్రుడు గడతేర్చు గలడుగాచ
గాఢమైనట్టి తమమును గడియలోన॥ ౪౦

క. బలయుతులు ఖలులు వారలు
పలువిధముల పోరిపోరి పటుగర్వమునన్
ఫ్రులివాతబడ్డ కుక్కల
వలె జత్తురు సకల దాన వావళి ..డెన్॥ ౪౧

గీ. బాలుడీతడు చాలడు చాలడనుచు
జాల జింతింప బనిలేదు చాలునితడు
ఫాలలోచనునైనను బార్ద్రదోలు
బాలసూర్యుడు తమమును బాపునట్లు॥ ౪౨

గీ. ఈమహాత్మునిc నెఱుగుదు నిత్యతేజు
రాజశేఖరు సత్య పరాక్రమునివ
శిష్టు డౌరుగును తేజస్విసిద్ధుడగుట
నీతపస్థితులందరు నెఱుకగలరు॥ ౪౩

చ. శపథముఁ జేసిచెప్పెదను శక్తియుతోఁడగు నీసుపుత్రునిం
దపనసమాన విక్రముని తథ్యముగ గెల్చెడి వారలుండబో
రపగతలోక దృష్టిగల యంధత సుస్తుతి గెల్వఁ నేర్చునే
తపనుని యుగ్రతేజమును తెస్కర మున్కరకోటి కుర్వఁడినస॥ ౪౪

క. యీ యుపకారము సేయగఁ
జేయుదు నీసుతున కేను శ్రేయస్తతుల
న్వేయును జెప్పగఁ నేలా
శ్రీయుతుఁడై కీర్తిఁగాంచు శ్రీరాముని గుణము॥ ౪౫

గీ. రామునాతోడఁ బంపుము రాజచంద్ర
సంశయింపకు గెలుగును సంతసంబు
సూర్య చంద్రములుఁ గలదాఁక సుతునకీర్తి
జగమునను నిల్చు చింతింప జనదునీకు॥ ౪౬

గీ. నీదుగురువరునడుగుము నీదుమంత్రి
వరులనడుగుము రాముని వారిబంపు
మనినఁబంపుము లేకున్న నేలుగువాడు
మాటదప్పకుమర్యాద మహాని నిలుపు॥ ౪౭

క. నఖ గాత్ర సుయతినుండెడి
నఖఁజన్మముఁగాచుదనుజ ఖండన జేయు
న్వాఖవద్దులగునుజగములు
దశరథదయసేయువయ్య దనయుని వేగస॥ ౪౮

క. కాలముఁజరుగకమును పీ
బాలునినాతోడబంపు పరమాత్ముడితడే
మీలోనరించెద నమ్ముము
చాలును నీసుతుడునన్ను చతురతగావన॥ ౪౯

—♦ పుత్రప్రేమానుబద్ధుఁడగుదశరథునిస్థితి ♦—

ఉ. కౌశికవాక్యకంటకము కర్ణవిభేదముఁ జేయదుస్సహా
వేశితశోకమోహముల వేగమునఁ స్జితమానసాబ్జుఁడై
లేశము తెల్వినొందగను లేకను పుత్రునిమీఁదిసత్కృపా
పాశనిబద్ధుఁడై మునిని బంపఁగ నెంచెను శూన్యహస్తుగాన్॥ ౫౦

క. మునిపలికినవాక్యంబుల
వినిగొడ్డలిచేతఁ గూలు విటపముభంగి
న్ఘనశోకవివశుఁడగుచును
జనవిభుఁడటఁ గూలె ధరణిఁ జడమతియగుచున్॥ ౫౧

క. ఒక్కముహూర్తము మూర్ఛను
ట్రెక్కొనివే చెలిసినృపతి తెంపునసుతుపై
మక్కువకలిగినకతమున
గ్రక్కున కుశికాత్మజాతుఁ గనుగొనిపలికెన్॥ ౫౨

క. విశ్వామిత్రుల నడపగ
విశ్వామిత్రుండుగోర విశ్వేశ్వరుని
న్విశ్వామిత్రతనొందగ
విశ్వేశుఁడునాస్తివాక్యవిసరముఁ జూపెన్॥ ౫౩

—♦ దశరథుఁడు రాముని బంపసినుట ♦—

క. రాముడు పదిరెండేడుల
కోమలబాలుండు చూడు కోణపహతికై
యేమని యడిగెదు చెపుమా
రాముని నే నివ్వఁజాల రమ్యగుణాఢ్యా॥ ౫౪

క. ఆటల పాటల దవులును
పాటవమేమైన గలదె వశిబాలునకు
న్నాటలు పెక్కగు నేలా
సూటిగ నేనివ్వఁజాల సొంపుగఁబొమ్మా॥ ౫౫

క. పదియారేడుల లోపలి
సదమల బాలుండు పద్మ సమనేత్రుండు
న్మదయుతుఁ రాత్రిదినములను
మదమణచగఁ జాలడనుచు మనమునఁ గనుమీ॥ ౫౬

క. పాలుఁగారెడి బుగ్గల పసవు నాఁడు
ప్రొద్దుగ్రుంకిన నిద్దుర బోవు నాఁడు
పరువుమీవనె పదముల బరవు నాఁడు
బాల్యచేష్టల లోలుఁడై పరగు నాఁడు॥ ౫౭

క. అరువది వేలేడులుఁ జనఁ
నరుదుగ నేఁ గాంచినాడ నరసుత సుతుల
న్వరహితగుణ గణుడవునీ
వరమరలేకుండ నిటుల నడుగగ దగునే॥ ౫౮

గీ. మహితగుణధాము రాముని మాన్యచరితు
నిముసమైనను విడనాడి నిలువఁగలనె
నాదు దైవము నీవని నమ్మినాడ
రాము గొనిపోవఁ గడగకు రమ్యశీల॥ ౫౯

క. రాముని దోడ్కొనిపోవగ
నీమనమునఁ దలఁతువేని నేస్తంబునితో
సామజ బృందంబులతో
సామంతుల తోడఁగూడి సరగున వత్తున్॥ ౬౦

సీ. అక్షౌహిణీసేన యలరారు నాకెడ నాసేనతోఁగూడి యరుగుదెంచి
నీయజ్ఞమును గాచి నిర్జించి యసురుల నీమెప్పువడసెద నిజముగాను
శస్త్రాస్త్రములతోడ శంబరుదలపడి శక్రునిమెప్పించు శక్తివినవె
యల వశిష్టునిదయ నలరిన శస్త్రాస్త్ర సమితిజూపించెద సమరమునను

గీ. మేననసువులుగలదాక మెలగువాడ
మంత్రులద్భుత శక్తులు మహిత గుణులు
వివిధ శస్త్రాస్త్రవిదులైన వీరభటులు
గలరు నాచెంత వారితో గదలువాడ॥ ౬౧

ఉ. చివ్వకుకాలుద్రవ్వు ఖల చేష్టితు లెవ్వరొ పేరులెట్టివో
యెవ్విధి యజ్ఞముల్జెరుప నేపిథి వత్తురొ యెట్టివారలో
యెవ్వని బుత్రులో యసురు లేగతి యజ్ఞము పాడుసేతురో
యెవ్విధి వీరిజంపదగుఁ నేర్పడఁ జెప్పుము తాపసోత్తమా॥ ౬౨

క. అనవిని నరపతిఁ గనుగొని
మునిబలికెను నిర్జరారి ముఖ్యుఁ గ్రూరున్
ధనదునితమ్ముని రావణు
విని యుంటివిగావె వీరు విశ్రుతు నీచున్॥ ౬౩

గీ. బ్రహ్మయిచ్చిన వరముల బలియుడగుచు
సకలలోకులఁ బాధించి సాహసమున
దయయు సత్యంబు ధర్మంబు దలపఁబోక
పరులవనితలఁ గూడును పతులగూల్చి॥ ౬౪

గీ. దానుగాబోడు యజ్ఞ విధ్వంసమునకు
బంపు మారీచు వీరు సుబాహు సంజ్ఞ
సుందపుత్రులు వీరలు శూరవరులు
మాయలెరిగిన నీచులు మహితబలులు॥ ౬౫

క. నాపాలి దైవ రాయడ
నీపాదములంటువాడ నిరుపమకరుణన్
నాపాపని కరుణింపవె
యాపాపులమీాదమమ్ము నంపకుమెప్పుడున్ ॥ 20

క. సురవిభుడు మొదలుగాగల
సురసంఘము లెల్లబారి సూ పెలడాగన్
పరజీవహారుని రావణు
వరగర్వితుగలనఁ గెలువ వశమా నాకున్ ॥ 21

సీ. వీరలోకంబున విఖ్యాతుఁడైయుంట బ్రహ్మవరముచేత ప్రబలియుంట
పురుహూతుబట్టిన పుత్రుఁడుగలుగుట సహజవిక్రములైన సహజులుంట
వింశతికరముల వీరుల మొత్తుట పదితలలుగలిగి జరగుచుంట
లోకంబులనునెల్ల లోగ్గడిబెట్టుట కలుషవర్తనులతో గలసియుంట

గీ. గలన నెదిరించు వాఁడెందు గలుగకుంట
కారణములు గాగల్గును గాక నాకు
వయసుచెల్లుట పుత్రులు వదలలేని
బాలులై యుంట రాజాల బవరమునకు ॥ 23

గీ. తాటకాసుతు లిరువురు దలపదగని
వీర్య యుక్తులు శూరులు విదితయశులు
నారిరణమునఁ నెదురించు వారుఁగలరె
బాలునిమ్మని యేరీతి బలికెదీవు ॥ 24

గీ. పిరికితోడను బోలికి వెరువకటుగ
తనదు మంత్రులతోగూడి తథ్యముగను
రావణుండేగు చెంచను రణమునకును
వాని బోలికి నిలచెసి పోడుగలడే ॥ 25

సీ. ఇట్టికష్టంబు నాకేల నిపుడె నేను
రాముఁ రాముని బంపనుఁ రణమునకును
వానితోఁ జనుత మాకేల స్థైర్యమయ్యా
మమ్ముఁ గ్రివిడనాడి పోవయ్య మహితచరిత॥ ౨౬.

గీ. ఎగిరిదాటుము సాగర విస్తారమనిన
మోయలేనట్టి బరువును మోయుమనిన
దినగలేనట్టి యన్నంబు దినుమటన్న
నెట్లు సాధ్యంబు నీవిట నెంచిచెప్పుమ॥ ౨౭

వ. అని

క. జనపతి పలికిన పలుకులు
విని మటమటలాడి తపసి వికటభ్రుకుటిసి
గనుగివ నిప్పులు గురియగ
ఘనముగ నెయ్యిబోయ మండు గాఢాగ్నివలెస॥ ౨౮

ఉ. ఎండినచింతకట్టెయుల నేపగురాశినిమండునగ్నిలోఁ
దండిగనాజ్యముంచగనె భగ్గనె రేగెడిమంటబోలిదా
వండతరాగ్రహంబునను జంగమకోటికిభీతిగొల్పియు
ద్దండులగుఁ జూపుల్లనగ దారుణభంగిమ మునీంద్రుడిట్లనుస॥ ౨౯

—♦ విశ్వామిత్రుని రోషవాక్యరచన ♦—

వ. ఆహాహా దశరథరాజా! నామనంబున సంశయించినటుల నే నీచరితంబతిదుష్టమైనది. నీధైర్యసాహసంబుల పరశురామునిదాడిని జగంబువినినది. వశిష్టర్షి చిత్రవాక్యంబులవిని నీవు సుగుణంబవనిదలచి మోసపోతిని. గనుక నేనిట్టి మహాత్ముల సన్నిధి నవమానింపబడితిని.

శా. ఓరీ నాల్కాలునీకు రెండటర లేరో పెద్దలిచ్చోటునన్
మాఱాడంగను నీకు జెల్లెగదరా మర్యాద బోనాడెదే
యేరా నీవలె బొంకువాఁడు గలఁడా యీ సూర్యవంశంబున
న్స్వైరైనన్విన లేదె కర్ణయుగళి న్స్పష్ట హరిశ్చంద్రునిన్॥ ౮౦

శా. నీవే పుత్రుల గన్నవాఁడవటరా నీవిట్లు బొంకంగి నే
లే వేకార్యముఁ జేయుమార్గములు మేలే యీ క్రియల్నిల్చునే
నీవే యిచ్చెదనంచు బల్కి యిటుల న్నిర్లజ్జుఁడై గూడి యీ
త్రోవం బల్కుట నీకు పాడియగునా దోసంబు రాకుండునా॥ ౮౧

మ. వినుమీ మూర్ఖుఁడవీవు మూఢుఁడవు సావిత్రుండవై యేవిధిం
జననం బందితి పద్మజాతు ధిషణా జాడ్యంబుగా కేమగు
జ్జను నే రాముఁడు నీకు బుట్టుటకు నే జాలించి పోనెంతు నే
గనుమీ తప్పుల కుప్పఁ బద్మజుని నే గాఢంబు పీడించెదన్॥ ౮౨

మ. నిను సృష్టించిన వానినిందు జడుని న్నిర్భీతునిం వృద్ధుని
న్మనమం దేమియు నూహలేని విధినే మర్దించి శిక్షించెద
న్ఘనమౌ బాధల బెట్టువాఁడ తుదినిఁ న్గాంక్షింపుమీ శ్రేయమీ
వనయంబొప్పగ బంధుసంఘములతో నానందము న్బొందుమీ॥ ౮౩

గీ. దాతవని నిన్నుఁ జేరుట తప్పునాది
తగిన దండన జేసితి ధన్యమతివి
వచ్చినట్టుల బోయెద వనమునకును
శుభము లెల్లను బొందుము సూర్యకులుఁడా॥ ౮౪

క. చూపఱ గుండెలు పగులగ
తాపముచే నృపతి మిగుల తహతహ పడగా
కోపము హెచ్చిన మునిపతి
చూపట్టెను విలయకాల శూలినిబోలెన్॥ ౮౫

## — వశిష్ఠ మహర్షి హితబోధ —

చ. అపుడువశిష్ఠుడిట్లనియె యార్యజనస్తుతనీకు బాడిగే
తపనునివంశమందునను తత్త్వవిదగ్రణి వౌచు బుట్టితిగదా
తపసిని రుద్రసన్నిభుని తాపసవంద్యుని బ్రహ్మతేజుని
న్విపులతపోభిరాము నిటుపింపగ లేదనిబొంకి నేర్చితే॥ ౧౬

ఉ. చంద్రమతీశుతోనితడు సాటిగసత్యముబల్కువాడనే
సాంద్రయశోవిశాలుడవు సత్త్వగుణాఢ్యుడవీవు బొంకగా
నింద్రియలోలుడెవ్వడిటు నేగతిబొంకదలంచె వేగ జెప్పుమీ
యింద్రసమానవైభవుడ పేరుయశోగతినీకు జెల్లునే॥ ౧౭

ఉ. ఆడినమాటతప్పెదవె హార్షమతోప్పనసీకు పాడియే
తోడినృపాలశేఖరులు ద్రోహిగనవ్వరె ... నిను
స్తోడనెయిచ్చువాడనని తోగముగాగనుబల్కి ...
నోపెడిమి లేదుపొమ్మనిన ... ॥ ౧౮

సీ. నిజకీర్తిచంద్రిక నిఖిలలోకంబుల సుస్థిరప్రవృత్తిని నిల్పినావు
వసుమతియంతయు వైభవమున ... కీర ... వెలసినావు
సంపూర్ణదక్షిణా సహితంబులైనట్టి సర్వయజ్ఞంబుల సలిపినావు
సత్యంబుధర్మంబు సతతంబువిడువక సాధుసంస్తుతినంద జాలినావు

గీ. సాధుజనులెల్లనీచెంత సంతసముగ
సరసపూజలసంతోష సహితులగుచు
చెలగుచుండెడి విభవంబు జెప్పనేల
నెటులబొంకెదవయ్యయో యెఱుగరాదు॥ ౧౯

సీ. కౌశికుడనగను కారీశుడేయన్న నీనాలు కేయట్లు నేర్చెబొంక
మహిమనిగాధేయుడే మాధవుడనియన్న నీనాలు కేయట్లు నేర్చెబొంక
కౌశికసృష్టియె గణనీయమనియన్న నీనాలు కేయట్లు నేర్చెబొంక
త్రిశంకవంబును దగురీతిబాగ జెడి నీనాలు కేయట్లు నేర్చెబొంక

గీ. తగునె నీవిత డడుగని తరుణమందె
యేమిగోరిన నిచ్చెదఁ నేనటంచు
బలికియాంతడునినుగోరఁ బార్థివేంద్ర
జేయలేనసిజెప్పుట జెల్లునయ్య॥ ౯౦

సీ. చేసెదననిబల్కి చేయఁకనున్నను వచ్చుఁనిష్ఠాపూర్త వధమునీకు
తగినపాత్రమునందు దానముఁజేయమీ దాతవైయొప్పవు ధర్మశీల
తాతలనడవడి తలపకుండగనీవు సత్యమువీడెదె సత్యమూర్తి
పుత్రమోహముచేత పూజ్యావమానంబుఁజలుపగఁజాలుదె సత్యమజ్ఞ

గీ. గాధిపుత్రుడురక్షింప గలననెదిరి
నీదుపుత్రునిఁగో బోర నేర్పరావ
ణునకునైన గలుగదు సూను నుచితముగ
బంపి కీర్తిని బడయుము పార్థివేంద్ర॥ ౯౧

సీ సకల ధర్మంబుల జాలింపఁగాఁనెంచు పుత్రుపై మోహంబుబూనువాడు
గురువులనైనను క్రూరత దూషించు పుత్రుపై మోహంబు బూనువాడు
దైవమునైనను దలచును దిట్టగ పుత్రుపై మోహంబు బూనువాడు
సత్కీర్తిగలిగించు సత్యముఁవిడనాడు పుత్రుపై మోహంబు బూను
వాడు

గీ. నీషణముల మూడింట బుత్రీషణంబె
చాలహెచ్చని దలపుదు జనులు మిగుల
మోహపాశంబుఁ జ్ఞానాసి మొదటిదాఁక
గోయఁగలవాడె పుడమిని గొప్పవాడు.॥ ౯౨

గీ. నీవెపుత్రుని పైప్రేమ నీటివిడువ
శాస్త్ర పాండిత్య మంతయు శ్రమమెగాదె
నిన్నుఁగనుఁగొను వారెల్ల నియతముగను
నీతివిడుతురు పాపంబు నీకుగలుగు॥ ౯౩

వ. వినుము. మనుజుఁడెప్పుడును దుష్టేంద్రియాశ్వములకు స్వేచ్ఛా విహారమునొసగక నీతి ఖలీనాకర్షణమున నియత మార్గసంచరణము నొసగవలెను. దారేషణ, ధనేషణ, పుత్రేషణముల శక్తి ప్రబలమైనది. వానిని స్వవశమున నుంచుకొనుటకు చిత్తమును స్వాయత్తము నొనరించుకొనవలెను. నీవు విశ్వామిత్రుని సామాన్య మునిగా దలచుచున్నావు. నీపుత్రుని నీతనితోఁ బంపినను నీకు కీడుమూడునో యని భీతిల్లుచున్నవాఁడవు. విశ్వామిత్రుని మహత్త్వము చెప్పెదను వినుము. గాధేయుఁడు

ఉ. గాధిసుతుండు ధర్మమునకో సాటిగ విక్రమమిత్త్రబుద్ధినో
తాపములేని సూర్యుఁడొ నిదానము విశ్వజనీనకీర్తికి
స్థాపము శీతలించు చంద్రుఁడో సత్కరుణాశ్రిత మానసంబికి
స్థాపన గూర్పగల్గు మహాతపస్వి బుధుల్ తపస్విలన్ ఘనా॥ ౬౪

వ. ఇట్టి యసాధారణ విశేషంబుల సమస్త దేవతలను, సమస్త మహామునులను సంతృప్తి నొందించి మెప్పించినవాఁడు. శతానందుఁ డితని సన్నిధికి విచ్చేసి పాద్యార్ఘ్యంబుఁ జేసి కౌశికు నాదరించినాఁడు. బ్రహ్మతేజో విరాజితుఁ డద్వితీయ తపశ్శక్తి సమన్వితుఁడు మహానుభావుఁ డాగ్రహించిన నాశమునకు మితము లేదు. దయఁజూచినఁ గలిగించలేని శుభోదర్కమేమియును యుండదు. మునుపు దక్షప్రజాపతికి బహుల మంది పుత్రికలు కలిగిరి. వారిలో జయయు, సుప్రభయును పుత్రికల కిరువురికిని వారి భర్తయగు కృశాశ్వునకును జనించిన సంతానమంతయు బహుశస్త్ర రూపంబున విరాజిల్లుచున్నది. ఆయస్త్రాదియంతయు నితని తూణీరంబున నియతంబుగ వర్తించుచుండుచు సర్వకాల సర్వావస్థలయందు నితనికి వశవర్తులై యుండును గాన సంశయింపక నీమహానుభావునకు నీపుత్రరత్నంబగు శ్రీరామచంద్రమూర్తిని బంపుము. భయపడకుము. నీపుత్రునకు నీతఁడు శుభోదర్కంబుల ననేకంబుల

నొనరించగలడు. నీవీరహాస్యంబును హృదయంబునఁ గీలుకొలుపు కొనుము. నీపుత్రుడు సర్వ విజయాభిరాముడు. సర్వతేజోధికుడు. దేవ దానవ మానవ తాపస తపశ్శక్తులన్నియు నీపుత్రుని సన్నిధిని పర మాణు కల్పములు నీపుత్రుడు సంకల్పించినదాని నాపువాడు సమస్త భువనంబులను లేడు. జాగుజేయక సమర్థిత సత్యవాక్యుడవుగమ్ము. యీగాధేయుడు

క. నవనవముగ నస్త్రంబుల
భవవిక్రముడితడు సృష్టి బరపును సుమిత్రా
సవనము గావగ రాముని
నవలీలను బంపవయ్య హర్షము గలుగున్॥ ౬౭

క. తలపకు మీతనకార్యము
నలుపగలేడీతడనుచు సత్యముసుమిత్రా
పలువిధముల నీసుతునకు
గలిగించగ శుభము నితడు గ్రక్కున వచ్చెన్॥ ౬౮

—♦ శ్రీరాముని విశ్వామిత్రున కర్పించుట ♦—

వ. దశరథుడు వశిష్ఠ వాక్యంబులవిని, దనమనంబునగల సంశ యంబులన్నియు గురువాక్య గౌరవంబున విడనాడి దానవులు యుక్తంబులు గావనియు, విశ్వామిత్రుడమిత శక్తి సంపన్నుడనియు, దనపుత్రుండు మానవమాత్రుండు గాడనియు, సత్యమును విడనాడుట దగదనియు, దలచి రుద్రునివలె మండిపడుచుండు విశ్వామిత్రు నవలోకించి

క. అనఘుడు దశరథుడప్పుడు
వినయముతో మునినిజూచి విశ్వామిత్రా
గొనిచనుము రామునిప్పుడే
గనుగొనుమి కరుణతోడ కంజజసముడా॥ ౬౯

వ. మహాత్మా! గాధేయా! నీమహిమ నెఱిగియు పుత్రమోహమున సర్వమును మఱచి యవాచ్యంబుల బలికితిని. యరువదివేల సంవత్సరంబులకు నేని శిశువుల బడసి వీరల నాప్రాణంబులకంటె నధికంబుగ గనుగొనుచు సర్వకాల సర్వావస్థలయందును విడువక తదేకపరాయణుండనై యుండియుంటచే నిట్టివాడనైతిని. పుత్రమోహము వివేకమును మడిచివేసినది. గురూపదేశంబున వివేకోదయమైనది గావున నాదుడుకులను క్షమించి నాయజ్ఞానము మన్నించి రఘుకులదీపములగని నన్ను మన్నింపుము. తమకైన నీకోర్కెను దీర్చుటనిగాన నాగ్రహమును విసర్జింపుము. నాపుత్రుని, నాపుణ్యరాశిని, నాభాగ్యపదమును, నాసర్వస్వమును నాప్రాణదాతనిగొని చనుము. కాలము మించకుండ నీవు సంకల్పించిన యజ్ఞమును సకాలమున నిర్వహింపుము.

గీ. అనుచు రాముని బిలిపించి యతనియు నిటుల
వినయ వినమిత శీర్షుని వినయశాలి
గొనుము రాముని లక్ష్మణు గోర్కె లలర
చనుము సవనంబు నీర్పగ సదనమునకు॥ ౫౦

వ. మహానుభావా! నీవు రామునిమాత్రము కోరితివి. నేను రామలక్ష్మణుల నిరువుర నొసంగుచున్నాడ. నిది యుక్త కోరినదాని కంటె నధిక మివ్వదలచి కాదు సుమీ, వీరిరువురు శబ్దార్థముల వలెను. చంద్ర చంద్రికల వలెను, పుష్ప పరిమళముల వలెను, విడదీయ శక్య మగువారలు గారు. గావున నొసగుచున్నాడ. వీరిరువురిని గొనిచనుము. నను సత్య వాక్యునిగ ననుగ్రహింపుము. అని బలికి యా సభకు దన యంతఃపురమునుండి పతివ్రతా తిలకమగు కౌసల్యాదేవిని రప్పించి విశ్వామిత్రుని కోరికయు, దనయజ్ఞ వాక్యంబులను వశిష్ఠ మహర్షి హితబోధను వచించిన కౌసల్యాదేవి వినయంబున రాఘవుల కర్థుల

కివ్వదగని దేదిగలదు. సత్పాత్ర దానంబున నేమను కృతార్థురాలను.
అని వచించెనంత దశరథుండు

ఉ. రాముని లక్ష్మణుం బిలిచి రమ్యగుణాఢ్యులు తల్లిదండ్రులు
ద్దామశుభాశిషంబులను తద్దయు బల్కిరి మంత్రవత్తుగా
క్షేమముగూర్చు సద్విధుల శిష్ట తపస్వి యరుంధతీశుడా
కామన మానరూపులకు గట్టిగ దీవనలిచ్చె ప్రేమతో॥ ౯౯

వ. దశరథభూవల్లభుడు

గీ. ముగ్ధబిడ్డను రాముని ముద్దులాడి
మీద చెయినైచి చెక్కిలి మిగులనొక్కి
శిరముమూర్కొని చిన్నారి శిఖను పుణికి
కౌగలించెను కను వేడ్క కలువుదీర॥ ౧౦౦

గీ. దశరథేశ్వరు డప్పుడు తనయుకరము
గుశిక పుత్రునికరమున గూర్చికరుణ
గలుగ జేసెడి మాటల కాశ్యపీశు
డనియె నీతని రక్షించు మార్యవినుత॥ ౧౦౧

క. అతిశుభ శకునంబులు
మతిమంతులుం బొగడగలిగె మహిమాఢ్యునితో
జితచిత్తుడేగె రాముడు
కుతుకముతో లక్ష్మణుండు కూరిమితో డను ౧౦౨

సీ. ముందు కౌశికముని ముఖ్యుడేగుచు నుండం గరము చాపంబు గ్రాలుచుండ
తరుణార్కయుతమా మదనరువారిజ మొట్టుకేసు గనిగూడితపసి వెంట
భూషణ భూషిత భూరి విగ్రహ కాంతి దశదిక్కులందును దనరుచుండ
పురవమునస పెరి పురుషులు మగువలు గనుల మనంబుల గలయబంప

గీ. ముద్దులనుగూర్చు జనపము ల్మురియుచుండ
పూల వనమీద జల్లగ పూవుబోండ్లు
తల్లి దండ్రులుకనుమేర దననుజూడ
రాముడానందధాముడు రమణజనియె॥ ౧౦౩

చ. అరుగగ కొంతదవ్వమున యారసి రామునిగాంచి వత్సనీ
కరమున నీరము న్గొనుము కాలము బుచ్చక నీకునిచ్చెడే
యరుదగువిద్య నిచ్చెదను పరాజయమొచ్చుట గల్గబోదు వా
నరమణిగొల్చె లోకమున శాశ్వతకీర్తి వహింతు వెప్పుడున్॥ ౧౦౪

క. బల యతిబలలను
సంలలితములగుచునున్న యీ సాత్విక విద్య
ల్గలిగించును నీబలముల
నలయిక యాకలియు దప్పి యలవడ దెప్పుడున్॥ ౧౦౫

క. బాలకులెల్లరయుండ నెక్కడ
సలవస్మృతిమహితశక్తి యాశ్చర్యముగన్
సులభంబుగజయమబ్బును
కలిగిన విధి యజునివలన కమలదళాక్షా॥ ౧౦౬

గీ. దానపాత్రుడవీవను తలపుగలిగి
గానుమిగుణములరాశివి కోమలాంగ
నేనుధన్యుడనయ్యెదనీకునిచ్చి
గానవేగమగొనవయ్య కమలనయన॥ ౧౦౭

క. యీవిద్యలు నావలనను
నీవిప్పుడు నేర్చుమదని నిపుణతి నాడెన్
భావమునసనుపలుమారులు
భావింపుముదీనివలన భవ్యతగలుగున్॥ ౧౦౮

చ. అనవినియాచమించిశుచియై గొనిమంత్రయుగంబుభక్తిమై
వినయత,జుట్టునుఁద్దిరిగి విశ్వవిధిజ్ఞునియాదరంబునన్
ఘనమగుతేజునఁద్దివిరి గ్రక్కునవందన మాచరించియా
మునియునువారలిద్దరును ముచ్చటలాడుచుబుచ్చిరానిశిన్॥ ౧౦౯

క. జలజాప్తునికిరణంబుల
వలనొప్పగుమిన్నుమృగ్యభగణంబయ్యెన్
కలిగెనుచల్లనిగాలులు
జలజంబులనుండిలేచె సారంగంబుల్॥ ౧౧౦

క. తెలతెలవాఱగనాముని
సలలితముగశయ్యఁజేరి సంతోసమునన్
జలజాప్తవంశ్యుఁగనుఁగొని
పలువిధములమదినిబొంగి బ్రస్తుతిఁజేసెన్॥ ౧౧౧

గీ. కనులగనుగొనలేనట్టి కమలనాభు
కనులగనుగొంటిద్విజరాజ కాంతియుక్తు
నాదిమధ్యాంతరహితుని నాదిపురుషు
నవ్యయాకారు నవ్యక్తు నచ్యుతాఖ్యు॥ ౧౧౨

క. నాపుణ్యమె గణనీయము
నేపుణ్యులకైనఁగాని నీపుణ్యుఁగనన్
నైపుణ్యములేదందురు
నాపూర్వపుపుణ్యమిట్లు ననుగనఁజేసెన్॥ ౧౧౩

వ. శతానందాదులకును. నీతడిటులఁ నెన్నడును వశ్యుడు గాకుండుటయుఁ నాకు శిష్యుండు రక్షకుండు మిత్రుండు విధేయుండు నయి యుండుటయుఁ దలంచి నామనం బత్యంతానందార్ణవ మగ్నం బయ్యెఁనని దలచి నిద్రించు రాముని శరీరంబునఁ దనకరంబు మెల్లనం నునిచి స్పర్శ సుఖం బభినయించుచు

క. కౌసల్యఁ గన్నబిడ్డడ
వాసవనిభ లెమ్ము వేగ వచ్చెను బ్రాక్సం
ధ్యాసమయము దైవికముగు
వాసరకృత్యంబుఁ జేయ వలయును గాదే॥ ౧౧౪

వ. మఱియొకవిధము

క. కౌసల్యగన్న రాముడ
వాసితమగుపూర్వసంధ్య వచ్చెను నీవు
ల్లాసమున నిద్ర లెమ్మిక
వాసరకృత్యంబుఁ దీర్ప వలయును వేగ॥ ౧౧౫

క. జలజాప్తునికిరణంబులు
జలజంబులవిప్పుచుండె జలజాతేక్షణ
జలజాతజాతసన్నుత
జలజంబుఁ బోలుఁ గనులఁ జప్పున గనుము॥ ౧౧౬

గీ. అంత రాముడు మేల్కాంచి యహ్నానిధుల
నెల్లదీర్చుచు పయనమై యేగుచుండి
మునికి మ్రొక్కిన ముదమున మునియు నప్పుడు
బాలులనుఁ గూడి పయనంబు బఱపఁ జేసి॥ ౧౧౭

క. సరయూసంగతగంగను
కరమరుదుగఁ గాంచి మ్రొక్కి గాధిసుతున్
వరగుణులోకయాశ్రమమును
సరగునఁ గని బలికి రిట్లు చక్కని ఫణితిన్॥ ౧౧౮

క. ఈయాశ్రమ మెవ్వరిదియొ
మాయాత్ముల కరిదిఁ దోఁచె మాహాత్మ్యముచే
నీయాధాత్మ్యముఁ దెలుపవె
నీయాత్మకుఁ దెలియనట్టి నియతులు గలవే॥ ౧౧౯

క. అనవినియామునిచంద్రుడు
కనుదమ్ములఁగాంచిరాముఁ గాఢప్రేమ
న్వినుమీ జెప్పెదఁనిప్పుడె
మనమునసంతోషమొదవ మహీ దేవేంద్రా॥ ౧౨౦

వ. యీతపోవనంబునందు

క. ఘనుడగుఫాలలోచనుడు
ఘనశక్తితపంబుసలుప గడగినపిదప
న్మనమలరనతనిసేవల
ననువొప్పగఁజేయుచుండె నార్యయుభక్తిన్. ౧౨౧

గీ. అదియె యదననితలచుచు. నమరవినుతి
కుసుమశరములమదనుడు కురిసిశివుని
ఫాలనేత్రాగ్నిభస్మమై పడియెనిచట
దానవాతడనంగాఖ్యఁదాల్చినాడు॥ ౧౨౨

క. అంగంబిటబడియుండుట
నంగాభిఖ్యాకదేశ మందురుదీని
న్భంగముఁనొందరుమునిజను
లంగజభవుకరుణనిచట నలవడియుంటన్॥ ౧౨౩

క. అనిపలుకుఁనంతఁగోపల
వినయముతోఁనచటిమునులు విశ్వామిత్రు
న్గనవచ్చినిలిపిపూజల
దనిపిరియా రేయివేగ దనరిరివారల్॥ ౧౨౪

క. నరపతిసూనులకప్పుడు
పరమునిదగుకథలుజెప్ప వనమునవినుచున్
వరమతులుముగురునడచిరి
సురదీర్ఘికఁగనులబడియె సురుచిరభంగిన్॥ ౧౨౫

గీ. మునులుఁదెచ్చిన తెప్పపై మునియునృపులు
రంగదుత్తుంగసరసత రంగ గంగఁ
దాటుచుండగ వినిపించె ధన్యమైన
రమ్యశబ్దంబుమధ్యను రాముసకును॥ ౧౨౬

గీ కర్ణశష్కులియందున క్రమగతిని
బడినసంతోషసాగర పతితుడగుచుఁ
దానిచరితంబు వెలియగ దలచిమదిని
మునినిగనుగొనిపలికెను ముదముఁతోఁడ॥ ౧౨౭

క. మునివరపినదగుశబ్దము
వినుపించుచునుండె దీని విస్తృతకథల
న్వినుపించుమనుచుఁనడిగిన
వినుమనిచెప్పంగదొడగె విస్తృతఫణితిన్॥ ౧౨౮

క. శతధృతి, తన మానసమున
నతిధృతి సృజయించెతటిని హారుశైలమునన్
మతిమంతులు మానసమని
యతి కుతుకముతోడఁ బిలువ నలరెను ధరలో॥ ౧౨౯

క. మానస సరస్సంభవము
మానుగ సరయూయటన్న మహి తాభిఖ్య
న్మానితము నది యయోధ్యను
గానగఁ గంగామతల్లి గలసెనుసుమ్మా॥ ౧౩౦

మ. సరయూసంగత జాహ్నవీగత లసత్సంరావ మిూచొప్పున
న్నరమా మోదము గూర్చుచుండు నెపుడు న్పాపాటవీ దావమై
కరము ల్మోచినమస్కరింప వలయు న్గంజాత పత్రేక్షణా
సురసందోహమునిల్చెఁ నిచ్చట సుధా శుంభజ్జలా సక్తమై॥ ౧౩౧

చ. అనవిని వారలానదికి బ్రద్భుత భక్తినిమ్రొక్కి మందర
స్థనుగొని యొక్క కాననముఁ గన్నుల భీతిని గొల్పుదానినో
యనఘవచింపు మెవ్వరిట నద్భుతశక్తి వసించిరోయన
న్ఘనబిది కానన ద్వయము గాంచగఁగన్పడు రామభద్రుఁడా॥ ౧౩౨

చ. మలద కరూశనామకము మానితసంపదు పేతమైభువి
న్వెలసెను పూర్వమింద్రుడిట విశ్వవిరోధిని వృత్రుజంపియా
మలము కరూశము న్విడచి మంచివరంబులు దీనికిచ్చెనా
వలజనె కొంతకాలమని వార్యుడుబుట్టె సుకేతుడాఖ్యుడై॥ ౧౩౩

వ. అనుకేతుడను వానికి

క. దశశత గజబలయుతయును
వశవర్తిత సకల దనుజ వారయునౌయా
పిశితాశని తాటకనా
విశదీకృత దుష్టచరిత వెలసెను సుతమై॥ ౧౩౪

క. అదిగనె సుందుని వలనను
మదమత్తుల దుష్టచరితు మారీచాఖ్యున్
విదితాఖిల మాయాచయు
నదయుని సుబాహుడనియెడి యగ్దుష్టాత్మున్॥ ౧౩౫

క. ఆవనితయు తత్సుతులిట
నావర దేశముల నిటుల నడవుల గలప
న్పావన సంపదలన్నియు
ధీవర బాడమ్యె మిగుల దివ్యగుణాఢ్యా॥ ౧౩౬

క. దానినిఁ జంపగవలయును
మాననియని దలచవలదు మహిత గుణాఢ్యా
మానుల నెందర నైనను
మానుగ దునుమాడె బహుళ మాయల చేతన్॥ ౧౩౭

క. వనితయనుశంక విడువుము
మనమున గోవిప్రముఖ్య మాన్యుల గావన్
వనితనుజంపగ వచ్చును
మును శక్రుడు మంథరాఖ్య ముదితను జంపెన్॥ ౧౩౮

క. హరిహాయుని జంపదలచిన
వరవనితను కావ్యమాత వాసిగజంపెన్
సరసిజ నాభుడు గావున
వరగుణ జంపంగవలయు వనితను దీనిన్॥ ౧౩౯

క. అనునంతలోన తాటక
ఘనరూపముదాల్చి ప్రళయ ఘనరావమునన్
గనువారిగుండె లదరగ
గనబడియెను గన్నుగవకు గ్రక్కున నపుడే॥ ౧౪౦

చ. మునియపుడడ్డుజొచ్చి రఘు ముఖ్యునిగాంచి శుభంబునీకగున్
ఘనశరవహ్ని తాటకను గ్రక్కునగూల్చుము పాపభీతిచే
మనమున సంశయింపకుము మానినియంచు దలంపబోకుమీ
దినకరవంశమౌక్తికమ దీన శరణ్య జగద్ధితంబుగన్॥ ౧౪౧

—♦ తాటకా సంహారము ♦—

ఉ. మాయలమారి తాటక సమాహితగాఢ తమిస్రజాలయై
తోయదమట్ల బొబ్బలిడి తోరపువానను రాళ్ల తోడుత
న్వాయువిశేషయుక్తముగ వారిత చేతన సర్వచేష్టయై
పాయని వైరబంధమున పాటవమొప్పగ నిల్చెధీరయై॥ ౧౪౨

క. ఖరశరమున ఖలమాయల
పరిహారమొనరించి పిదప పటుశరహతిచే
ఖరవజ్ర నిహతిగూల్చిన
వరపర్వతమట్లుఁగూల్చె వనితను యక్షిన్॥ ౧౪౩

క. తాటకఁగూలిన గనఁగొని
దీటుగ మునివర్గమంత దీవనలిడుచున్
పాటిగ రాముని గొలిచిరి
వాటముగా దివిజులపుడు వచ్చిరి భువికిన్॥ ౧౪౪

వ. సకల దివిజులును దేవతాసార్వభౌముఁడగు శతక్రతునగ్రమున నిడుకొని రామలక్ష్మణ విశ్వామిత్రుల చెంతకేతెంచి

క. సురపతి కనుగొని రాముని
పరమానందంబు నొంది పరమతపస్విన్
పరమాప్త వచనరచనను
బరితోషిని జేసి బలికె బరమోత్సుకతన్॥ ౧౪౫

క. సురకార్యభారమంతయు
వరబాహుబలబూనునితను వరదుడవగుచున్
వరశస్త్రచయముగూర్పుము
పరిపూర్ణతనొందమిగుల పరమాప్తుఁడగాన్॥ ౧౪౬

క. అనిబలికియరిగెశక్రుఁడు
మునితిలకుఁడురాముఁజూచి ముదమునఁబలికె
న్ఘనమంత్రరాజినిచ్చెద
గొనుమిప్పుడెరామచంద్ర గొనములపేటీ॥ ౧౪౭

చ. నరగరుడామరాసురుల నాగ నభశ్చరసిద్ధసాధ్యుల
న్గరమరుదైనయుద్ధమున కష్టము వేశములేకఁగూల్చగా
న్స్థిరజయలక్ష్మినిగ్గనగ ధీరుల మెప్పునొందునట్లుగా
బరపెడినస్త్రశస్త్రముల బాగుగనిచ్చెదగొమ్ము రాఘవా॥ ౧౪౮

వ. అనిబలికి సుప్రక్షాళిత, పాణిపాదుండై జలంబుల స్పృసించి యాచమించి దనవలె శుచియై ప్రాఙ్ముఖాసీనుండై యున్న రామభద్రుని కరుణాదృష్టినవలోకించి క్రమక్రమంబున చక్ర భేదంబులగు దండచక్ర, ధర్మచక్ర, కాలచక్ర, విష్ణుచక్రంబులను, ఐంద్రాస్త్రంబును, వజ్రంబును, శైవశూలంబును, బ్రహ్మశిరంబును, బ్రహ్మాస్త్రైషీకాస్త్రంబులను, గదా భేదములగు మోదకీశిఖరీనామకంబులను ధర్మపాశకాలపాశ,వరుణపాశం బులను, శుష్కాశనియు, నార్ద్రాశనియు, పైనాకంబును, నారాయణంబు, నాగ్నేయంబు శిఖరంబు వాయువ్యంబు, ప్రథనంబు హయశిరంబు, క్రౌంచంబు, విష్ణుశక్తిని, శంకరశక్తిని, కంకాళంబును, ముసలంబును, కాపాలంబును, కంకణంబును, వైద్యాధరంబును, నందనంబును, నసిపత్రంబును, గాంధర్వంబును, మానవంబును, బ్రస్వాపనమును, ప్రశమనమును, సౌర్యాస్త్రంబును, దర్పణంబును, శోషణంబును, సంతాపనంబును, విలాపనంబును, మదనంబును, పైశాచంబును, మోహనమును, సౌమనంబును, తామసంబును, సంవర్ధనంబును, మౌసలంబును, సత్యాస్త్రమును, మాయాధరంబును, తేజఃప్రభంబును, సోమంబును శిశిరాస్త్రంబును, త్వాష్ట్రంబును, సుదామంబును, దారుణంబును, భగాస్త్రంబును, శితేషువు మొదలగుననేక దివ్యాస్త్రంబులనుపదేశించి తాను సక్రమంబుగ జపించి యర్పించి యుపసంహారాస్త్రంబులగు సత్యవంతంబును సత్యకీర్తినిధృష్టంబును రభసంబును ప్రతిహారతరంబును, పరాఙ్ముఖంబు, నవాఙ్ముఖంబు, లక్షాక్షవిషమంబులును, దృఢనాభ పద్మనాభ మహానాభ దుందునాభంబులను, దశాక్షతంబును, వక్రంబును దశశీర్షంబును, శతోదరంబును, జ్యోతిషంబును, కృశనంబును, నైరాశ్యంబును, విమలంబును, యోగంధరంబును, హరిద్రంబును, దైత్యంబును, ప్రశమనంబును, అర్చిర్మాలియు, ధృతిమాలియు, వృత్తిమంతం

బును, రుచిరంబును, పైత్రంబును, సౌమనసంబును, విధూతంబును, మకరంబును, కరవీరంబును, ధనధాన్య కామరూప కామరుచి మోహనావరణజృంభకసర్వనాభసంతానవరణాదుల,నుపదేశించి రామచంద్రా! "నీవుదానపాత్రుండవుగాన నావిద్యాధనంబంతయు నీయందర్పించి నేను కృతార్థుండనైతిని. నీవును నీసహోదరుండగు సౌమిత్రికిసర్వాస్త్రంబుల నుపదేశించుమనిన" రామచంద్రుడు సౌమిత్రికి సంహారోప సంహారాస్త్రంబులనెల్లనుపదేశించె. సర్వాస్త్రంబులును, మూర్తిమంతములై రామునకు దర్శనమిచ్చి మహాత్మా! మేమందరము నీకువిధేయులము. మాకుకర్తవ్యము నుపదేశించుమనిన రామచంద్రుడు భృశాశ్వబుత్రుల నందర విలోకించి బనిగలయపుడు మిమ్ముస్మరించెద. నపుడు విచ్చేసి యభిమతసిద్ధినొసంగుడనిన నాయస్త్రంబులు రామునకభివందనమర్పించి యథేచ్ఛజనినవి. రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రయాణోన్ముఖులై తాపసాశ్రమంబుల విలోకించుచు, నొకమహనీయ తపోవనమును విలోకించి రాము డిది యెవ్వరియాశ్రమమని యడిగిన రామచంద్రుఁ నవలోకించి విశ్వామిత్రుండు.

గీ. వామనుడుతొల్లియిచ్చట వైభవముగఁ
గాఢతపమునసిద్ధినిఁ గాంచెఁగాన
వామనాశ్రమమననొప్పె వసుధలోన
సిద్ధసంజ్ఞయుదీనికి సిద్ధమయ్యె॥ ౧౪౯

గీ. కశ్యపుడుతొల్లియిచ్చట కాంతతోడ
గాఢతపసునసిద్ధినిఁ గాంచినాడు
తిరిగివేసారిసిద్ధిని స్థిరముగాను
కాంచినాడనునేనిట కమలనయన॥ ౧౫౦

క. చిరకాలమిచటనుండితి
వరతపమునసిద్ధినొంది వరలితినృపుడా!
కరమరుదగుయజ్ఞంబును
విరవిగజేయంగనిన్ను వేడితిఁగాదే॥ ౧౫౧

క. క్రతుసంకల్పముఁజేసెద
వితథంబొనరింప వేగవిశ్వద్రోహు
ల్పతితాసురసంయుతులై
మతిహీనులుచేరఁగలరు మారీచాదుల్॥ ౧౫౨

క. వారలఁజంపుటకొరకై
వారిజదళనేత్రయేడు వారములిచటన్
వారకనిలువగవలయును
దారుణశస్త్రాస్త్రవర్మ ధారివికమ్మా॥ ౧౫౩

వ. రఘువంశపయః పాథోధిశశాంక! సకల సద్గుణనిలయ! రామచంద్రా! మనము ఆశ్రమమునకు చేరితిమి. నేనికమాటలాడుట తగదు. నీవునన్ను గరుణించి యిదిమొదలు నన్నురక్షించుము.

క. అనిబలికిమౌనవృత్తిని
చనిచనిదనగృహముఁజేరి చతురతమునుల
న్మనమలరఁబిలువఁనంపెను
మునులందరుచేరిరపుడు మోదముతోడన్॥ ౧౫౪

—♦ విశ్వామిత్రయజ్ఞము ♦—

చ. సవనముజేయఁనెంచి బహు సద్గుణశోభితలగ్నమందున
న్నవనపుదీక్షగైకొనియె నద్విధిఁగూర్చిరితాపసోత్తము
ల్కవచముమేనిపైనలర కార్ముకపాణులురామలక్ష్మణు
ల్సవనవిదూషకాధములఁ జంపగఁనిల్చిరిజాగరూకులై॥ ౧౫౫

వ. అపుడు కల్పసూత్రోక్త విధానంబుగ మంత్రవంతంబై యాగంబు ప్రవర్తిల్లుచుండ నైదుదినంబులు జనియె నారవదినంబున

సీ. తొలుదొల్తవినిపించె ఘోరంపునాదము లప్రియతోయదరవ ప్రతిభతోడఁ
నటుమీఁద భాస్కరు డగుపించకుండగ సాంద్రరజోవృష్టిచాలఁగలిగె
తరువాతజనములు తలలెత్తలేనట్లు పాషాణవర్షంబు బడియె నిగుల
పదపడిరక్తంబు పలలంబుఁబుర్రెలు వేదిపైశాలపై వేగఁబడియె

గీ. నసురసేనలతోఁగూడి యంబరమున
పన్నియగుపించెపాపసు బాహుఁడును దు
రంతసత్వుడుమారీచు డనెడివాడు
మాయలన్నియునెఱిగిన మలినతముడు॥ ౧౫౬

—♦ మారీచ సుబాహు విజయము ♦—

క. సాగరపూరమునందున
బాగుగ యోజన శతంబు బరగిన మేఱ
న్వేగమె మారీచాఖ్యుని
సాగిలిబడ మానవాస్త్రి సంగతి నేసెన్॥ ౧౫౭

శా. శోణస్ఫూర్తి వహించు నేత్రయుగళి న్శోభిల్లు రాముండు గీ
ర్వాణ స్తోమము మెచ్చి చూడ ననలాస్త్రి ప్రోద్ధతి న్పూర్వ గీ
ర్వాణ శ్రేష్టు సుబాహు జంపి యన లాస్త్రి ప్రచ్యుతిదైత్యులం
ప్రాణ ప్రచ్యుతిజేసి గాచె క్రతువు ప్రఖ్యాత పీర్యోన్నతిన్ ౧౫౮

వ. ఇట్లుక్రమంబున సుబాహు మారీచుల తత్పరివారమును జయించి రాముడు సకల మునివరులచే బ్రస్తూయ మానుండయ్యె. గాధేయుడు దన యజ్ఞమును నిర్విఘ్నముగ నిశ్శేషముగ, నిష్ప్రాయశ్చిత్తముగ, సంపూర్ణ దక్షిణాలతోడ పరిసమాప్తినొందించి, యాగ

దీక్షను జాలించి మౌనవ్రతంబు వీడి మనోనయనంబుల కమందానంద సంధాయి యగు శ్రీరామభద్రు గనుంగొని గాఢాలింగన మొనర్చి వేదవాక్యంబుల గొనియాడి

క. నను కరుణఁ గాచినాడవు
ఘన దైత్యులఁ జంపినావు, ఘననిభ దేహా!
మనమున సంతసమందితి
మునిబృందము నిన్నుఁ గాంచి ముదమును బొందెన్॥ ౧౫౯

క. కృతకృత్యుని నను జేసితి
వతిసుకుమారుండ వౌట ౘనలసితివయ్యా
ప్రతి సేయఁ జాలువాడనే
పతివౌటను జనులగాచు భారమునీదే॥ ౧౬౦

క. నీకతమున నీవిపినం
బకలంకానర్ఘనామ భాజనమయ్యె
న్నీకతమున నాకిప్పుడు
సుకరంబుగ కార్యసిద్ధి సొంపుగ గలిగెన్॥ ౧౬౧

వ. కకుత్థ్స వంశతిలకులగు నోరామలక్ష్మణులారా! మత్పూర్వపుణ్య విశేషంబున మిమ్ము సేవించుటయు, మీ యనుగ్రహ పాత్రుడ నగుటయు, కలిగినది కృతార్థుడనైతిని. నాతపస్సు ఫలించినది. నాపూర్వులందరును సద్గతిని బొందిరియనిపచించి సుఖంబుగ నారేయి విచిత్ర కథాలాపంబుల కొంతతడవుబుచ్చి సుఖనిద్రం జెందిరి. పరదినంబున ప్రభాతకాలంబున కాల్య కరణీయంబుల దీర్చి రామలక్ష్మణులు పావకు చందంబున దేజరిల్లుచున్న విశ్వామిత్రుని చరణంబులకు వందనంబు లాచరించి తక్కిన మునులకు నమస్కరించి మధురంబులగు వాక్యంబుల విశ్వామిత్రున కిట్లనిరి.

క. మునివర నీకింకరులము
ఘనకృపఁ, జేయంగఁ దగిన కార్యముఁ జెప్పుమీ
ఘనమైన కార్యమైనను
మనమలరఁగఁ జేయఁగలము మహితమనీషా॥ ౧౬౨

క. అనిబలికిన మునిచంద్రుడు
మనమున నానందమంది మధు మధురముతో
ఘనవాక్య వితతిబొగడుచు
దినకరకుల రామచంద్ర దీపిత చరితా॥ ౧౬౩

క. అల మిథిలేశుఁడొ న్నృపుఁడు
విలసితమౌయజ్ఞమొకటి విధివిహితముగా
నలయకఁజేయుచుఁనుండెను
ఖలమర్దన! మనముఁబోయి గనుగొనవలయున్॥ ౧౬౪

వ. రామచంద్రా! మిథిలేశుడగు జనకుని మందిరమున పూర్వకాలమున నిమియనువానికి నారవపురుషుడగు దేవరాతుడనువానికి, దివిజులు పురమర్దనుని విల్లొసగిరి. యదిసుత నావిల్లును జనకవంశీయులందరును కడు భక్తినర్పించుచున్నవారు. ఆవిల్లు సుమేరుసారమైనది. ఆవిల్లున నారి గూర్చిన నీకు కల్యాణమగును. మనమచట కరిగి యాతని యజ్ఞము నవలోకింతము నవిబలికిన విని రామలక్ష్మణులు నవ్విరి. అంత విశ్వామిత్రుండును రామలక్ష్మణులును, తత్రస్థమునులందరును శకటంబుల నాయత్తపరచి కదలి నడచి సాయంసమయమునకు శోణానదీసమీపమునకుజేరి యచటవసించి సాయంసంధ్యనుపాసించి సుఖోపవిష్టులైరి. యపుడు విశ్వామిత్రుడు రామునవలోకించి దశరథరాజనందనా! బ్రహ్మపుత్రుడగు కుశునకు కుశాంబుడు, కుశనాభుడు, వసువు, ధూర్తరజుడు అనునల్వురు పుత్రులుద్భవిల్లిరి. యందు కుశాంబుడు కౌశాంబి యను పురమును నిర్మించె. కుశనాభుడు మహోదయమను పురమును నిర్మించె. ధూర్తరజుడు ధర్మారణ్యమనుపురవరమును గట్టించె. వసువు

గిరివ్రజమును నిర్మించె. నిపుడుమనము నివసించియున్న యీభూమివసు పాలితమైనది. యిది మాగధీనదీజలస్పర్శమున సంపూర్ణ సస్యశాలియై యున్నయది. కుశనాభుడు ఘృతాచియందు నూర్వుర సుతులగనియె. వారలు వాయుమోహితులై యాతని కోరిక దృణీకరించి వాయువీడి తలై కుబ్జలైరి. వారిని కుశనాభుడుగని వారి మనోదారుధ్యమునకు మెచ్చి వారినందర కుశనాభుడు బ్రహ్మదత్తుడను మహానుభావునకొసగి పరిణయమొనర్చె. బ్రహ్మదత్త కరస్పర్శమున నావనిత లందరును కుబ్జాత్వదోషవిహీనలై రమ్యాకృతిగలవారై శోభిల్లిరి. యాకుశనాభునకు పిదప గాధియను మహానుభావుడు పుత్రుడుద్భవిల్లె. గాధికి నేను పుత్రుండను. నా సోదరిసత్యవతియను కౌశికీనది ప్రకాసించుచున్నది. నేను బహుదేశంబుల దిరిగి మిగుల శ్రమనొంది తపస్సునొనర్చితిని. తుదకు సిద్ధాశ్రమంబున తపస్సిద్ధుడనైతిని రామభద్రా! యవలోకించుము. చీకటిసూచీభేద్యమైయున్నది.

గీ. కన్నుగవయుండిరూపము గానకుండ
చేయగలిగెనుతమస్తతి చిత్రగతిని
తరులగిరులనునదులను ద్రవ్యవితతి
నీలివస్త్రంపు ముసుగున నిలిపెగనుము॥ ౧౬౫

క. గిరిగుహాలకోటరంబుల
వరవనములవాగులందు వరఖగమృగముల్
వరగృహములనరవరులును
నెటిసెడి పడియుండగలిగె నిద్రాసక్తిన్॥ ౧౬౬

చ. తొవలకుమేలుఁగూర్చియల తోయజవైరినిద్రలేపిప
ద్మవనముకాంతిఁబాపి సురతండమునున్సుధమేపివేగన
ర్ణవమునుఁబొంగఁజేసిర నాయక! తావకకీర్తివేషధా
రివెడలెనోయటంచనెడి రీతినిచంద్రుడుయొప్పెప్రాగ్గిరిన్॥ ౧౬౭

వ. రఘుకులావతంసమా! కౌసల్యాతనయ! రాత్రిచాలఁగఁ నయ్యెఁనిట్లు మేల్కొనియుండినఁనెల్లి జాగరూకజనితమగు పరిశ్రాంతివలన ప్రయాణ విఘ్నంబుగలుగును గాన జాగుసేయక సుఖనిద్రఁజెందుమనిబలికి యం దరును మృదుకిసలయతల్పంబులబండిరి. యంతరేయి వేగ

క. శతపత్రకుట్మలాంత
ర్గతమధుపయుగములలేపి కమలాప్తఘృణుల్
తతగాఢతమస్స్తోమ
ప్రతతిని పోదోలుచుండె ప్రాభవశక్తిన్॥ ౧౬౮

గీ. అంతమునులును నరపతు లంతికావ
నీరుహంబులగల పక్షి నినదములను
మేలుకొని యాహ్నికంబుల మేలుగాను
దీర్చిశ్రోవను నడిచిరి తీరుగాను॥ ౧౬౯

వ. మునులు జనుశ్రోవను శోణానదినిదాటి భాస్కరుడు శిరో గతుడగు వఱకును నడచి సమస్త దురితాపనోదన సమర్థయగు గంగను సేవించి యందు గృతావగాహనులయి మాధ్యాహ్నికంబుల నెఱవేర్చి యమృత తుల్యంబగు హావిశ్శేషంబు భక్షించి తజ్జలంబుల ద్రావి యమ్మహానదీతీరంబున నొక్క రమ్యప్రదేశంబున నావాస పరిగ్ర హంబుఁ జేసియుండిరంత రఘుకుల హంసతరళంబగు శ్రీరామచంద్ర మూర్తి సకలార్థ విదగ్రేసరుడగు విశ్వామిత్రు నవలోకించి

క. మునివర యీగంగానది
గనుగొన మార్గంబుఁ గలిగెఁ గావునగరుణ
న్వినిపింపు దీనిచరితం
బనకౌశికుడిట్టులనియె నద్భుత ఫణితిన్॥ ౧౭౦

గీ. గంగయని నోటఁబలికిన గాఢభక్తి
కలుషములుబోవు పరమార్థ గములు గలుగు
సకలదిక్కుల విజయంబు సంభవించు
పుత్ర పౌత్రాభివృద్ధియు బూనఁగలుగు॥ ౧౭౧

—♦ గంగా పార్వతుల జననము ♦—

వ. రఘువంశ పావన ! రామచంద్ర ! పూర్వకాలంబున సుమేరు పుత్రికయగు మేనక హిమవంతునకు పత్నియై గంగా పార్వతులను నిద్దర కూతుండ్ర గనియె. యందు గంగను దివిజులు ప్రార్థించి త్రివిష్టపమున నదీరూపంబున నిలిపిరి. రెండవదియగు పార్వతి శ్రీకంఠుని పడతియై దనభర్తతోడ కైలాసమందున నిలచె.

సీ. శ్రీరామ ! వినవయ్య శ్రితజన కల్పక ! తావకవంశాబ్జ తరణియైన
యసితునిబుత్రుడు హరిసమ తేజుడు సగరాభిధానుడు చక్రవర్తి
నిజయశశ్చంద్రవి నిర్మల చంద్రికా ధవళిత రాజిత దశదిశుండు
నిజవిత్తపూరిత నిఖిలావనీస్థిత భూసురభాసుర భూరిగృహుడు

గీ. బాహువిక్రమ నిర్జిత పార్థివుడు
విదిత నిగమార్థజనిత వివేకయుతుడు
సాధుసన్నుత శమదమ సత్యరతుడు
పరిజనీకృత బహువీర పటలుడొప్పె॥ ౧౭౨

వ. అట్టి సద్గుణ భాజనుండగు సగరచక్రవర్తి దన ప్రియపత్నులగు కేశిని సుమతి యను పతివ్రతా మణులతో బ్రకాశించుచుండిరి. వారిలో

క. అసమంజ సాఖ్యుబుత్రుని
ప్రసవించెను పెద్దభార్య పాపాసక్తు
న్విసముల నరువదివేలను
ప్రసవించెను సుమతి భవ్య భావుల సుతులన్॥ ౧౭3

వ. వారిలో నసమంజసు డన్వర్థాభిధానుడై యయోధ్యన్గల బాలుర ననేకుల సరయూ ప్రవాహంబున విసరివేయుచు బ్రజల ననేక విధముల బాధించి తుదకు కారాగృహ వాసుండయ్యె. సుమతి పుత్రు లరువదివేల బాలురు దినదిన ప్రవర్థమానులు, మహాబల పరాక్రమ వంతులు, పితృవాక్య పరిపాలకులు, ధర్మమార్గానుసక్తులు, పితృప్రియులు అగుచు వర్తిల్లుచుండిరి.

గీ. అట్టిపుత్రులతోగూడి యర్హవిధుల
నశ్వమేధంబులను జేసె నద్భుతముగ
శతతమాశ్వమేధంబును సలుపదలచి
యయువు విడిచెను పరిపూర్ణ యశమునొంద॥ ౧౬౪

వ. అశ్వమును సగర పుత్రు లరువదివేల మహావీరులు రక్షించుచు దోడజనిరి. భూలోకమున గల రాజెవ్వడును దానిని బట్టువాడు లేక పోయెను. పాకశాసనుడది శతాశ్వమేధమగుట దనపదవికి లోపంబు గలుగునని దలచి మాయదానిని గొనిచని పాతాలంబున కపిలాశ్రమంబున విడిచె. సగర పుత్రులు యయువును గానక నగస్త్యపీతంబగు మహార్ణవమును త్రవ్వి దానిని యథాపూర్వముగ నిండించిరి. యది మొదలు మహోదధికి సాగరమని పేరుకలిగె. నాదారిని సాగరులు పాతాలంబునకు జని కపిలాశ్రమంబున దమ యశ్వమును గాంచి పరిశీలన లేనివారగుట కపిలుడే యశ్వచోరుడని యాతని బాధించి క్రుద్ధ కపిల నేత్రాగ్నిని భస్మప్రాయులై పడిరి. యట నయోధ్యను సగరుడు దన పుత్రుల జాడయు, తురంగమ వృత్తాంతమును దెలియ, నసమంజస పుత్రు నంశుమంతుని బంపించె. నాతడు భూలోకమునంతను దిరిగి దన మాతులుండగు గరుత్మంతుని వలన తురంగమ స్థితిని సగరపుత్రుల

భస్మప్రాయులగుటను గంగ వారిపై బ్రవహించిన గాని వారికి సద్గతి లేదనియు దెలిసి కపిలుని యనుగ్రహము నార్జించి తురగమును సగరున కర్పించె. నంత సగరు డశ్వమేధమును పూర్తి యొనరించెనంత. సాగరులపై గంగను బ్రవహింపజేయుటకు సగరుడును, అంశుమంతుడును, తత్పుత్రుడగు దిలీపుండును సమర్థులు గాకపోయిరి. దిలీప పుత్రుడగు భగీరథుడు రాజ్యమును మంత్రుల కర్పించి తాను గోకర్ణక్షేత్రంబున శతానందునిగూర్చి తపంబొనర్చి మెప్పించిన శతానందుడు నీతోడ గంగ జనుదెంచును. గాని గంగ భూతలంబున బడునపుడు భరించ దగినవాడు శంకరుడు దప్ప మరియొకడు లేడుగాన నీవు శంకరుని బ్రార్థింపుము అని వచించెను. భగీరథుడు శంకరుని గూర్చి తీవ్రతపం బొనరించె. శంకరు డనుగ్రహించి గంగను దన జటా జూటంబున ధరించె. నటనుండి బిందు సరోవరంబునబడి ప్రవాహ సప్తకంబు తూర్పునకును, ప్రవాహత్రయము పశ్చిమ ముఖాభిముఖముగను బోయెను. యొక దివ్య వాహిని భగీరథ నృపాలుని వెంటనంటె, భగీరథుడు రథారూఢుడై యతివేగముగ బోవుచుండ గంగయు నాతని వెనుదగిలి బోవుచుండెను. మధ్యను జహ్నుని యజ్ఞ వాటంబు జలప్లవమగుట జహ్నుడాగ్రహించి యాగంగా ప్రవాహమును నోరుదెరచి మ్రింగి వేసెను. భగీరథుడద్దానిని గాంచి చింతించి జహ్నుని బ్రార్థించిన జహ్నుడా ప్రవాహమును దన కర్ణ వివరములనుండి విడిచెను. గాన జాహ్నవియను నామంబు బడసెను. పిదప జాహ్నవి భగీరథు ననుసరించి జని సాగరంబునబడి కడలెత్తి నిండి వెల్లిగొని రసాతలంబునకు జేరి సాగరుల భస్మరాసులపై బ్రవహించి వారల నుత్తమలోకప్రాప్తుల నొనర్చెను. అని వచించిన విని సంతసించి శ్రీరామమూర్తి మహానుభావా! మనకగ్రభాగమున గనిపించు పురవరమును బాలించు రాజె

వ్వడని యడిగిన విశ్వామిత్రుడు రఘుకుల తిలక! వినుము. దేవదానవులు సాగర మథన మొనర్చినపుడు ప్రథమమున హాలాహలము జనించె. నద్దాని శంకరుడు దనగళంబున ధరించె. పిదప ధన్వంతరి ప్రాదుర్భూతుడయ్యె. నతడు వైద్య ప్రధానుడయ్యె. నంత క్రమంబున నప్సరసలును, వారుణియు, నుచ్చైశ్రవంబును, కౌస్తుభంబును, పీయూషంబును, జనించినవి. యుచ్చైశ్రవమును శక్రుడును, కౌస్తుభమును, విష్ణుండును, వారుణిని దేవతలును, గైకొనిరి. అమృతమును గ్రహించుటకు దేవదానవులు దారుణ యుద్ధ మొనర్చిరి. చక్రపాణి మోహినీ రూపధారియై దానవుల మోసగించి దేవతల కమృతము నొసగెను. దేవతలు దానవుల నిర్జించిరి. శక్రుడమరావతిని నిల్చి జగత్రయమును బాలించుచుండెను. దితి దనభర్తనాశ్రయించి యనుగ్రహమును వడసి గర్భవతియైయుండి తపంబు జేయుచుండ వినయంబున జేరి కపటమార్గ నిరతుడగు శక్రుడు దితికి శుశ్రూష జేయుచుండె. నొక దినంబున దితి ప్రమాదవశంబున గాల్గడ దలయంపిగా బండి నిద్రించుచున్న నదిగని యిదియె యదునని దలచి గర్భకుహరమున బ్రవేశించి గర్భస్థ శిశువును కులిశాహతిని యేడు ఖండములుగ దునిమె. నాసప్త ఖండములును సప్తమారుతంబులయి వాయుస్కంధంబుల కధిపతులైరి. దితికిశక్రుడు శుశ్రూషజేసిన ప్రదేశ మిదియె. యిట నిక్ష్వాకుడలంబుస యందుగనిన, విశాలుడను రాజు పట్టణ మొకదానిని నిర్మించినవాడు. అది యిదియె దీనికి విశాలమనియు, వైశాలమనియు నామంబులుగలవు. విశాలుని బుత్రుడు హేమచంద్రుడు. హేమచంద్రుని తనయుడు సుచంద్రుడు, సుచంద్రునకు ధూమ్రాశ్వుడు, ధూమ్రాశ్వునకు సృంజయుడు, సృంజయునకు సహదేవుడు, సహదేవునకు కుశాశ్వుడు, కుశాశ్వునకు సోమదత్తుడు, సోమదత్తునకు కాకుత్స్థుడు, కాకుత్స్థునకు

సుమతి యనువాడుబుట్టె. యిప్పుడు సుమతియనువాడు విశాలానగర మును బాలించుచున్నాడు. యీ వంశములోని వారందరు వైశాలికు లనబడిరి. మనమీరాత్రి యిటవసించి రేపకడలేచి మిధిలాపురమున కేగెదమని ఒలుకుచున్న సమయమున విశ్వామిత్రాగమనమును వినిన సుమతి మంత్రి పురోహిత యుక్తుడై చేరి మ్రొక్కి సపర్యలు జేసెను. రామలక్ష్మణులగని దాశరధులని దెలిసి సంతసించి వారినందర దనగృహంబునకు గొనిచని యర్చించి యతిథి సత్కారముల నొనర్చె నంత వారందరు మిధిలాపుర మార్గంబునుబట్టి పోవుచుండిరి. దూరంబున

క. గన్నులపండువు గాగను
సన్నుతమగు మిధిలగనిరి సంతోషమునన్
మన్ననగల మునిగణములు
తెన్నున గనిపించిమునిని తీరుగగొలువన్॥ ౧౭౫

వ. ఇట్లు త్రోవనడుచుచు నొకచోట బురాణంబును, రమ్యం బును, నిర్జనంబును నగు నొక మహనీయాశ్రమమును విలోకించి రామచంద్రుడు విశ్వామిత్రునవలోకించి యిట్లనియె : మహానుభావ !

క. కమనీయ వనమునందున
రమణీయ తటాకమొకటి రాజిలుచుండెన్.
సమలోష్టకనకులెవ్వరో
దమయాశ్రమ మిటులవిడిచి దామెటజనిరో॥ ౧౭౬

గీ. అనెడి రాముని మాటల కలరితపసి
వినుమువినుపింతు వీనుల వింతగూర్చు
కధలుగలిగిన గౌతమ కాంతచరిత
మనుచుబలికెను మనమున హర్ష మొదవ॥ ౧౭౭

సీ. తర్కామరాపగ ధరణిఁబూతము జేయ ప్రభవించె గౌతమ భవ్యవలన
వంశతానందుఁడు వదన మొక్కటిఁబూని బుట్టఁ గాంచెను బుత్రుఁడగుచు
వదనాబ్ధిఁబొడమిన వరసూత్రరత్నాళి విప్రులగృహములఁ విసరె నెవఁడు
సర్వాంగసుందరి సద్ధర్మపత్నియై యలరారె యెవ్వని కలయహల్య

గీ. సకలవిదుఁడైన గౌతమ సంయమీంద్రు
డర్కసమతేజుఁడవ్యయా నందయుతుఁడు
యోగిజనవంద్యచరితుఁడు యోగవిదుఁడు
చిరమునివసించె విషయప్రజేతయచట॥ ౧౭౮

గీ. అతని పడఁతి యహల్యాఖ్య నతివమిన్నఁ
గన్నులనుఁగాంచి కడలేని కామమోహ
వశతగుందుచు వివశుఁడై వ్రజియించుచట
సమయమరయుచు నుండెను సాధుశీల॥ ౧౭౯

ఉ. చేరల మించుగన్నులును చెన్నగు శ్రీలను గెల్చు కర్ణముల్
బారల గొల్వఁగాదగిన భవ్యశిరోజము లర్ధచంద్రుని
స్థిరుగ గెల్చు ఫాలముచు తియ్యని మోవియు తేటనవ్వులు
న్వారని ముష్టిమధ్యమును వాసిగఁగాంచి విభిన్నధైర్యుఁడై॥ ౧౮౦

క. గౌతమ పరిణయమాదిగ
కౌతుకమావంతలేక కౌశికుఁడెపుడున్
చేతముగ్రాగగఁ నిచ్చట
వీతస్వర్గాధిరాజ్య విభవుండయ్యెన్॥ ౧౮౧

వ. ఇట్లు కామాతురుండై దురితభీతివిడిచి సమయంబు గాంక్షించుచు ప్రచ్ఛన్నుండై చిరంబట వసించి యొకదినంబున నిశాసమయంబున తామ్రచూడ నాదంబొనర్చిన రాత్రివేగుటగా ముని

దలచి స్నానార్థియై నదికి జనుట బరికించి పురందరుండది యదునని దలచి గౌతమరూపంబున నహల్యం గలిసి యాశ్రమంబు నతిక్రమించుచుండ గౌతముఁడు సన్నిహితుఁడై యోగదృష్టి నంతయు దెలిసి నిందించి యఫలుండవు, నిందిత శరీరుడవు, గమ్మని శపించి యహల్యం గని వాయుభక్షవు, నిరాహారవు, భస్మశాయినివియు, సర్వభూతాదృశ్య శరీరవు గమ్మని శపించిన, నహల్య పాదములపై బడి శాపనివృత్తి ననుగ్రహింపుమని ప్రార్థింప, వర్షసహస్రానంతరమున దశరథపుత్త్రుండగు శ్రీరామచంద్రుడీ నిర్జనవనమునకు విచ్చేయును. తత్పాదరజఃకణపూతవై దురితవిముక్తవై మద్దర్శనంబును మత్సాన్నిధ్యమును లభింప గలవని బలికి యీ యాశ్రమంబువిడిచి హిమవంతంబున కేగె. గాన నీ యాశ్రమంబు గౌతమాశ్రమంబు నీవు సత్వరంబుగ నీ యాశ్రమ భూమిని బ్రవేశించి యహల్యామహాదేవిని పూతచరితగా నొనర్పుమని బలుకుచు నడుచుచుండ

సీ. కన్నులకెదుటను కమనీయమైనట్టి కాంతియొకటిముందు గానబడియె
మెఱుగుదీగనుబోలి మెఱసెనుబిమ్మట నగ్నిశిఖనుబోలి యలరె మిగుల
నవయవచలనంబు నగుపించెతొలిదొ ల్త నవయువియనిదోచె నద్భుతముగ
నతిసుందరంబైన యబలాశిరోమణి యతివినయంబున నరుగుదెంచి

గీ. యర్ఘ్యపాద్యాదులర్పించె నధికభక్తి
నంత గౌతముడేతెంచి యర్హవిధుల
రాముబూజించి కౌశికు రహినిగొలిచి
మగువతోఁగూడి యరిగెను మహితవనికి॥ ౹౨౦౹

వ. అంత విశ్వామిత్రుండును, రాజసుతులును, కొంతదవ్వటికి యగ్రభాగంబున

సీ. సతతోద్ధితోన్నత సద్ధోమధూమంబు గగనమండలమున కదల గూర్ప
నానావిధోత్తుంగ నవ్యధ్వజాంచిత వరరత్నకిరణము లెమరువు లీన
జలయంత్రనిష్ఠ్యూత జలధారలంతట వార్షికధారలై వరలుచుండ
ఘనమృదంగారావ ఘనరమ్య శ్రుతిఘోష కమనీయకలరావ కలన మెఱయ

గీ. జనకనృప యజ్ఞ వాటంబు సాధుహృదయ
కమల కేదార సంతోష కమలపూర్తి
గలిగి కన్నులు గలవారి కన్నుగవకు
ముదముఁ గలిగించె సకల సన్మోహముగను॥ ౧౮౩

చ. మునులును రాఘవుల్లనను మోదముతోడుత గొల్చియుండగా
ఘనుడగు కౌశికుండచట గల్గిన చక్కని చెట్లనీడలో
మనసున కింపు గూర్చగల మంచిసరోవర తీరమందునన్
జనక నృపాలశేఖరుని జన్నపు చక్కి వసించియుండగన్॥ ౧౮౪

వ. విశ్వామిత్రాగమనమును విని జనకుడత్యానందము నొంది తగిన సమయావకాశమున.

సీ. జనకుడు గురునితో జయ్యన జనుదెంచి భక్తిని యర్చించి బలికె నిటుల
పావన! నీవిప్డు పావనమొనరింప జనుటిమ్ము నాయజ్ఞ సదనమునకు
అననట్లనేయని యాయజ్ఞవాటంబు చేరితగిన చోట జెలగియుండె
నవకాశ మొదవిన యవనీశుడామౌని కౌశికుగనుగొని కరముభక్తి

గీ. దయను దయచేసినాడవు ధన్యమయ్యె
వంశమంతయు ధన్యంబు వసుధయెల్ల
తపము బండెను జన్మంబు ధన్యమయ్యె
కలిగె కళ్యాణములు యింట గలిగె సిరులు॥ ౧౮౫

గీ. పదిరెండు దినములింకను
పదిలముగా జరుగు క్రతువు భాస్వర తేజా
తుద దేవత లరుదెంతురు
మదిముదమును బొందనిలుము మద్గృహమందున్॥ ౧౮౬

వ. అనిబలికి మదననలకూబరులవలె దన యగ్రభాగంబున నల రారుచున్న మహా తేజోవంతుల క్షత్రియవీరుల, బాలురవీక్షించి తద్రూప లావణ్యాతిశయంబుల కత్యానందమునొంది మునిపుంగవు నవ లోకించి

క. యీ బాలు లెవరొ జెప్పుము
యీభవ్యులజూచి చిత్త మింపును బొందెన్
యీభాగ్య రేఖ గాంచిన
నాభాగ్యమె యిటులవచ్చె నా,యనియెంతున్॥ ౧౮౭

వ. అను జనకవాక్యములవిని విశ్వామిత్రుడు జనకు నవలోకించి

సీ. పరిచిత పరమార్థ పారగుండవు నీవు భాగ్యవంతుడవని బలుక వలెనె।
సకల శాస్త్రంబుల జదివినవాడవు సత్యమరయనీవు జాలలేవె
తపముమిక్కిలిజేసి దనరినవాడవు దలచినయదియెల్ల దనరకున్నె
జ్ఞానవిజ్ఞానార్థ సంపత్తిగలవాడ వవిదితమొకటైన నలరగలదె

గీ. యాజ్ఞ్యవల్క్యుని కృపచేత యజ్ఞవితతి
విజ్ఞతతి మెచ్చ జేసితి విధిహితముగ
నీదు భాగ్యంబుగనుగొన నిరుపమంబు
లోకజననియె నీయింటిలోననుండె॥ ౧౮౭

వ. నీవు సర్వవిధముల ధన్యుడవేయైనను నేను జెప్పెడిమాటల వినుము.

సీ. రఘువంశపాథోధి రాకాశశాంకులు సార్వభౌమాన్వయ సంభవులును
వివిధాస్త్రశస్త్రాళి విజ్ఞులుశూరులు విజయవిఖ్యాతులు వీర్యయుతులు
తాటకాసంహార పాటవశక్తులు మారీచమర్దన మర్మవిదులు
ఖలసుబాహుకలన గడపినవారలు ఖలమాయలనుదోలగలుగువారు

గీ. యజ్ఞమును నన్ను గాచిన తజ్ఞవరులు
మనయహల్యనుగాచిన మహితమహిము
లార్యగౌతమపూజితు లార్యమతులు
భవ్యతేజులు భవదీయ బంధువరులు॥ ౧౮౮

వ. జనకరాజేంద్ర! వీరు మీకు సఖ్య సంబంధములుగల భాస్కరవంశ్యులు, దశరథపుత్రులు, భగవద్భావములవలె నలుగురుసోదరులు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నాభిధానులు. వారలలో నితడు మధుమధుర రామాభిధానుడు లక్ష్మణాభిధానుడితడు. భవద్గేహంబున నలరారుచున్న ధనూరత్న కన్యారత్నంబుల కరగ్రహణం బొనర్ప నీరామచంద్రునకు కుతూహలంబుగలదు. సర్వసంపత్ప్రపూర్ణుడవగు నీకుగల యదృష్ట జామాతృత్వ దోషంబపహరింప నీతండు సంపూర్ణ సమర్థుడు. నీవు సంసిద్ధ సంకల్పుడవు. ధన్యుండవనిన విని జనకు

దత్యధిక హర్ష పరవశుడై భగవంతుడవగు, కుశికవంశపావన! విశ్వా
మిత్రా! నీవు మాదృశ పామర జన సంరక్షణావ్యగ్రమనస్కుడవై
లోకోద్ధరణకై దిరుగుచుంటివా! నేనెంతధన్యుడను. భవదీయాగమనంబె
మదీయ భవ్యభాగ్యోదయంబునకు హేతుభూతంబు. సత్కుల ప్రసూ
తులు మహాతేజో విరాజితులు అగు రాఘవులతో సంబంధములు
సంభావింపజేసి నన్ననుగ్రహింపదలంచు చుంటివి. యపరవిధాతవగు
నీకు సాధ్యముగాని దేదిగలదు. మహాత్మా! యీ నాశరీరమును నారా
జ్యమును నా సర్వస్వమును సర్వమును నీయధీనము. నీసంకల్పాను
సారము నొనర్పుము అనుగ్రహింపుము. నేను భవదీయాజ్ఞాకరుడను
కింకరుడనని చేతులు జోడించి నమస్కరించె నంత శతానందుడు

ఉ. ఆనుడు లాలకించి యతి హర్షముతోడ నహల్యపట్టియా
భానుకులాగ్రగణ్యుగని భావమునందున బొంగి కౌశికా!
కాననభూమి గాంచితివె గౌతమపత్నిని నాదుతల్లిని
న్గానగవచ్చెనే గురుడు క్రమసుమంబుల రాముగొల్చెనే॥ ౧౯౦

గీ. అడవియందలి సుమముల నమలభక్తి
భానుకులజాతు రాముని భవ్యగుణుని
వింత యమృతంబు జిల్కెడి విశదనాము
పూజజేసెనె మాతల్లి పుణ్యగరిమ॥ ౧౯౧

గీ. సర్వదేవులచే నర్చ నలుపదగిన
రాముపూజించి భర్తతో రమ్యవనికి
పరమ పావని నాతల్లి పరమనియతి
జనియె గాబోలు గతపాప జాతయగుచు॥ ౧౯౨

సీ. సర్వభూతంబులు జాలవుగాంచగ కరువలియాహార కలితయయ్యె
భసితంబె ప్రక్కగ బహువర్షశతములు జనియె నాతల్లికిజగము మెచ్చ
కరుణగావగ నెంచి కమలాక్షురఘురాము కౌశలమున దెచ్చె కౌశికుండు
యీ రాము కరుణచే నీయహల్యాదేవి బడసెను భర్తనుబరమనియతి

గీ. నాదుభాగ్యంబు బండెను నవ్యముగను
తపము ఫలియించె మనమున దవిలెముదము
చెవులఁగన్నులపండువు జేఁగలిగె
బ్రతికినాడను సుఖములు బడసినాడ॥ ౧౯౩

వ. అని బలుకు శతానందుని గనుగొని విశ్వామిత్రుండు.

చ. సమయము దాటకుండఁగనె సత్క్రియలెల్లను జేసివేగమే
సుమ సుకుమారి నీజనని సువ్రతుభర్తనుబొందె భక్తిమై
కమల దళాక్షి రేణుకయు కాంతుని భార్గవు బొందినట్లుగా
సమయము మంచిదైన సరసంబుగజెల్లును గాదె సర్వమున్॥ ౧౯౪

సీ. అనిన శతానందుఁ డానంద వశమున రామునిగనుగొని రామచంద్ర
స్వాగతమా నీకు స్వర్గేశ వైభవ దైవమునిన్నిట దయనుదెచ్చె
అపరాజితుడగునీయపరవిరించిని యనుసరించితివయ్యయార్యవినుత
బ్రహ్మర్షియీయాతడు ప్రబల తపంబున నీతని తపమెంచ నెవడుశక్తు

గీ. డితడు నీకుశుభంబుల నెల్లగూర్చు
ధన్యతముడవు నీవయ్య ధరణియందు
చెప్పెదను వీనిచరితంబు తెలగివినుము
రామరఘురామ శ్రీరామ రమ్యనామ॥ ౧౯౫

## — విశ్వామిత్ర చరిత్రము —

వ. శ్రీరామచంద్ర నేను నిన్ను లోకమునందలి రాజమాత్రునిగ దలచి మాటలాడుచుంటినిగాని పరమార్థమునెరుగుదును. నాయపరాధంబుల క్షమింపుము. యీ విశ్వామిత్రుడు పూర్వకాలమున, నిజరాజ్యపరిపాలనమొనర్చుచు మహాసేనా పరివృతుడై మృగయా వినోదార్థ మరణ్యమునకేగి యొకప్పుడు వశిష్టాశ్రమమునకు జేరిన

బ్రహ్మపుత్రుడగు వశిష్ఠుడు సపరివారుండగు విశ్వామిత్రుని దనకల్మాషి యగు నందినీ ధేను ప్రభావంబున సకలవస్తు సమృద్ధంబుగ నతిథి సత్కారం బొనర్చిన దనసేనాంతర్గత సకల జనులును సకల జంతువులును మంత్రి సామంతాదులును దమజన్మమున నెఱుగని సుఖాతిశయంబును సంతోషాతిశయంబును బొందిరి. యంత నీవిశ్వామిత్రుడు చూపోపశ నసూయాగ్రస్తుడై యాగోరత్నమును దానపహరించదలంపు గలవాడై వశిష్టునవలోకించి 'రత్నహారీతుపార్థివః' యనునట్లు యీగోరత్నము నాచెంతనుండ దగినది. నీకుదీనితోడ బ్రయోజన మేమియులేదు. అడవి నుండి స్వల్ప జనముతో పొట్టబోసుకొను నీకిదియేల నీకుకావలసిన కోటి గోవుల నిచ్చెద ననియె. వశిష్టుడు యిది నీకివ్వదగినదికాదు. యిదియె నాసర్వస్వము దీనితోడనే హవ్యకవ్యాధులును, దేహ యాత్రయు నతిథి సత్కారాదికమును జరుగుచున్నది గావున నీవు దీని నపేక్షించకుము. దననేత్రముల కింపుగా గనపడు పరధనము నభిల షించుట బుద్ధిమంతులకు తగదుగావున నీత్రోవను నీవు పొమ్ము అని వచించె. నంత నీతడు రాజగర్వంబున నాతని మాటల పాటిం పకదనభృత్యులగని యాగోవును బంధించి దనవెంటగొని రండని యాజ్ఞాపించెను. భృత్యులపుడు నృపాజ్ఞను బురస్కరించుకొని నందినీ ధేనువును బంధించి దోడుకొనిపోవ దలచుచుండిరి. నందినివశిష్టు నవలో కించి వశిష్టాభిప్రాయమును గ్రహించి దన రోమములనుండియు, వాలమునుండియు పహ్లవులను, శకులను శబరులను, యవనులను మ్లేచ్ఛు లను సృజించి తాను తనకట్లను తెంచుకుని తనను బంధించినవారి నందరిని సంహరించెను. పహ్లవాదులందరు విశ్వామిత్రుసేనల నిరవ శేషముగ సంహారించె విశ్వామిత్రుడాగ్రహించి మహాస్త్ర ప్రయోగం బుల వారలనందర నోడించి వశిష్టమహర్షిపై యస్త్రంబుల బ్రయో

గించె. నంత వశిష్ఠుడు దనచేతనుండు బ్రహ్మదండమున (వేణుదండమున) నాయస్త్రసమితినంతయు బోకార్చెను. విశ్వామిత్రుడు క్రుద్ధుడై బ్రహ్మాస్త్రమును బ్రయోగించిన దానిని హుంకారమున వారించెను. విశ్వామిత్రుడపుడు జేయునదిలేక ధిగ్బలం, క్షత్రియబలం, బ్రహ్మతేజోబలం, బలం అని దలచి బ్రహ్మతేజోబలమునార్జించ దృఢాభినివేశముగలవాడై దక్షిణమునకేగి ఘోరంబుగ పదివేలవర్షంబులు తపంబొనర్చె. యపుడు బ్రహ్మసాక్షాత్కరించి రాజర్షివై తివనిన విశ్వామిత్రుడు తృప్తినొందక తిరిగి తపోనిష్ఠుడై దీర్ఘతపంబొనర్చుచుండ నపుడు మనువంశసంజనితుడగు త్రిశంకుడు విశ్వామిత్రునవలోకించి మహాత్మా! నేను త్రిశంకుడ, భానువశ్యుండ చేసిదేహముతు విడువకనే స్వర్గముకు బొందగల యజ్ఞము నొనర్చదలంపు గలవాడనై మద్గురుడగు వశిష్ఠునిజేరి ప్రార్థింప. నాతడు నన్ను నిరాకరించెను. పిదప నేను తత్పుత్రులజేరి నాకోరికను విన్నవించితిని. వారాగ్రహావేశితులై భగవంతుడగు గురువరున శక్యమగు దానిని చేయదగిననాకు మరియొకకుండునా నీవు గురుతిరస్కారమొనర్చితివి గాన ఛండాలుడవుగమ్మని నన్ను శపించిరి. గావున సర్వసమర్థుడవగునీవు నన్ను చేపట్టి నా ప్రార్థనను నెరవేర్పుము అని కోరిన వల్లేయని యంగీకరించి రాజునోదార్చి తాదృశప్రభావ వంతమగు యజ్ఞమునుజేయ మనంబునదలచి దనపుత్రులగు మధుచ్ఛందాదుల బంపి మునివరుల నందరబిలిపించెను. లోకమునగల మునులందరును విచ్చేసిరి. వశిష్టాశ్రమవాసు లెవ్వరును రాలేదు. వశిష్ఠ పుత్రులు మహోదయుడు కోపవశంబున మాలడు యజ్ఞము జేయువాడు. క్షత్రియుడు యజ్ఞమును జేయించువాడు. సశరీర స్వర్గము ఫలము. దేవతలీ యజ్ఞమును నెట్లు హావిర్భాగముల గొందురో మును లెట్లు భుజింతురో జూడవలయు ననిరి. యావాక్యంబులవిని విశ్వామిత్రు డాగ్రహించి

వాశిష్ఠులు భస్మీభూతులై కాలపాశంబున గట్టబడి నరకంబుల నెల్ల ననుభవించి సప్తజన్మంబుల నీచయోనుల బుట్టి మృత శునక మాంస భక్షకులగుదురుగాక. మహోదయుడు సర్వలోక దూషితుడై నిషాద త్వంబు నొందుగాక యని శపించి యజ్ఞంబు ప్రారంభించి కల్పోక్త విధమున విధుల నిర్వర్తించి హవిర్భాగములగొన దేవతలనాహ్వానించిన దేవతాగణంబులు రాకుండిరి. యప్పుడు కౌశికుడు కృద్ధుండై కుశపవిత్ర ధారియై స్రువమెత్తుకొని నేను బాల్యమునుండియు సత్యవాక్యనిష్ఠుడనేని ఘోరతపోవంతుడనేని యీ త్రిశంకుడు వియచ్చరలోకమున కేగుగాక యని బలికె. నంత త్రిశంకుడు స్వర్గమున కేగెను. మునులందరు నంత సించిరి. పురుహూతుడు త్రిశంకుని స్వర్గమున నివసించకుండ బడద్రో యించెను. త్రిశంకుడధోముఖముగ బడుచు రక్షింపుమని యాక్రోశించుచు విశ్వామిత్రుని ప్రార్థించెను. త్రిశంకుని యార్తరావమును కౌశికుడు విని నభోమధ్యమున ప్రతిస్వర్గమును సృజించి తారకలను సప్తఋషులను నవ్వల సృజించి 'అన్యమింద్రం కరిష్యామి, స్వర్గో వాస్యాదనింద్రకః' అని సంకల్ప మొనర్చి తత్ప్రయత్నముననుండ దేవతా గణ మంతయు విచ్చేసి విశ్వామిత్రుని శాంతింపజేసి త్రిశంకుడు విశ్వామిత్ర సృష్ట స్వర్గమున దేవతుల్యుడై యుండుటకును యీస్థితి సకల లోకంబులుండు వరకు శాశ్వతంబుగ నుండుటకును అంగీకరించెను. యజ్ఞము పరిసమాప్త మైనది. విశ్వామిత్రుడటనుండి కదలి పశ్చిమమున పుష్కరక్షేత్రమున నివసించి కంద మూల ఫలాశనుడగుచు నుగ్రతపమును జేయుచుండె నపుడు

గీ. అంబరీషుడు యజ్ఞము నాచరింప
దలచి పశువును వీడిన తరుణమందు
వజ్రి దానిని గొనిచనె వంచనమున
నరుని పశువుగ నర్థించె నరవిభుండు॥ ౧౫౯

వ. లోకమునగల తల్లిదండ్రు లెవ్వరును దమ పుత్రుల బశ్వార్థ మొసగిన వారు లేరు. ఋచీకుడనువాడు ధనలుబ్ధుడై జ్యేష్ఠపుత్రు నొసంగనని పలికె. యాతని సతి బాలునివ్వననియె. నిక ద్వితీయ పుత్రుడు శునస్సేపుడను వాడు దన నిచ్చుటకు తలిదండ్రుల యంగీకారమును దెలిసి రాజు వలన తలిదండ్రులకు విశేష ద్రవ్య మిప్పించి తాను రాజభటులతో గూడ పశ్వర్థము బయలుదేరెను.

గీ. రాజ భృత్యులు వానిని రహిని గొనుచు
పయనమై యేగి పుష్కర భవ్యవనిని
వాస మొనరింప నది గాధివాసమనుచు
దెలసి చరణంబులను బడె తెల్లముగను॥ ౧౯౭

వ పశువుగా గొనిపోబడు శునస్సేపుడు విశ్వామిత్రుని మేనల్లు డగుట దనమాతులుని పాదంబులబడి యేడ్చుచు ప్రాణదానంబొసగుమని ప్రార్థించిన విశ్వామిత్రుడు కరుణించి వృత్తాంతము నంతను విని దన తోబుట్టును బావుకుని నిందించి యతనినిరక్షింప దలచి దన పుత్రుల బిలిచి వీనినిరక్షించుటకుగాను మీలో నెవడేని యొకడు పశ్వర్థ మరుగడని వచించెను. విశ్వామిత్రుని బుత్రులందరును తండ్రివాక్య మునువిని నవ్వి యన్యునిబుత్రునికై దనబుత్రుని జంపుకొను వానిని నిన్ను దప్ప లోకమున మఱియెవ్వరిని నెఱుగము. మేము పోము అని తిరస్కరించి పలికిరి. విశ్వామిత్రుడు దన వాక్యమును దిరస్కరించి నందున కధికాగ్రహావేశుడై దనపుత్రులనందరిని మీరును వశిష్ట పుత్రుల వలెమృత శునకమాంసభక్షకులై ముష్టికజాతులం బుట్టి భూలోకంబున వేయిసంవత్సరములు వసించుడని శపించి శునస్సేపు నీక్షించి యతనికి మంత్రిత భస్మ ధూళ్యాది ప్రక్షేపరూపంబగు రక్ష

గావించి యింద్రోపేంద్ర దేవతాకంబులైన రెండుమంత్రంబుల నుపదేశించి నిన్ను యాజకులు యూపంబున గట్టిన యపుడీ మంత్ర ద్వయమును పఠింపుము. తత్క్షణము పురుహూతుడు ప్రత్యక్షమై నిన్ను రక్షించి యంబరీషునకు యజ్ఞఫలంబును నొసంగు ననియె. మ్మనిన శునశ్శేపుడు సంతసించి యంబరీషాను చరులతోడ యజ్ఞవాటంబున కేగిప్రవృత్తయజ్ఞంబున యాజకానుమతంబున రక్తమాల్యానులేప నంబుల యాగపశువుగా నలంకృతుండై పవిత్రపాశంబుల వైష్టవంబగు యూపంబున బంధితుండై వహ్ని కభిముఖుండై దివ్యమంత్రద్వయమును శ్రద్ధాభక్తుల మనంబున జపించిన సహస్రాక్షుడు పరమానందంబున నచ్చటికి విచ్చేసి శునశ్శేపుని బంధవిముక్తునిం జేసి యంబరీషునకు యజ్ఞఫలంబును ద్విగుణంబుగనొసంగె. నంతవిశ్వామిత్రుని వేయిసంవ త్సరముల తపస్సునకు పితామహుడు మెచ్చిపొడచూపి నీవు ఋషి నైతివి యనివచించి యంతర్హితుడయ్యె. విశ్వామిత్రు డద్దానికి తృప్తినిం జెందక ఘోరతపమొనర్చుచుండియు మేనకంగని మోహించి దాని తోడ పదివత్సరంబులు విహరించిదానియందు శకుంతలంగని వివేకియై యచట బాసి యుత్తరంబున హిమవత్పర్వత ప్రాంతంబున కౌశికీ నదీ తీరంబున నైష్ఠికవ్రతంబుల ధృఢనిశ్చలంబుగ ఘోరతపం బొనర్చుచుండ బ్రహ్మసాక్షాత్కరించి మహర్షిత్వము నొసగిన తృప్తినొందక నూపిరిబుచ్చక నూర్ధ్వహస్తుడై వాయుభక్షకుడై వేసవిగ్రీష్మల మధ్యను శీతకాలంబున జలంబులను వర్షకాలంబున వింటను నిల్చి శిలవలె కదలక మెదలక నిల్చి యుగ్రతపం బొనరించు చుండె. నపుడింద్రప్రేషితయగు రంభ యేతెంచి కలంచ బ్రయత్నించి శప్తయై వశిష్టుని వలన శాపంబు నివారిత మగునని వక్కాణించబడియె. విశ్వామిత్రు డటబాసి యనేక క్షేత్రంబుల ఘోరతపంబొనర్చి

తుదకు సిద్ధాశ్రమంబు జేరి వేయివత్సరంబులు దుశ్చర తపంబొనరించి సమాప్త దినంబున పారణంబు జేయదలచి యన్నంబు సిద్ధపరుచుకుని భుజించ బ్రయత్నించు సమయమున పురుహూతుడు వృద్ధబ్రాహ్మణ రూపంబున నాయన్నం బభ్యర్థించిన సిద్ధాన్నంబంతయు నాతని కొసగె. యుదకంబు ద్రావ బ్రయత్నించిన సద్దానినిగూడ యాచించిన నదియు నొసగి యూర్పుబుచ్చక వేయివత్సరంబు లుగ్రదపంబొనరించె. యపుడు శతానందుడు సన్నిహితుడై కౌశికా! నీతపంబునకు మెచ్చితిని. నీవు బ్రహ్మర్షివైతివి. నీకు బ్రహ్మతేజమును, దీర్ఘాయువు నొసగితిని. నీవిక వలసినట్లు లోకంబుల జరింపుమనిన, విశ్వామిత్రుడు కరములమోడ్చి దేవా! యోంకారమును, వషట్కారంబును, వేదంబులును నన్ను వరించుగాక. బ్రహ్మర్షియైన వశిష్ఠుడు నన్ను బ్రహ్మర్షి యని బిలుచునుగాక యనిన బ్రహ్మ వశిష్టుని బిలిచిన యతడు విచ్చేసి విశ్వామిత్రుని గాంచి నీవు బ్రహ్మర్షి వైతివి యని బలికె. వారిరువురును పూర్వవైరమును బోద్రోలి మిత్రులైరి. బ్రహ్మ యోంకార వషట్కారములను వేదంబుల నొసగి యంతర్థానంబు నొందె. నిజేడు విగ్రహవంతంబగు తపస్సు వీర్యంబున బరాయణుండు ధర్మపరుండని బలికి యూరకుండెనపుడు జనకుడు

గీ. దన పురోహితు వాక్యాళి దనవి దీర
వినుచు బలికెను జనకుడు వినయ ఘణితి
ధన్యుడను నేను క్రతువెల్ల ధన్యమయ్యె
భద్రమగు నీదు రాకను భవ్యమాచు॥ ౧౯౮

గీ. అప్రమేయ తపోబల మనుపమాన
గుణ గణంబులు నీయందు గూడియుండె
వింటి నీకథ మనమున వింతఁజెందె
కర్మకాలము భానుడు కడకుబోయె॥ ౧౯౯

గీ. ఉదయమున మిమ్ముఁగాంచెద నుదిత తేజ
సెలవుగైకొని పోయెద చిత్రచరిత
యనుచుబోయెను మిథిలేశు డపుడె మునియు
దాశరథులును విడిదికి దరలి రంత॥ ౨౦౦

వ. యారాత్రి బుచ్చి ప్రభాత సమయమున జనకుడు కృత కర్మకలాపుడై రామలక్ష్మణ సహితుడైన విశ్వామిత్రుని రావించి పూజించి రామలక్ష్మణుల సత్కరించి మునినవలోకించి మీరాక మాకు శుభజనకంబు, మీకింకరుడను కర్తవ్యము నుపదేశించుమనిన విశ్వామిత్రుడు మిథిలేశుగని,

మ. భవతుల్యోన్నతబాహువీర్యు లనఘు ల్భానుప్రతాపాఢ్యులీ
రవివంశోద్భవులార్యసమ్మతులు భద్రాకారు లత్యుత్తమ
స్తవనీయప్రతిభావిలాసు లమితోత్సాహుల్లనుల్వీర లా
భవచాపంబు గనంగవచ్చి రనఘా! భవ్యంబుగాజూపుమీ॥ ౨౦౧

క. అనిన మునితిలకుపలుకులు
వినియద్భుతచిత్తవృత్తి వినిపించెవడిన్
ఘనహరచాపప్రాప్తిని
జనకుడుఘనసంశయమున చతురతతోడన్॥ ౨౦౨

చ. మునివరపూర్వుడౌ నిమికి ముఖ్యునినారవవాని దేవరా
తుని కరమందు దేవతలు తోరపుశంకరచాపముంచ నా
ఘనుడును తత్కులీనులును గాఢపుభక్తినిపూజజేసి రా
ధనువిదె దీనినిప్పటికి దప్పకనెప్పుడుగొల్తుకౌశికా॥ ౨౦౩

వ. మహాత్మా! దక్షయాగ విధ్వంసన కాలమున శంకరుడు కోపించి, యీధనువును సజ్యంబొనర్చి దేవతలనందరఁ గనుగొని భాగార్హినైన నాకు భాగంబు గల్పించని కతమున మీయుత్తమాంగ

ముల దునిమివైచెదనని పరుషంబుల బలుకుచుండ దేవతలందరు భీత
చిత్తులై కరములమోడ్చి ప్రార్థించిరి. దయాసాగరుడగు హరుడు
శాంతించి యీచాపరత్నమును దేవతలకిచ్చె. దేవతలందరు దేవరాతుని
పరాక్రమంబునకును, నియతచిత్తవృత్తికిని మెచ్చి యీచాపమాతని
హస్తమున న్యాసరూపమున నిచ్చిరి. పిదప నేనొకయాగమును జేయ
బూని భూశుద్ధి కొరకు భూమినిదున్నింప నాగటిచాలున నద్భుతంబుగ
నొకమందసమువొడమె. దానిదెఱచిచూచిన రాకానిశాకరురేకవోలె
జలదము నెడబాసి జగతికివచ్చిన, మెఱుగారు క్రొక్కారు మెఱపు
చందంబునఁ బ్రకాశించు, నొకకన్నియతోచిన దానిని పుత్రికగ
గైకొని సీతయనిపేరిడి యాచిన్నికూనఁ నబ్బురంబుగఁ బెంచితి. నదిఁడినదిన
ప్రవర్థమానయై బెఱగె. యయోనిజగావున వీర్యశుల్కయని దలచి
శంకరచాపమెక్కిడిన వానికిగాని, నిప్పడతిఁ నివ్వననిఁ బ్రతినజేసితి.
నప్పుడు మత్సుమారిం బెండ్లియాడ నమందానందంబున ధరణీపురందర
నందనులు జనుదెంచి కన్యనిమ్మని యడిగిరి. వారలకెల్ల ప్రత్యుత్తరంబు
గాఁనేనిట్లంటి. నీకన్నియ వీర్యశుల్క మద్గృహంబునగల ఖండపరశు
చాపంబు నెక్కిడిన వానికి మత్పుత్రి నిచ్చెదననిబలికితి. వారందరా
చాపమును వీక్షించి యిట్లట్లుకదల్పఁజాలక బెండువడి సిగ్గున దలవంచి
నిరాశులైజని యందరొకచోజేరి రోషంబున చతురంగ సమేతులై
నాపైగవిసిరి. వారికిని నాకును వత్సరం బొకటి పోరుజరిగినది. మదీయ
సేనయు తక్కిన సాధనంబులును సంక్షయించినవి. విచారించి దేవతల
నారాధించితి. వారు చతురంగ బలంబుల పరికరంబులతోడ నిచ్చిరి.
యాబలంబులును నేనును రణంబునకుజని యుద్ధమొనర్చితిని. పరరాజు
లందరు పలాయితులై నన్నుశరణంబువేడిరి. నాకువిజయంబు గలిగినది.
గావనిపుడు

క. అనఘుని యా దేశంబున
నను పమమగు చాపవరము నాదర మొప్పన్
మునుకొని యిదె దెప్పించెద
మనమలరగఁ జూడఁగలరు మహితులు వీరల్॥ ౨౦౪

క. దానిని దశరధ పుత్రుఁడు
దననేర్పున బలిమికలిమి దద్దయు వేడ్కన్
ఘనముగ నెక్కిడఁ గలిగిన
మనమలరగ సీతనిత్తు మహితవిచారా॥ ౨౦౫

క. అనవిని విశ్వామిత్రుఁడు
జనకుడ! కడు వేగధనువు సంశయపడకన్
మనమున మోదముఁ నొందుచు
ఘనముగ దెప్పింపుమనిన గ్రక్కున నతఁడున్॥ ౨౦౬

చ. ఘనులగు మంత్రిముఖ్యులను కార్యవిశేష విధాన యుక్తుల
న్గనుగొని మీరుశంకరుని కార్ముకమిప్పుడె తెండు పొండనన్
జనియపుడైదువేలు మనుజ ప్రవర్ధులగురీతి దెచ్చియా
ఘనమగు చాపమాఘనుడు గాంచగ నానటులుంచి రింపుగన్॥
౨౦౭

వ. అపుడు జనకనృపాలుడు విశ్వామిత్రునిగాంచి బద్ధాంజ లియై వినయ భయభక్తి సంశయంబులు ముప్పిరిగొనుచుండ నిట్లనియె

క. మునినుత మాపూర్వులచే
ఘనముగఁ బూజింపఁబడిన కార్ముకమిదియే
గనుడీ వేగమ దీనిని
మునునృపు లెక్కిడగలేక మునిగిరి లజ్జన్॥ ౨౦౮

చ. సుర నర యక్ష కింపురుష సూర్య నభశ్చర నాగ సిద్ధ కి
న్నర వసు రుద్ర సాధ్య ముఖ నాకిగణంబుల కైన నెక్కడ
న్గరమున నెత్త జూడగను గట్టిగ శక్యముగాని చాపము
న్నరు లెవ రెత్త జాలుదు రె నాకిది జూడగ దుర్లభంబగున్॥ ౨౦౯

వ. ఇమ్మహా చాపంబు బూరించుటకు నిట్టట్టు కదల్చుటకు శరంబుగూర్చుటకు నారోపణంబు సేయుటకు నాకర్షించుటకు సమస్త లోకంబులలోనను సమర్థులు లేరట్టిదానిని భవద్వాక్య గౌరవమున నతి ప్రయత్నమున నిచ్చటకిం దెప్పించితి. దీనిని రాజపుత్రులకు జూపుమని పలికిన భగవంతుడగు విశ్వామిత్రుడు మిథిలేశుని వాక్యంబుల విని రామచంద్రుని గటాక్షించి వత్సా! రామచంద్రా! రాఘవ! ధనువును విలోకింపుమనిన నమ్మను వంశ సత్తముండు మంజూషా ముద్రావిభేదనం బొనర్చి తన్మధ్యగతంబైన మహాచాపము నవలోకించి దన గురుండగు విశ్వామిత్రు నవలోకించి

గీ. మునికులోత్తమ! చాపంబు ముదముతోడ
కరముతో బట్టి నెత్తను గడగినారి
గూర్ప లాగను సెలవివ్వ గోరుచుంటి
నశ్రమంబున శరమిందు నమరగూర్తు॥ ౨౧౦

వ. అని బలికి జనక విశ్వామిత్రుల ననుమతినొంది సభలో నున్న నృపతులు మునిపతులుజూచుచుండ శ్రీరామభద్రు డశ్ర మంబున నవలీల నభ్యస్త శరాసన మెత్తునటుల పైకెత్తి గొనయంబు దగిలించి యాకర్షించి యాకర్ణపూరంబుగ దిగిచి విడిచెయపుడు

ఉ. కరమునగూర్చ చాపమును కార్ముకమందున నారిగూర్పగా
వరగుణరావము న్దిశల వాసిగ బ్రద్దలు సేయుచుండగా
సరిగను నారిలాగగను చారుముఖద్యుతి సొంపుమించగా
పరిసదవర్తులందరట బాగుగఁ జూచిరి సంతసంబునన్॥ ౨౧౧

క. శరకాండమెత్తిలటులను
వరధనువతడెత్తి వామ వరహస్తమునన్
సరిగా గూర్చెను నారిని
యరుదుగనది విఱిగి బడియె నాశర్షింపన్॥ ౨౧౨

వ. నూరుశతఘ్ను లొక్కపెట్టున వ్రేల్చిన ధ్వని కన్న చాల నెక్కుడగు నాధ్వనికి

క. వసుమతి కంపమునొందెను
పసలేకను బడిరిజనులు పగిలెను గిరులు
న్విసదృశ ఘనఘోషముతో
పశుపతి చాపంబు విఱుగ పారిరి దివిజుల్॥ ౨౧౩

క. కౌశిక రాఘవ జనకులు
భాసురముగ బడరు భద్రబలులై యుంటన్
మోసము జెందిరి యన్యులు
భూసుతపడలేదు తనను భువనము మెచ్చన్॥ ౨౧౪

క. మోదము నొందెను మునివరు
దాదరమున జెలగె నృపతి యానందమునన్
సాదర యుక్తులు సభికులు
శ్రీదయితుడె రాముడనుచు జెలగిరి సుదతుల్॥ ౨౧౫

వ. అంతజనక నృపాలుండు శంకరధనుః ప్రకాండ ఖండన ప్రచండపాండిత్య బాహుదండమహోద్దండ ప్రతాప వితీర్ణ సకల మానవచేతో మోదావహుడును, తత్క్షణోన్మీలిత పుండరీకసదృక్షనయన యుగళుండును, స్వతేజోవిజితభాస్కరుండును, కౌసల్యానందవర్ధనుండును, దశరథసకలమనోరథపరిపూరితపూతచరితుండును, నిజముఖనిర్మల తేజో విజితసంపూర్ణచంద్రుండును,సీతాసతీమనోనయనదయితుండును,దశరథ పుత్రుండునగు శ్రీరామచంద్రుని బహువిధగౌరవపురస్సరంబుగసన్మా

నించి భగవంతుడగు కౌశికునాలింగన మొనర్చి మహాత్మా! భవదీయ నిర్హేతుకజాయమానకటాక్షవిశేషంబున భవదీయులమగు మేమంద రమును సర్వమనోరథములకుపగివర్తమానులము. చిరప్రాప్తాదృష్ట జామాతృతాదోష కళంకితుడనగు నన్ను సంప్రాప్తభగవద్రామచంద్ర జామాతృత్వ సంపదన్వితునిజేసి కృతార్థుని నొనర్చితివి. నాప్రతిజ్ఞను సఫల మొనర్చితివి, నన్నురక్షించితివి.

గీ. బాలుడీత డప్రధృష్యంబు భవునిచాప
మనుచుసందేహమందితి నార్యచరిత
చనదుదేజస్వివయసెంచ జగమునందు
దీపకాంతియె యణచదె తిమిరతతిని॥ ౨౧౬

గీ. మూడుమూర్తులలోనొక్క మూర్తియితడు
గాన నెక్కిడెయన్యులు కదిపినారె
దేవ దానవ మానవ దితిజ యక్ష
సిద్ధ విద్యాధరాదులు చేవఁజెడరె॥ ౨౧౭

క. ఇదినీమహిమయొ లేదా
మదినూహింపంగలేని మహితుండితడో
యిదమిత్థమనగనేరను
విదితాఖిలతత్వ నీకె విశదమునుమిత్రా॥ ౨౧౮

వ. అనిన విశ్వామిత్రుడు చిరునగవునవ్వుచు జనకరాజేంద్రుని హస్తమును దనహస్తమునబట్టి, నృపాలావతంసా! మైథిలా వినుము.

గీ. ప్రతినపరిపూర్ణరూపమై ప్రబలెగాన
నమితవీర్యుడుజామాత యమిరెగాన
వనిత రాముఁనళర్పింప వలెనుగాన
శుభముశీఘ్రముంబ నెరవేర్చ శోభనంబు॥ ౨౧౯

వ. అదియునుంగాక

గీ. ఎవఁడు శంకరుచాపము నెత్తగలఁడొ
యతఁడు సీతకుభర్తయగా నంటివీవు
నటులరాముఁడు సీతేశుఁ డయ్యె నిపుడు
స్వత్వమికనీకు సీతపై సాగబోదు॥ ౨౨౦

గీ. స్వత్వమిచ్చుటదానము స్వామివీవు
స్వత్వమర్పించిసారుల సత్కరింపు
పేరవరునకు సీతను విక్రయించి
దానమిచ్చెదనన్నను దానమగునె॥ ౨౨౧

ఉ. జనకనృపాలశేఖరుఁడ జానకిరాముని వీర్యశుల్కయే
మనసిజబాణ నూర్మిళను మాన్యుని లక్ష్మణుఁగూర్చఁగావలెన్
మనమునసంతసింపుచును మామకవాంఛను దీర్పఁబూనుమీ
జనకులురాఘవుల్దలపఁ జక్కనిచుట్టలుగారె భూవరా॥ ౨౨౨

వ. జనకక్షితీశ్వరా! మేముదానపాత్రులము. మీరు దాతలు గాన మాకీదానంబు సత్వరంబుగ నిప్పింపుము. నీవు ధన్యుఁడవుగమ్ము.

క. అనవిని సంతసమందుచు
దనకరములుమోడ్చి మ్రొక్కి ధన్యుఁడనై తిన్
ఘన కౌశిక కారుణ్యము
మనమలరెడి శుభములెన్నొ మంచిగఁగూర్చెన్॥ ౨౨౩

గీ. పుష్పమాలికశిరమున బూసినట్లు
తావకాజ్ఞను శిరమున దాల్చువాఁడ
లక్షణాఢ్యనునూర్మిళ లక్ష్మణునకు
పత్నిగానిచ్చుభాగ్యంబు బడయఁగంటి॥ ౨౨౪

క. అనవిని గౌతమసూనుడు
జనవరనాకోర్కెయొకటి జరుపగవలయున్
మనమాండవి శ్రుతకీర్తుల
దనివారగ రాముచిన్ని తమ్ములకిమ్మా॥ ౨౨౫

వ. అనవిని నవ్వుచు మిధిలేశుడు విశ్వామిత్రు నవలోకించిన విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వుచు నరనాథాగ్రణీ! మాగురువరుండగు మా కుమారశతానందుని కోర్కెచెల్లించుట సర్వోత్తమము. నీవు భాగ్యవంతుడవు. దశరథపుత్రులకు నలుగురురకును నీవుశ్వశురుడవైతివి. ఇంతకంటె పరమానందమేమిగలదు. నీపుణ్యమును మే మేమని వర్ణించ గలము. పరమాత్ముని చతుర్బాహువులను పరిపూర్ణభక్తితో బూజించి నాడవనిన జనకుండుపునఃపునః ప్రణతుండై భగవంతుడవగునీవుమాబోటి ప్రాకృత సంసారులతో జేరి లీలావినోదముల ననుభవించుచుంటివి. నీవేది పలికిన నదిమాకు వేదవాక్యము. ననుల్లంఘనీయము. కుశధ్వజ సుతల నిరువుర భరత శత్రుఘ్నుల కర్పించెద. రాఘవుల సంబంధము వలన జనకులు పావితులైరి. యిక జాగుసేయక సాకేతపురాధీశ్వరుడు మామిత్రుడు. రఘుకుల వారాశి చంద్రుడు అగు దశరథునికి దెలిపి సపుత్రకునిగ నాతని రప్పింపవలెనని మంత్రుల విలోకించిన వారలతి త్వరితగతి నయోధ్య జేరి దశరథమహారాజునకు శుభోదంతమును విన్నవించి యిది మా జనకరాజేంద్రునకును మీకును విశ్వామిత్రాజ్ఞ పరిపాల్యముగాన సత్వరంబుగ విచ్చేయ వలయుననియు జనకుడింకను యజ్ఞదీక్షితుడుగాన మేము తదుభయుల నాజ్ఞను వచించుచున్నార మనియు వచించిరి. యద్వార్తని విని దశరథుడు సంతసించి విశ్వామిత్రుని ప్రజ్ఞను మిగుల గొనియాడి వశిష్టుని యనుమతి నొంది సీతాకళ్యాణా శంసులగు వారల సత్కరించి సకల సేనాపరివార యుతుడై మంత్రు

లును బంధువులును ద్విజులును గురువులును తోడరా వశిష్ట కథిత సుముహూర్తమున నయోధ్యనుండి వెడలి సకల వైభవంబుల సకల మంగళ వస్తుసమన్వితులై చక్రవర్తి చిహ్నాలు జెలగ సపుత్రకుడై శుభశకునంబుల కమందానంద కందళిత హృదయుడై మూడుదినంబులు నడిచి నాల్గవ దినమున.

సీ. సకల సామంతాది సహితుడై దశరథ మేదినీశుడు జేరె మిథిల కపుడు
జనకరాజేంద్రుడు చతురంగ సహితుడై గురువులు మంత్రులు కూడి రాగ
నెదురగ నేతెంచి యెలమి పూజలజేసి స్వాగత మడుగుచు స్వస్తి దెలిపి
యాశ్లేష మొనరించి యార్యవశిష్టుని భక్తిని మ్రొక్కుచు భవ్యు డతడు

గీ. మునుల నందర మన్నించి ముదముగూర్చి
భరతు శత్రుఘ్ను నక్కున బరగ జేర్చి
సకలరాజుల సన్మాన సరణి నెఱపి
మంత్రులందర మన్నించె మహితముగను॥ ౨౨౬

వ. మరియు దశరథుని, జనకుడు నిరీక్షించి

గీ. మిత్రకులజాత మిత్రుడ మేదినీశ
భవ్య భవదీయ సంబంధ భాగ్యమునను
ధన్యుడను నేను దేశంబు ధన్యమయ్యె
వంశమంతయు ధన్యమై వరలె నేడు॥ ౨౨౭

వ. అని బహువిధ సన్మానంబుల నెఱపి మంగళవాద్యరవమంతరిక్షమున కంటుచుండ స్వావస్థ్యమునకు దోడ్కొనిచని యలంకృతంబగు నుపకారికను బ్రవేశింపజేసి కనకాసన మర్పించి సుఖోపవిష్టుడై యున్న

కోశలేశు నవలోకించి మిథిలాపురాధీశ్వరుండు వశిష్ట విశ్వామిత్ర శతానందులు వినుచుండ సవినయంబుగ నిట్లనియె.

గీ. వీర్యశుల్కను సీతను వీరవరుడు
రాముడార్జించె గనుగొన రాజులెల్ల
స్వత్వమాటను సీతకు స్వామి యతడె
యచట నాచారవర్తిని యగుదు నేను॥ ౨౨౮

గీ. యూర్మిళను గూర్తు లక్ష్మణు నూర్జితముగ
మాండవిని గూర్తు భరతుని మహిత ధిషణు
కమలదళనేత్రి శ్రుతకీర్తి కమలనయను
బొంధు శత్రుఘ్ను ముదమున భూరితేజు॥ ౨౨౯

గీ. భాగ్యవంతుడ నైతిని భవ్యచరిత
నిర్జితములయ్యె విఘ్నము ల్నిజముగాను
కులము,పూజితమయ్యెను కోర్కెలొదవె
రాఘవులతోడి సంబంధ రాజివలన ౨౩౦

గీ. క్రతువుజరిగిన తోడన కార్యవిదులు
పరిణయము జేయవలెనంద్రు భవ్యచరిత
నీదు సమ్మతి గావలె నిపుణ తిలక
ముదము గూర్పగ నున్నారు మునులు వీరు॥ ౨౩౧

వ. అను మిథిలాధినాథు వచనంబుల విని దశరథ భూమీశుండు

గీ. దాతృవశమగు ప్రతి గ్రహ ధర్మమనుచు
విన్నవాడను పూర్వము విశ్వవినుత
నీవు చెప్పిన రీతిని నిశ్చయముగ
నడువ గలనన జనకుడు నవ్వుకొనియె॥ ౨౩౨

# శ్రీ సీతా కళ్యాణము.

వ. అంత రాత్రియగుట తమతమ విడుదల యందందరు విశ్ర మించిరి. పరదినంబున దశరథ రాజేంద్రుడు దనపుత్రులకు గోదాన వ్రతమొనర్చె. నాసమయంబున భరతమాతులుండగు యుధాజిత్తను వాడు కేకయ రాజపుత్రుడు దనమేనల్లుని భరతునిగన నయోధ్యకే తెంచి వివాహ వృత్తాంతమును విని సత్వర ప్రయాణంబుల మిథిలకే తెంచి దశరథునిచేత సత్కృతుడయ్యె. పరదిన ప్రభాత సమయమున ధర్మ మార్గానువర్తి యగు దశరథుడు సకల పరివారసహితుడై నిఖిల మంగళవాద్యయుతుడై గురు ద్విజ మంత్రి బంధుసహితుడైయుండ ముహూర్తంబాసన్నంబగుచుండె. సత్వరంబుగ దయసేయుడని జనక మంత్రులు విన్నవించిన, వారవనితలు నృత్యంబులు సేయుచుండ, వందిమాగధులు స్తోత్రపాఠంబుల పఠించుచుండ, పురంబంతయు నూరేగి సకల మంగళ సద్వస్తు సమన్వితంబగు జనకరాజ గృహంబు జేరిన, జనకరాజు కుశధ్వజ శతానంద ప్రభృతి మహామహులతోగూడి యెదురేగి యనేక విధసత్కారంబుల దశరథు నారాధించి, వాసుదేవ సంకర్షణానిరుద్ధ ప్రద్యుమ్నులవలెనుండు రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల సన్మానించి, దశరథుని హస్తంబును జనకుండుపట్టుకొని రత్నకంబళంబు లపై మందగమనమున నడిపించుచుండ, విశ్వామిత్రుడు రామచంద్రుని హస్తమును బట్టుకొని వశిష్టునితోడ మాంగల్యబోధకశ్రుత్యను వాకంబుల బఠించుచును బహ్వలంకార భాసురంబు, రత్నపీఠికా విరాజితంబును, కర్పూరదీపికా ధృతవిప్రవృద్ధ సువాసినీ జనమంగళగాన భాసురంబును, నగు వివాహ మంటపము సమీపించి మణిఖచిత వరసువర్ణ పీఠముల వరుల నివసింపజేసి, తత్తత్క్రియాకలాపముల యథాయోగ్యముగ ప్రవర్తింపజేయుచుండిరి. తదుపరి వశిష్టశతానంద విశ్వామిత్రానుమతంబున సర్వాలంకార భూషితలును, సర్వాంగ

సుందరులును సౌవర్ణిక వైవాహికపత్రపాశ్యాభిరామలగు సీతోర్మిళామాండవీశ్రుతకీర్తులు చేటికాసహస్ర పరివృతలై వైవాహికమంటపమునకు చేరరి. శతానందుండు తాత్కాలిక కృత్యములనెల్ల నెరవేర్చె. జనక దశరథులు తిరస్కరిణిని ధరించిరి. వశిష్టమహర్షి రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు పత్రపాశ్యల నలంకరించె. నాచరణీయంబులెల్ల నాచరింపబడినవి. యంత దశరథుడు మహాత్ముల నందర నవలోకించి,

సీ. కళ్యాణముల యందు గణుతింపవలయును కులజుడౌ పురుషుడు
కులమునంత
గావున మత్కుల క్రమవేది కాకుత్స్థ కులగురుడైనట్టి కుశలబుద్ధి
వర వసిష్టాఖ్యుడు వచియించు కులమంత వినుడు మీరలు వేడ్క
విబుధులార
మద్యోగ కుశలాది మహిత భారంబెల్ల నితనివశమునందు నెసగియుండు
గీ. సకల మెఱిగినవాడును సత్వగుణుడు
మామకాభీష్ట ఫలదాత మర్మవిదుడు
సరసిజోద్భవపుత్రుడు సమయ విదుడు
మహిత మహిమాఢ్యుడైనట్టి మద్గురుండు॥ 133

క. అన విని లేచి వశిష్టుడు
దనమనమున ముదమ్ము గదుర తాదృశ ఫణితిన్
ఘనముగ బలికెను వినుడిక
నినవంశ్యుల కులమునెల్ల నింపెస లారన్॥ ౧౩౪

క. అనుపమా నాదులచేతను
మనమున నూహించలేని మహితునివలన
నజనియించె కమలజాతుడు
గనె నాతడు మరీచి యనెడి ఘనసుతు వేడ్కన్॥ ౧౩౫

గీ. ఆమరీచికి కశ్యపు డవతరించె
నతని బుత్రుడు మనువను నవని విభుడు
మనువు గనియె నిక్ష్వాకుని మహిత గుణుని
నతడయోధ్యను గట్టించె నమరు లలర॥ ౨౩౮

వ. ఇక్ష్వాకునకు కుక్షియు, కుక్షికి వికుక్షియు, వికుక్షికి బాణుండును, బాణున కనరణ్యుండును, అనరణ్యునకు పృథువు, పృథునకు త్రిశంకుడు, త్రిశంకునకు దుందుమారుడు, దుందుమారునకు యువనాశ్వుడు, యువనాశ్వునకు మాంధాత, మాంధాతకు సుసంధి, సుసంధికి ధ్రువసంధి, ధ్రువసంధికి భరతుడు, భరతున కసితుడు, అసితునకు సగరుడు, సగరునకు యసమంజసుడు, అసమంజసునకు యంశుమంతుడు, అంశుమంతునకు దిలీపుడు, దిలీపునకు భగీరథుడు, భగీరథునకు కకుత్థ్సుడు, కకుత్థ్సునకు రఘువు, రఘువునకు కల్మాషపాదుడు, కల్మాషపాదునకు శంఖుడు, శంఖునకు సుదర్శనుడు, సుదర్శనకు నగ్నివర్ణుడు, అగ్నివర్ణునకు శీఘ్రగుడు, శీఘ్రగునకు రురుడు, రురునకు ప్రశుశ్రుడు, ప్రశుశ్రునకు అంబరీషుడు, అంబరీషునకు నహుషుడు, నహుషునకు యయాతి, యయాతికి నాభాగుడు, నాభాగునకు అజుడు, అజునకు దశరథుడు; దశరథునకు రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు అందు రామునకు నీదుపుత్రిక సర్వాంగసుందరి సీతను, లక్ష్మణునికి, నీదు ద్వితీయపుత్రిక నూర్మిళను, భరతునకు నీతమ్ముడగు కుశధ్వజుని పుత్రికను మాండవిని, శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని యొసగి బరిణయ మొనర్ప కోరుచున్నవారము. సదృశులగు నీవరులకు సదృశలగు నీపుత్రికల నీవిచ్చుట కర్తవ్యమవు, అని పలికి వశిష్టుడూరు కొనెను. అంత జనకుడులేచి

క. వినుడీ పలికెద మీరలు
మనమలరగ నాదువంశ్య మహీపుల నెల్లన్
ఘనముగ వినగావలయును
వినవీనుల కింపుగలుగు విధి విదులారా॥ ౨౩౭

క. నిమి మాకు మూలపురుషుడు
విమతార్చితుడతడు దివ్య విధులను నెఱుగున్
శమదమ శాంత గుణాఢ్యుడు
సమకాంచన లోష్టుడధిక సత్త్వాధికుడున్॥ ౨౩౮

క. అతనికి బుట్టెను మిథియను
హాత విమతుడు ధర్మవిదుడు హార్దాధికుడు
న్నతగేంద్ర యాయిభక్తుడు
మతి ధిక్కృత ధిషణుడ మిత మాన్యుడు భువిలో॥ ౨౩౯

క. మిథిలను గట్టెను మిథియే
విధిబృందము నెఱుగువాడు విశ్వాతిగుడున్
బుధలోక వినుత చర్యుడు
ప్రథితా సుర మర్ధనుండు ప్రథిత యశుండున్॥ ౨౪౦

క. ఆవిభు తనయుడు జనకుడు
సేవిత గురుపాదపద్మ చిత్రిత మతియున్
పావిత వంశ్యుడు విద్యా
కోవిధుడు సకలరిపు జన కోలాహలుడున్॥ ౨౪౧

క. జనకుని పిమ్మట నృపతులు
జనకులనుచు బిల్వబడిరి జగములమిగుల
జ్జనకు నుదావసుడను
జననాథుడు బుట్టె సుమ్ము జనహితుడగుచున్॥ ౨౪౨

వ. ఉదావసునకు నందివర్ధనుడు, నందివర్ధనునకు సుకేతుడు, సుకేతునకు దేవరాతుడు, దేవరాతునకు బృహద్రథుడు, బృహద్రథునకు మహావీరుడు. మహావీరునకు సుధృతి, సుధృతికి ధృష్టకేతుడు, ధృష్టకేతునకు హర్యశ్వుడు, హర్యశ్వునకు మరువు, మరువునకు ప్రతీంధకుడు, ప్రతీంధకునకు కీర్తిరథుడు, కీర్తిరథునకు దేవమీఢుడు, దేవమీఢునకు విబుధుడు. విబుధునకు మహీధ్రకుడు, మహీధ్రకునకు కీర్తిరాతుడు, కీర్తిరాతునకు మహారోముడు, మహారోమునకు స్వర్ణరోముడు, స్వర్ణరోమునకు హ్రస్వరోముడు, హ్రస్వరోమునకుజనకుడను నేను జ్యేష్ఠపుత్రుడను. కుశధ్వజుడనువాడు ద్వితీయపుత్రుడు, నాతమ్ముడు. నాతండ్రి, నన్నురాజ్యమున నిలిపి దానువనంబునకు జనియె. నేను రాజ్యము నేలుచుండ సుధన్వుడనువాడు మిథిల నవరోధించి శంకరచాపమును సీతను దనకొసగవలెననియు లేకున్న యుద్ధమునకు సిద్ధపడవలెననియు బలికెను. అపుడు నేనును సుధన్వుతో ఘోరబుంగబోరి యతనిని సంహరించి యతనిరాజ్యమును వశపఱుచుకుని దానిని నాతమ్ముడగు కుశధ్వజున కొసంగి సాంకాశ్వరాజధాని యందాతనిని బట్టాభిషిక్తుని జేసితిని. నాపుత్రికను సీతను రామచంద్రునకును, నా ద్వితీయపుత్రికను నూర్మిళను లక్ష్మణునకు, నాతమ్ముడు కుశధ్వజుని ప్రథమ పుత్రికను మాండవిని భరతునకును, నాతమ్ముని ద్వితీయపుత్రికను శ్రుతకీర్తిని శత్రుఘ్నునకును, నొసంగుచున్నవాడను అనిబలికి యూరకుండెను. అపుడు ద్విజులనేకు లుచ్చైస్స్వరంబున మహాసంకల్పమును చూర్ణికను పఠించిరి. యంత తిరస్కరిణిని దీసి రత్నపీఠంబుల వధూవరులను ప్రవేశింపజేసి యథాశాస్త్రముగ జనక కుశధ్వజులు కన్యాదానమొనర్చిరి. వశిష్ఠమహర్షి హోమవిధులనెల్ల పూర్తిగ నొనర్చె. జనకుడు వధువులకు వస్త్రాలంకార గ్రామగజతురగ రథ పరివారాదుల నమితముగ నొసగి వరుల కభిముఖముగ నివసింపజేసి రామునిగనుగొని

గీ. ఇదియె సీతాఖ్య నాసుత శ్రీసమాన
ధర్మములయందు నీదారితప్ప దెపుడు
భార్యగా నీవుగైకొను భద్రమగును
పాణిఁబాణినిపట్టుము భవ్యరామ॥ ౨౮౩

క. పతి దేవత యీాచిన్నది
సతతము నీఛాయవలెనె సహావర్తిని యౌ
కృత కృత్యుఁడ నైతినినే
నతులిత శుభచయము నీకు నలవడు నెపుడున్॥ ౨౮౪

క. అనిపలికి జనకు డప్పుడు
ఘనమంత్రజలంబు రాము కరమున విడిచెన్
మనమున సంతసమందిరి
మునిపుంగవు లెల్లజనులు ముదమునబొంగన్॥ ౨౮౫

క. వినబడె సురవాద్యధ్వని
గనబడె గగనంబునుండి ఖచరులవలన
న్ఘనముగ గురియుచు నుండెడి
మన మలరెడి పుష్పవృష్టి మహితులు బొగడన్॥ ౨౮౬

వ. అపుడు జనకభూపాలుడు తక్కిన వధువుల పాణిగ్రహణ ములు వరులచే జేయించనెంచి, హర్ష పరిప్లుతుండై,

సీ. లక్ష్మణ కరమున లలితమా యూర్మిళా కరమును బట్టుము గలుగు శుభము
భరత నీకరమున బట్టుము మాండవీ కరమును ఘనముగ గలుగు శుభము
శత్రుఘ్న కరమున జక్కని శ్రుతకీర్తి కరమునుబట్టుము గలుగు శుభము
నలువురు మీారలు నయధర్మవర్తులు సుదతులతోగూడి సుఖము నొంద

గీ. గలుఁగ గలరని జనకుడు కరుణతోడ
పలుకు పలుకుల విని వారు భవ్యకరము
సాచి వధువుల కరముల సరసముగను
బట్టి సంస్పర్శ సుఖమును బడసినారు॥ ౨౪౭

వ. అంత సుముహూర్తసమయమున నడిమి తెర దీయ నీలమేఘ నిభుడగు శ్రీరామచంద్రమూర్తి చంచలాభయగు సర్వాంగ సుందరి సీత నెమ్మోమునుగని పరమానందరసాబ్ధిని మునిగి దరిగాన లేకపోయెను. లజ్జా పరవశయగు సీతయు మిగుల మనంబున నానంద కందళితయయ్యె.

ఉ. రాముని మోముగన్గొనిన రమ్యశశాంకుని పండువెన్నెల
న్గోము వహించు కల్వలన కోమలి సొంపగు వాలుచూపులా
రామ పదారవిందముల రక్తివహింపగ వ్రాలె నింపుగా
రామలు భర్తృపాదముల రమ్యముగా బడి మ్రొక్కునట్లుగాన్॥ ౨౪౮

గీ. సీత సర్వాంగ లావణ్య సింధులోన
వరలు వికసితజలజాత వరములనగ
రాజవరుని జూపులుబడె రమణిపైని
రాజు కరములు కలువపై వ్రాలునట్లు॥ ౨౪౯

వ. అంతఁ నరుంధతీ విభుడు సౌవర్ణప్రతి సరబంధ మాంగల్య సూత్రధారణ ముక్తాసహితార్ద్రాక్షతారోపణ హోమాగ్ని ప్రదక్షిణాదుల యథాకాలమున యథా యోగ్యముగ జరిపి బ్రాహ్మణ సత్కారంబుల జరిపిరి. బ్రాహ్మణాశీర్వచన రావంబులును, మంగళ వాద్య ఘోషంబులును, గగనంబున కంటుసటులఁ జెలంగె. వధూవరు లగ్నికిని వేదికకును జనకునకును దశరథునకును మహర్షులకును ద్విజులకును వృద్ధరాజులకును ప్రదక్షిణ నమస్కారంబులఁజేసిరి. వశిష్ట విశ్వామిత్ర శతానంద వామదేవాదులు దీవించిరి. సభాసదులందరును

దంపతుల ననురూప వయోవిశేషంబుల కమందానందము నొందిరి. వేల్పులు దేవదుందుభుల మ్రోయించి కుసుమవర్షమును గురిపించిరి. రంభోర్వస్యాదులు నృత్యంబు నొనర్చిరి. గంధర్వులు శ్రుతి మధురముగ బాడిరి. వైవాహిక మహోత్సవము సకలజనమోదావహమయ్యెను. సాంగంబుగ వివాహమంగళ సంవిధానంబులన్నిటిని నిర్వర్తించిరి. యారవ దినంబున విశ్వామిత్రుడు వధూవరుల నాశీర్వదించి జనక దశరథుల ననుమతినొంది హిమవంతంబునకు జనియె. జనకుడు మహర్షులను ద్విజులను రాజులను తగిన విధంబున సత్కరించెను. దశరథున నేక విధంబుల బూజించె. దన పుత్రికలకును జామాతలకును యథాయోగ్య సన్మానముల నొనర్చె. నంత దశరథ భూపాలుడు వైదేహునా మంత్రణంబు వడసి కోడండ్రు కొడుకులు ననర్ఘ రత్నాందోళికల నెక్కించి పురోహిత సామంత మంత్రివరభృత్య పరిచారికాది పరివృతుడై మనోహరంబులగు మంగళవాద్య రవంబులు చెలంగ నయోధ్యాభి ముఖులై మిథిల విడిచి వెడలె. శతానంద కుశధ్వజ జనకులు దశరథుతోడ కొంత దవ్వరిగి యనుమతి నొంది ధన్యంమన్యమానులై మిథిలకు జనిరి. దశరథ భూవల్లభుండు వాసవవైభవంబున జనుచు మార్గంబున గల రమ్యనగర రమ్యవనోద్దేశంబుల గని యానందించుచు శ్రోత్రపేయంబులగు వశిష్ట వామదేవ జాబాలి ప్రభృతుల మహోపదేశంబుల విని యానందించుచు సుఖప్రయాణంబొనర్చుచుండ భీమంబులగు ననేకోత్పాతంబులు గనపడిన వాటిం నెల్లగని సాకేతపురాధీశ్వరు డరుంధతీ ప్రాణనాథు నవలోకించి "మహాత్మా! యవలోకింపుము. దారుణోత్పాదంబులుగలుగుచున్నవి. మనమునకు వచింప శక్యముగాని వింత వికారము బొడగట్టుచున్నది." యనిన, సర్వజ్ఞుడగు వశిష్టుండు రాజేంద్రా! సర్వమును బొడగంటిని, భీతి నొందకుము. ధైర్యము నవలంబించుము. తొలుత దారుణంబగుమహాపద తటస్థించి తుదకది సర్వమంగళాకరంబగు శాశ్వతకీర్తిగలుగును. పక్షిముఖమున భయమును, మృగముఖమున స్వశ్రేయసంబును బొడ

గట్టుచున్నదను చండ ప్రగమత్రమముగ గాలిహెచ్చి వృక్షంబు లెన్నియో పెళపెళ విఱిగిపడియె. ధూళిరేగిభూమ్యంత రిక్షముల గప్పి వేసె. సూర్యకిరణ ప్రసరణంబు మందగించె. తిమిరంబువ్యాపించె. వశిష్టాదులు నివ్వెరబడి చూచుచుండిరి. దశరథుడు పుత్రులకేమి కీడు మూడునోయని భీతి నొందుచు భగవత్ప్రార్థనను జేయుచుండెను. అంతనొకమహాతేజంబు నేత్రంబుల మిరుమిట్లుగొలుపుచు ప్రాదుర్భవించె. మహారావంబులతో మహావ్యక్తి యొకటి భయంకరంబుగ నగ్రభాగంబున దోచె. సేనావారంబునగల ప్రజలందరు పలాయితులైరి. పెద్దలందరు బరిశీలించి బరికించి రాజరాజ విమర్దనాలోలుడగు భగవంతుడు పరశురాముడని దలచిరి.

—♦ పరశురామాగమనము. ♦—

క. జమదగ్ని సుతుని గనుగొని
సమవర్తిని గాంచినటుల చకితులు భూపుల్
తమ తమ రథముల చాటున
తమమేనులు దాచుకొనిరి తద్దయుభీతిన్॥ ౨౫౦

వ. అపుడు దశరథ మేదినీకాంతుడు దనమనమున

గీ. రాజరక్తాంబు నిధిలోన రమ్యముగను
త్రిషవణములొనరించిన తీవ్రకోపి
పరశు రాముడు ధీరుడు భయదమూర్తి
పరగ బ్రత్యక్షమయ్యెను భార్గవుండు॥ ౨౫౧

చ. ఇరువది యొక్కమారు లిల నెల్ల నృపాలుర గండ్రగొడ్డటన్
బరువడి దృంచి యగ్నివలె బాగుగ మండుచు తీవ్రకోపుడై
తిరిగిన భార్గవోత్తముడు తీర్థపదుండిట భానువంశ్యుల
న్బరశువు తోడగూల్పగను పంతముబట్టగ బోలుదైవమా॥ ౨౫౨

సీ. మనసున బుట్టిన మహితకోప రసంబె స్వేదజలంబున జెలగెబైకి
జయలక్ష్మి కరమున సమృణాళపద్మంబు నానొప్పుపరశువు నటన మెప్ప
వరకోపశిఖి శిఖా వాసారుణద్యుతి గనులెఱ్ఱ బారిన గతిని మెఱయ
వీర రసార్ణవ వేలను బోలిన వికటభ్రుకుటి దోచె భీషణముగ

గీ. మేఱ మీఱినతపస్సను మేటివహ్ని
జ్వాల లననొప్పు కెంజాయ జడలుగ్రాల
నడుగు లిడుచోటకిందికి యవనిగ్రుంగ
భయద వృత్తిని బఱతెంచె భార్గవుండు॥ ౨౫౩

క. పుట్టిన దాదిగ వ్రతియై
కట్టలు కనురిపులగొట్టి కాలునిభంగి
న్పట్టిన పట్టును విడువక
దిట్టరియై చాప నిగమ ధీనిధి వెలసెన్॥ ౨౫౪

క. ఇరువది రెండవ మాఱును
బరువడి మొదలిడెమొ నేమొ బాహుజహతికిన్
వెరవిక దోచదు మనమున
పురహరసుతుగెలిచె నితడు పూర్ణప్రజ్ఞన్॥ ౨౫౫

క. అనిమనమున దాదలచుచు
ఘనపాత్రల నర్ఘ్యపాద్య కలితులువిప్రుల్
వినయముతోఁ జనుదేరగ
జననాథుడు పరశురాము సన్నిధి కేగెన్॥ ౨౫౬

వ. దశరథమహారాజు పరశురాముని సన్నిధికిబోయి చేతులుఁ జోడించి నమస్కరించి,

—♦ దశరథ పరశురాముల సంభాషణము. ♦—

గీ. చాపమున శాస్త్రమందున శక్తిఁగలిగి
వీరలోకంబు మెచ్చంగ విభులఁగెలచి
కశ్యపునకెల్ల భూమినిఁ గరుణఁ నిడిన
పరశు దారిని రాముని భక్తిఁగొలుతు॥ ౨౫౩

వ. అని భగవంతుడా! భార్గవరామ! సావిత్రుడను వశిష్టశిష్యుడను దశరథుడను నమస్కరించు చుంటిని. యర్ఘ్యంబును, పాద్యంబును గొనుము.

క. అనవిని భార్గవరాముడు
ఘనకోపముతోడఁబలికె కాలునిభంగిన్
వినయముఁ జూపగవచ్చితె
వినిక్షత్రశిరుండవగుచు వేగమబోవన్॥ ౨౫౪

క. వినయము నాయెడ బనిలే
దన యమునేఁజూడఁజాల నవివేకుండై
ఘనహర చాపమువిఱచిన
మనుజులు నీసుతునిరాము మననిచ్చెదనే॥ ౨౫౫

వ. దశరథరాజా! నీవు నేడుగదా నాకన్నులబడితివి. యిపుడికనెటకేగగలవు. నీవు శూరుండనని యల్పవీర్యులచెంత పెక్కులాడిన వాగ్విభీషికలనెన్నిటినో నేను వినియుంటిని. నీవంటి బాహుబల విక్రమ శూన్యులగు క్షత్రియులీవిశ్వమున నింకను గలిగియున్నారు. నీవు భీతుడవై దాగియుండుటను నీపేరు వీనుల బడుటయేగాని నీరూపము నాకనుల బడకుండుటను నీవింతకాలము బ్రతికియుంటివి. యిదియేమి పాపమోగాని వర్తమానకాలమున భూమి వంధ్యయైనది. నవభవ ద్వీర్యాణుల గనటలేదు. గనుకనే భూతలంబున,శూరాభావముగలిగినది.

శస్త్రాస్త్రకథయె యంతరించినది. నీవంటి భీరువు లెందఱున్న నేమి ఫలము. యుద్ధాభావమై రణమృతులులేకుండుట స్వర్గమార్గమక్షుణ్ణమై, ఘాసాద్యుత్పత్తిగల యక్షుణ్ణైకపదివలె సంకుచితమైయున్నది. యనిన విని దశరథుండు

గీ. వైమనస్యంబు విడువుము వైరమేల
కరుణమనమున గూర్పుము కలుషహీన
త్రిజగదభయద హస్తంబు తీవ్రశస్త్ర
ధారి పుత్రుని యందున దనరజనునే॥ ౨౬౦

గీ. పుత్రభాండుకు రాముడు భూరిగుణుడు
వానిరక్షింపవలయును వరదనీవు
తపనుభానుల సకలంబు తప్తమైన
పద్మ మొక్కటి భాసిల్లె భవ్యశీల॥ ౨౬౧

సీ. అనవిని భార్గవు డతికోపవశమున దశదిక్కులును భీతి దాల్చున
టుల
మన్నామమునుదాల్చి మహిని బుట్టిన పుత్ర మాన్యత గలిగిన
మనుకులుండ
వీరగోష్ఠులగల్గు విక్రమ కథలను వెలియ దెలివిలేని వేఁబెవీవు
శివధనుర్మథనోత్థ చిత్రాగ్ని మిక్కిలి రఘుజనక కుటుంబ రమ్య
బాష్ప

గీ. పూరములచేత జల్లారు పూర్ణముగను
వేరుమార్గంబు దానికి వేరెలేదు
దయ యనగ నేమొ యెఱుగను దగినయటుల
నరులగూల్చెడి విద్యనే యరసినాఁడ॥ ౨౬౨

వ. అను పరశురాముని తీవ్రకోపవాక్యములవిని దశరథుడు పుత్రుల గాపాడుకొనవలెననెడి తలంపున శాంతంబున పరశురాము నవలోకించి భార్గవరామా! వినుము.

గీ. వేదములనెల్లఁ జదివిన విశ్వవినుతు
డజుడుభృగువశిష్ఠాదుల నధికలీల
గనిన వాడౌట గురువవు గావెమాకు
గనుక దయతోడ మము జూడఁ గడగు మిపుడే॥ ౨౬౩

గీ. మనమునందున కోపంబు మసలవలదు
శాంతినొందుము నీవిప్డు శస్త్రగుణుడ
మనకు వైరంబు తగదయ్య మాన్యతిలక
కోపియెంతటి పనినైనఁ గోరిచేయు॥ ౨౬౪

వ. అనిబలికిన దశరథవాక్యంబులు తీక్ష్ణంబుగ మండువహ్ని బడెడి యాజ్యధారవలె ప్రజ్వలన హేతువులై నటుల మండిపడుచు భార్గవ రాముడు దశరథునవలోకించి కటంబులదర పటపట పళ్లుగొరుకుచు భూమి బ్రద్దలగునటుల వీరాట్టహాసంబుజేసి పదప్రహారంబులజేయుచు దశరథరాజవినుము. సత్వరంబుగ నీవు వచించినటులనె శాంతినొందెద. నదియెప్పుడనెదవా మద్బాహువిరాజమాన తీక్ష్ణ పరశువున నిన్నును, నీపుత్రులను, జనకుని, తత్సోదరుని బరిమార్చిన యపుడు శాంతినొందు ననిబలికెను. పరశురామునియెడల దశరథవాక్యము లేమియు బనిజేసి యుండక కోపప్రోత్సాహకము లగుచుండుటనుగాంచి శ్రీరామ చంద్రుడు లక్ష్మణసహితుడై చిరునవ్వునవ్వుచు సగర్వంబున భగవంతుడవగు విప్రోత్తమజమదగ్ని తనయా! వినుము.

## —♦ రామ పరశురాముల సంభాషణము ♦—

సీ. జనియించినాడను సప్తాశ్వకులజాత క్షత్రియశ్రోత్రియ గోత్రముసను
కౌశికుకృపచేత కౌతుకవశమున చదివితి దివ్యాస్త్ర సమితినెల్ల
నావంశమందున నరులుకీర్తినిగాని దుష్కీర్తినైనను దోపఁజేయ
గలుగుదురని నేను గనబోనుభీతిని విప్రుపై నలగగవెఱచువాఁడ

గీ. గానసీయాటయిుట సాగె శరిన ఫణితి
పీడిశాంతింపు విప్రుడ విపులయందు
కులముకొలదిని మాటలు కొలనినీటి
కొలది తామరయగుగాదె కోవిదుండ॥ ౨౬౫

వ. అను రామచంద్రుని వినయ నిచుళిత శరినవాక్యంబులవిని మండిపడుచు యేమీా నేను విప్రుడనా? నీవు క్షత్రియ శూరుడవా? నీవీనులతో వినవైనలేదా? నీకులజులు క్షత్రియులు. వీరంమన్యులెందఱు నాచేనిహతులైరో యింత విఱ్ఱవీగెద వేల యిదియె నా పరశువు నీగర్వ మడచును వినుము!

గీ. దశరథునితోడ మిముసెల్ల దండధరుని
వశమునకుబంపి దిశలంను వాసిగాంచి
జనకనృపతి కబంధోత్థచారురుధిర
ధారలను భూమిదడుపుదు దారుణముగ॥ ౨౬౬

గీ. రాముడావాక్యములవిని రమ్యఫణితి
వాగ్విభీషిక యిదియేల వలదువలదు
శక్తికలదేని జూపింపఁ జాలుమిపుడె
శక్తిలేకున్న జయ్యన జనుములేచి॥ ౨౬౭

చ. ఇరువదియొక్కమాఱులిల నేపుగరాజులగూల్చినట్టి నీ
శరమొకమారుచూడవలె గన్పడజేయుము శక్తియుండి న
న్నరపకునిష్ఫలోక్తులను బల్కిననమ్మను పూర్వవృత్తము
న్దిరముగజెప్పబోకనిక దివ్యశరంబును బూనుమిప్పుడే॥ ౧౬౮

వ. శ్రీరాముని వాక్యంబుల విని గర్వోన్నతుండగు పరశు
రాముడు రాముని తీవ్రకోపంబునగని

చ. దశరథపుత్రరామ బలదర్పముగల్గివి దేహదత్తమా
పశుపతిదివ్యచాపమును భగ్నముజేసితివంచు వీనుల
న్విశదముగావినంబడిన వేగమెనిన్గనవచ్చినాడన
న్పశుపతిపుత్రకల్పుడగు భార్గవరాముడటంచునెంచుమీ॥ ౧౬౯

చ. మనమునసిగ్గులేకమద మత్తత శంకరుజీర్ణచాపము
న్వినయవిహీనతన్విరచి వెంగలివైతివి పాపచిత్తుడా
గనుగొనవచ్చెభార్గవుడు గల్గినబాహుబలంబుజూపుమీ
సునిశితబాణజాలముల జూడుముబంపెద కాలువీటికిన్॥ ౧౭౦

క. అడవిబచి పొంగిపొఱలకు
మదివిఱిగెను పూర్వమందె హరుకరమందే
యిదెకొనుమువిష్ణుచాపము
మదమాఱును శరముగూర్ప మందమనీషా॥ ౧౭౧

క. లోకముగెలచినపరశువు
నాకరమునగలదుసుమ్ము నవనవశక్తిన్
నాశముజేరుచునిన్నును
మూకహితము జేసిమహిని మనియుండెదవే॥ ౧౭౨

గీ. బ్రతుకలేవికమాటలు బలుకనేల
ప్రాణభీతినిబరచిన బారలేవు
గురునిచాపంబువిఱచిన కూళవీవు
ఫలమునొందుము వేగమ భానుకులుడా॥ ౨౨3

వ. అని పరుషంబుగ మాటలాడు పరశురామునిగని రామచంద్రుడు నీవు పారుండవనిదలచి యుపేక్షించినకొలది వాక్ప్రపంచంబు విస్తరిల్లుచున్నయది. వాహ్యాచరులు కార్యశూరు లెన్నడును గానేరరు. ప్రభాకరవంశ్యుల పరాక్రమము భువనవిదితము విప్రునిపై పరాక్రమింపవలసెనని గాని లేకుండిననిన్ని బిభీషికలు జరుగగలవేయనిన ప్రళయకాలకాలునిభంగి గంతులిడుచు మహాట్టహాసంబు జేయుచు దనచేతనున్న వైకుంఠచాపంబు రామునకందించి దీన శరంబు గూర్పుము. జూతమని బలికిన నాతని కరంబునుండి యాచాపంబునుగొని దాని తోడనేతదాశ్రితస్వీయ తేజోవిసరంబు సర్వంబును సత్వరంబుగ నాకర్షించియత్రశమంబున నభ్యస్తధనుస్సననారిగూర్చినయటుల గొనయంబుదగిలించి యాకర్ణాంతమాకర్షించి శరంబు దొడగి బాణంబును జమదగ్ని సుతుపై విడువ గమకించిన నతని విలోకించి పరశురాముడు భీతిల్లుచుండె. నంత శ్రీరామమూర్తి భార్గవరామా! యీశరంబున నీపాదంబుల నిరాఘాటంబుగ ద్రుంచెద. బ్రాహ్మణుండవు గావున "బ్రాహ్మణోనైవ హంతవ్యః" యను నార్యోక్తిని బట్టి నీప్రాణములగొన నొల్ల నీయభీష్టంబేమి వచింపు. మనవుడు వైష్ణవ తేజోవిరహితుండైన కేవలవిప్రప్రాయుడు, జమదగ్ని సుతుడు, సీతామనోనాయకుని వీక్షించి వినయంబున

గీ. అనఘభవదీయ మహిమంబు నరయలేక
తప్పుజేసితి సైరింపు తపనవంశ్య
యమరులర్థింప రావణ హననమునకు
నవతరించిన నారాయ ణాంశజుండ॥ ౨౭౮

సీ. వినవయ్య సీతేశ విష్ణుని తేజంబు నాయందు గలుగుట నవ్యశక్తి
వెతకి ముయ్యేడులు వేడ్కను జంపితి భాహుజవిసరాల భాను నిభుల
నీతేజమునుసీవు నిపుణత గైకొన వేదవిప్రుడనైతి పేర్మిలేదు
పరమాత్మనిను భక్తిపరతను గొలిచెద పరిపూర్ణ కరుణను బరప
వయ్య

గీ. పరమ పదవాసగతివీవె పరమ పురుష
నిన్ను సేవింతు సతతంబు నియతముగను
నిరుప మానందపదవిని నిత్యముగను
పడయగోరెద నికమీద భవ్యతేజ॥ ౨౭౯

వ. నీవు మనుష్యమాత్రుడవుగావు. పరమపద వాసుడవు. సర్వ స్వతంత్రుడవు. సర్వాంతర్యామివి. సర్వస్వరూపుడవు. సర్వాధారుడవు. సర్వేశ్వరుడవు. నీకంటె యధికు డెవ్వడునులేడు. నీవు క్రీడార్థ మీజగమున నవతరించినవాడవు. దుష్టులను సంహరించెదవు. శిష్టులను రక్షించెదవు. మహాత్మా! నన్ను రక్షింపుము. శరణాగతరక్షణము నీకు సహజకృత్యము. నేను నీ శరణమును కోరినవాడను

సీ. వసుమతి యంతయు వశము జేసితినయ్య కశ్యపమునికిని క్రతువు
నందు
కాశ్యపియందున గాపురముండగ వలదని బలికెను వాసియతడు
పాదయుగములేక పరవగవశమానె పరమపావన నాదు భవన
మునకు
కనుగొనుమదె పుణ్య గతివేగదానిని శరమున గొట్టుము శస్త్ర
ముగను

గీ. మఱల గొనియెద తపమున మంచిగతిని
నీకునర్పింప తపములు నిపుణమతులు
జేతురదె వారి జేర్చను జేరుచోటు
చకితమతి నైతి గావుము చక్రహస్త॥ ౨౭౬

వ. మఱియు రఘురామా! పూర్వకాలమున సకలదేవతలకోర్కె ననుసరించి విశ్వకర్మ తననైపుణ్యము నంతయు నుపయోగించి రెండు చాపంబులనిర్మించె నందొకటి యమరులు రుద్రునకొసగిరి. యదియె నీచే భగ్నమైన శంకరచాపము. రెండవది విష్ణువునకర్పించిరి. దానవిష్ణుండు క్రూరదానవుల ననేకుల దునుమాడె. పదపడి దేవతలు శివకేశవుల తారతమ్యమరయగోరి వారిరువురికి భేదంబుగలిగించి యిద్దరిని బోరించిరి. యందు శంకరుడు స్తంభితుడయ్యె. కేశవుడధిక బలుడని దేవతలు గ్రహించిరి. యిద్దరికిని మైత్రిని సమకూర్చిరి. యంత శంకర చాపమును దేవతలు దేవరాతున కొసగిరి. విష్ణుచాపంబు భార్గవ వంశీయుడగు, రుచీకునకిచ్చిరి. రుచీకుడు మజ్జనకుడగు జమదగ్నికి నొసగెను. నాతండ్రి నాకొసగినవాడు. ఇప్పటివరకు నీధనువు నాకరమున నున్నది. యని బలికిన రామచంద్రుడు దాను దొడగిన బాణముచే భార్గవరాముని పుణ్యగతిని భేదించె. నంత పరశురాముడు వినయంబున రామచంద్ర నీవు సర్వవ్యాపివి. పరమ పురుషుడవు. నీమహిమ దెలియ నేనెంతవాడను. నీవాడించినటుల నింతవరకునాడితిని. ఇక నేను మానవమాత్రుడ నైతిని. నిన్ను నభమున బన్నియుండి దేవతలందరు చేతులొగ్గి కొనియాడుచున్నవారు. నీవు దీర్ఘాయుష్మంతుడవుగమ్ము. నాకు సెలవొసంగుము. నేను పోయివచ్చెదనని బలికి, దన గృహమునకు జనియెను. అంత వారిని దింపి చాపంబును లక్ష్మణహస్తముననిడెను. దశరథాదులందరు రాముని గని యానందపరవశులైరి. వశిష్టమహర్షి కనులుమూసి దనమనమున రాముని నవలోకించి, యానంద పరవశుడయ్యెను. దశరథుడు సకల పరివార

సమన్వితుడై సుఖగమనంబున మంగళవాద్య ఘోషంబుతోడఁజనుచు దివ్యాలంకార బంధురంబగు నయోధ్యాపురమున సుముహూర్తమున జేరి రాజభవనంబున దివ్యమందిరంబుల కోడుకులను, కోడండ్రను, నూతన వధూగృహ ప్రవేశ మహోత్సవమును జరిపించె. దేవతా యతనంబుల బూజలనలిపె. పూజ్యులపూజించె. యాశ్రితుల నాదరించె. దశరథుడానంద పారవశ్యుడయ్యె. కోడండ్రునలువురును కౌసల్యాప్రభృతు లగు దమయత్తలకు నమస్కరించి దివ్యభవనంబుల దివ్యభోగంబుల భర్తలతో ననుభవించుచుండిరి.

గీ. యొక్క దినమున భరతుని యోర్పుతోడ
దనదుచెంతకు బిలిపించి దశరథుండు
జనుమునీవనుతమ్ముడు సౌఖ్యముగను
పెద్దవాడైనతాతను పేర్మిగనగ॥ ౨౭౭

వ. నీమాతులుడగు యుధాజిత్తు బహుదినములనుండి నిను గొనిపోవుటకుగాను మనగృహంబున నిలచియున్నవాడు. నీవాతనితోడ జనుము. అని బలికిన, దశరథవాక్యంబులవిని యన్నకు వినిపించి యాజ్ఞాపితుడై శత్రుఘ్నుతోడను, యుధాజిత్తుతోడను మాతామహ పాలితంబగు రాజగృహంబునకుజనియె.

## —♦ శ్రీ రా మ సౌ జ న్య ము ♦—

వ. అట యయోధ్యాపురమున శ్రీరామచంద్రుడు

ఉ. కాలము బంచి ధర్మమును కామము నర్థముగూడ బొందుచు
న్నీల సమస్త భూప్రజల లేశము కష్టమెరుంగకుండగా
మేలుగగాచి సౌఖ్యముల మేలుఁగగూర్చుచు తల్లిదండ్రుల
న్జాలగభక్తిఁగొల్చుచును చక్కగరాముడుబుచ్చె కాలమున్॥ ౨౭౮

వ. శ్రీరామచంద్రమూర్తి జయశీలముల జిష్ణుని ప్రతాపమున తపనుని సంతత ప్రియ దర్శనమున చంద్రుని వైభవమున దేవేంద్రుని శౌర్యమున రఘువును దాతృత్వమున శిబిని సత్యవాక్యమున హరిశ్చంద్రుని బోలి ప్రకృతిరంజనమున రాముడన్వర్థనాముడై గురువుల భక్తిని గొలుచుచు సహస్ర కిరణునివలె తేజోభిరాముడై తలిదండ్రులను గురువుల నాశ్రితుల బంధువుల సంతసిల్లజేయుచు కామితకల్పకుడై వర్తిల్లుచుండె. తావితోగూడిన పువ్వువలె సీతతోగూడి యుక్తకాలమున సుఖించుచుండె. ప్రజల నందర దనప్రజలవలె లాలించుచుండెనని కుశలవులు వినిపించిరి. విని రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు వశిష్ఠాదులును పరమానంద తరంగితాంతఃకరణులైరి.

క. కాకుత్స్థ వంశభూషణ
లోకాతిగ మహితమహిమ లోకారాధ్యా
భీకరదనుజ విదారణ
పాకారి ప్రముఖవంద్య భాస్కర వంశ్యా॥ ౨౯

క. రామారఘుకులసోమా
సామప్రియ సత్యనిరత సాత్వికవంద్యా
కామితదాయక సర్వగ
భీమాహితదనుజనికర భీషణచర్యా॥ ౩౦

మాలిని. సుమసమ సుకుమారా సూరి సంస్తోత్రపాత్రా
విమతజనవిదారా విశ్వరక్షాధికారా
అమరగణ సుదూరా హర్షితానంత భక్తా
విమల సుగుణహారా విశ్వబాధాపహారా॥ ౩౧

శా. లోకాతీత గుణాభిరాముడు రమా లోలుండు రామప్రభుం
డీకళ్యాణ కృతీశ్వరుండ జముఖా భీష్టార్థదుం డాఢ్యుడు
స్త్రీకళ్యాణ సుఖంబు లిచ్చిమనుచుం చేతోముదంబొప్పగా
నీకావ్యంబురవింపు తారకలతో నింపొంపు భద్రంబుగన॥ ౨౮౨

మ. ఇదిరామానుజ యోగిరాజ కథితా భీష్టార్థ తత్వజ్ఞతా
పద విభ్రాజితు యజ్ఞమూర్తిని మది న్భావించి స్వీయాన్వయున్
ముదమొప్పారగ రాముదమ్మునికథన్మో మోంచాఫలాభంబుగా
సదయుల్మెచ్చగ బల్కె రెండవదియాశ్వాసంబు రామప్రభో॥
౨౮3

గద్య

ఇది శ్రీమద్భగవద్రామానుజ కరుణాకటాక్ష పాత్ర యజ్ఞార్య పవిత్ర వంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తదీయపీఠాధిష్టిత భారద్వాజస గోత్ర
పవిత్ర తిరుమలై యచ్చార్ కొండూరు రాఘవాచార్య
దేశిక వేంకటాంబా పుత్ర విబుధజనవినయ చర్య
వేంకట తిరుమలాచార్య ప్రణీతంబగు
భరత చరిత్రంబను మహాప్రబంధము
నందు ద్వితీయాశ్వాసము
సంపూర్ణము. శుభం
భూయాత్ ॥

శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు.

శ్రీరామాయనమః

# భరతచరిత్రము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీశరభక్తవశంకర
శంకరహృదయారవింద శాశ్వతనిలయా
భీకరదానవ హారణా
సాకేతపురాధివాసి సకలార్తిహరా॥ ౧

క. రావణగర్వ విదారణ
భావుకసర్వాతిశాయి భవ్యవిలాసా
కోవిదనుత గుణనిచయా
పావితరఘువంశ రాజ భానుజవినుతా॥ ౨

వ. అవధరింపుము. ఇటుల రామభద్రుఁడు సర్వజనమనోహార వర్తనుఁడై దనగురు వరుఁడగు వశిష్ఠమహర్షి వలన ననేకధర్మరహస్యముల నెఱుగుచు సర్వజనసులభుఁడై సకలాభీష్టముల నొసంగుచు పదిరెండు వత్సరంబులు సుఖముగ సద్గోష్ఠిని దశరథుని మనంబత్యంతానంద పరవశంబగు నటుల వర్తించుచుండె. నంత నొకదినంబున దశరథభూమీశుఁడు దనమనంబున

—♦ దశరథ వైరాగ్యము ♦—

చ. అరువదివేలవత్సరము లార్యులు మెచ్చఁగ భూమినేలుచు
న్వరమ సువర్ణదక్షిణల పావనయజ్ఞములెల్ల జేయుచు
న్గర మరుదైన కాయమును కాంచన ఛత్రము క్రింద వండఁగాఁ
జరిపెతికాలమంత యిఁకఁ జక్కఁగ గాంచెద రామరాజ్యమున్॥ ౩

వ. ఇంతకాలము రాజ్యమునేలినను శరీరమంటుల శిథిల శిథిల
...ంసకొలదిని యాశనవనవోన్మేషముగ ప్రబలుచునేయున్నది. గాని దాని
...తిమాత్రమును శైథిల్యముఁ గలుగలేదు. వివేకి మహితుడగువాడు
...గ్యశిఖరి నధిరోహించి యాశకుఁ జాలదూరముగ వర్తించవలెను.
...పన్న

... ఆశకు మేరగల్గదెపు డాశకు వశ్యుడుఁగానీ వాడెపో
దేశము నైన శోకరస లేపుడు గాడు భవోద్భవంబుతో
పాశము లెల్లగోయఁగల పాటవయుక్తుడు భక్తియుక్తుఁడై
శాశ్వతమైన చోటికిని జక్కగ నేగఁగఁజాలు నీరుడు॥ ౪

గీ. ఆశ, యెవనికి, దాసియై యవని, వెలయు
నతని కందరు దాసు లైయలరు చుందు
రాశ కెవ్వడు దాసుడై యలరగలడో
యతడె దాసుడు లోకుల కందరికిని॥ ౫

... బాహాగర్వవిశిష్టుడై చుపటుదర్పంబొప్ప యుద్ధావనిం
వ్యూహవ్రాతము బన్నుగాక మరి దివ్యాల్ మెచ్చ శీలంబుతో
దేహాయాసము నొందియోగపరుడై దిష్టంబువేదోలుగా
కాహా యాశను గెల్చువాడు గలడే యాముష్మలోకంబులన్॥ ౬

వ. కాన నాశాపాశమును ద్రెంచుకొనగలుగుట దుర్లభము.
...ష్ఠాదిమహర్షుల మహోపదేశముల బహువారములు వినియున్న
...ను వివేకయుతుడనై విరక్తిఁజెంది రాజ్యతృష్ణను విడువవలెను. పర
...నై యత్నించవలెను. జరగబోవు కాలమును నిర్వ్యాపారుడనై
...చింతగ సద్గోష్ఠిని నిస్సంగుడనై పరలోక సుఖాకాంక్షినై బుచ్చెద.
...రాముని గుణధాముని యువరాజుగనొనర్చెదనని దలచి దశరథుడు
...మహాజనుల రప్పించి వారలనవలోకించి చిరకాలంబునుండి రాజ్య
...భారంబు వహించి డస్సితిని. తృప్తినొందితిని. గాన నికను

—♦ రామునకు రాజ్యమిచ్చెదనని దశరథుడు చెప్పుట ♦—

గీ. బలముగలవాడు భక్తిని ప్రబలువాడు
విద్యగలవాడు వివిధాస్త్ర వితతివాడు
కరుణగలవాడు సిరుకొల్కు గనులవాడు
రాముడిక మిమ్ము నేలును రమ్యముగను॥

వ. మీరందరును బాగుగ యోచించి రామునకు రాజ్యమిచ్చు టకు మీయభిమతంబెట్టిదియో, సత్వరంబుగ దెలియబలుకుడని . . . మహాజనులందరును యోచించి పరమానంద భరితులై భయ . . . విశ్వాసంబుల వినమ్రులై యేకవాక్యంబున మహారాజ, నీవు . . . కాలము నీప్రజలను, నీప్రజలవలె భావించి కాపాడితివి. మేము . . . కృతజ్ఞులము. వైవస్వతమనువు మొదలుకుని నీవరకునుగల మహా . . . ధర్మపరిపాలనా పద్ధతులాబాల గోపాలము విశదము. నీవు . . . దయాతరంగిత హృదయుడవు. పూర్వులనందర మించితివి. గను . . . రామునకు రాజ్యమివ్వదలచితివి. మాయందుగల దయకిది . . . నము. రాముడు మమ్ము బాలించుటకంటె మాకు భాగ్యోదయ . . . గలదు. మేము ధన్యులము, పరమానుగృహీతులము. అని . . . దశరథుడు వారల హృదయములనింకను నరయదలచి మీకు రా . . . యందింత యాదరమేలకలిగెననిన వారందరును రాజేంద్రా! నీవు . . . పాలకపిత వయినను మనువు, మాంధాత, రఘువు మొదలగువారి . . . లేని యనంతకళ్యాణ గుణగణములు రామునియందు గలవ . . . మమ్ములనిట్లు బలికించినవి సహకారఫలము లభించినవానికి సహ . . . పుష్పమునం దనురాగముత్రగ్గుట సహజముగదాయటులనె మేము . . . రాజ్యమభిలషించితిమి. మేమేమిజేతుము. మాకనులెపుడును . . . గనుచుండును. మామనము రామాధీనము. మాజిహ్వ మధుర . . . విడిచి రామనామామృతాస్వాదనముననె నిత్యనియమితమైయున్నది. మేమేమి జేయుదుము, రామగుణాకృష్టులము. రామవశులమైయుంటిమి.

—♦ రామరాజ్యమునకు జనుల సమ్మతి ♦—

గీ. దీర్ఘబాహుని రాముని తీర్థకరుని
చంద్రసమవక్త్రు పాండుర ఛత్రయుక్తు
సింహపీఠస్థు మూర్ధాభిషిక్తు నృపుని
గనులగనుగొన వేడుకగలదు మాకు॥ ౮

గీ. రామచంద్రుని చంద్రుని రాణమీర
గనులగనుగొని ప్రీతిని గాంచనట్టి
మనుజుడొకడైన గలడని మనసునందు
దలచగలవాడు లేడుసూ దశరథేశ॥ ౯

వ. మఱియొక వాక్యమునువినుము. అతీంద్రియ ద్రష్టలు సర్వవిధ వైరాగ్యసంపన్నులు, సర్వజ్ఞులు, నిష్కాములగు వశిష్టవామదేవ వాలఖిల్యాది మహర్షులందరును రామసహజసౌందర్యసద్గుణగణ విమోహితులై యన్వహమును తపోవనములవిడిచి రామునను సరించి సర్వమును మరిచియుండ ఫలకాములము కేవల పామరులము రమ్యావలోకనాకుతూహలులము. విషయలోలులము. సంపత్ప్రికాములముఅగు మేము లోకాతీతానంతరామ కళ్యాణగుణగణ గంగాతరంగాకర్షణలం దప్పించుకొనుటకు సమర్థులమెట్లగుదుము.

గీ. గానవేగమ రాముని గరుణతోడ
రాజ్యరమణుని జేయుము రఘుకులేశ
ప్రజలకోర్కెలం దీర్పుము ప్రభుతమెఱసి
రమ్యగుణసాంద్ర దశరథ రాజచంద్ర॥ ౧౦

వ. అనిబలుకు ప్రజలగనుగొని దనమనంబున సంతసించి తదనురూపవాక్యంబులు బలికి వారల నిజసదనంబులకు జన ననుమతి యొసగి రాముని రాజుగనొనర్చుటకు దృఢనిశ్చితుడై దనగురువరులగు వశి

ష్టాదులను నిజమంత్రి వరులను బిలిపించి నిజాభీష్టంబు వారలకెఱిగించి
తదనుమతంబున రామునిబిలిపించి లాలించి దనయభీష్టంబు వినిపించి
పితృాజ్ఞాతంతు సంబద్ధుడగు రాముని యంగీకరింప జేసి సర్వజ్ఞవశిష్టాను
మతంబున రాముని సుముహూర్తంబున దీక్షితునొనర్చి నియమంబుల
బోధించి, దశరథరాజేంద్రుడు దనపట్టణంబంతయు రమ్యంబుగ నలం
కరింప నాజ్ఞాపించె. తదధికృతులందరు సత్వరంబున యథాయోగ్యంబుగ
పట్టణంబంతయు నలంకరించిరి. రామపట్టాభిషేక వార్త పురంబంతయు
వ్యాపించి ప్రజలనందర నానంద సాగర మగ్నోన్మగ్నుల నొనర్చె.

## కైకకోపము

సీ. మంథరయనుదాసి మతిహీనయై వేగ రామాభిషేకోత్థ రవము వినుచు
దనమది తుదిలేక దనరుదుఃఖాబ్ధిని మునిగి వేగ మెజని మూఢయగుచు
కైకనుగనుగొని గనులబాష్పములొల్కఁ గఠినవాక్యంబులగలత వెట్టి
మనసుమారగజేసి మలినయుక్తులుజెప్పి కోపముగలిగించి కోర్కెఁ దెలుప

గీ. దైవ వశమున కైకయు, దయను వీడి
వైరమునుబూని చెరుపగ వైభవమ్ము
దలచిమాసినబట్టల దాల్చివేగ
కోపగృహమున బండెను కోపియగుచు॥ ౧౧

వ. దశరథక్షోణీనాథుండు నిష్కపటహృదయుండగుటను దన
రాణులందరిలోనను దనకు మిక్కిలి ప్రేమాస్పదయగు కైకకు రామ
పట్టాభిషేకోత్సవ వార్తను స్వయముగ వినిపింప దనచిత్తంబున దలచి
కైకేయీ భవనంబునకేగి దనయనుంగురాణినిగానక దదీయభవ
నంబు నంతయు వెదకి వేసారి తుదకొక గృహంబున భూమిపై బండి
ధృఢవస్త్రంపు ముసుగున నున్న కేకయరాజపుత్రి వీక్షించి కోప

కారణం బరయలేక నాత్మాపరాధ కారణంబుదెలియ నేరక చింతాపర వశుండై చెంతకుచేరి మంచివాక్యంబుల బలుకుచు బ్రతిమాలుచు,

సీ. దశరథుడప్పుడు దనపత్నినీక్షించి దనమది జింతించి దరికిజేరి
మెల్లగ ముసుగును మేలుగ దొలగించి గయ్యాళికాంతను గరుణ గాంచి
పరిపరివిధముల బ్రతిమాలి బ్రతిమాలి విసుగులేశములేక వేట్టిరాజు
రామునితోడుసూ రమణిదెల్పుముకోర్కె ప్రాణంబువేడిన బడయ గలవు

గీ. తప్పదనిబల్కవిని వేగ తరుణియనియె
ఫ్రతినజేసిన కోర్కెను బ్రచురపరతు
లేకయుండిన నమ్మంగలేను నేను
మోసగాడవు నినునమ్మి మోసపడను॥ ౧౨

గీ. పురుషులాడెడి మాటల పుడమియందు
సత్యమొకటైన గలదన జాలరెవరు
గాన నమ్మగ జాలను కాశ్యపీశ
కాల మనుగూడ కోరగాని కాలమయ్యె॥ ౧౩

గీ. తమపనులు దీరువఱకును తగినయట్టుల
బలికి పురుషులు పిమ్మట బలుకకుందు
రదియె కారణమనియెంచి యబల లెపుడు
నమ్మజాలరు పురుషుల నరవరేణ్య॥ ౧౪

వ. అని బలికిన కైకేయీ వాక్యంబులవిని కామశరపీడితుడగు దశరథుడు నిజకరంబుల దన యనుంగు రాణియగు కేకయరాజపుత్రి శిరంబు దన యంకతలంబుననిడి దన కభిముఖంబుగ నుంచుటకై చికుర బంధంబునందు మృదువుగ దనకరంబిడి యద్దేవి నవలోకించి

క. లోకమున నీవు రాముడు
గా కన్యలు ప్రియులు నాకు గలరన గలవే
యేకరణిని యిటుబలికెదు
నీకరుణను గోరువాడ నిజమిది వినుమా॥ ౧౫

సీ. గానక నెవ్వాని గడియయె యుగమౌనొ గనులపండువుగూర్చ గలడెవండొ
నాయసువులకంటె నాధనములకంటె నారాజ్యములకంటె నగల కంటె
నాపుణ్యములకంటె నాకీర్తిలతకంటె నాదేహమునకంటెనాకుమిగుల
నధికుడెవ్వ డజయ్యుఁ డాఢ్యుడు జయశాలి సదయుడు, సుగుణుడు సత్యయుతుడు

గీ. కమల నేత్రుడు కామిత కల్పతరువు
జనక జామాత జానకీ జానిచకిత
జంతు రక్షణ దక్షుడు చారుహృదయు
డట్టి రామునిపై యొట్టు బెట్టినాడ॥ ౧౬

క. ఇకనైన జెప్పవలవదె
వికసిత కంజాతపత్ర విస్తృతనేత్రా
గకవికలుఁ గలుగనేరవు
ప్రకటింపుము నీదుకోర్కె ప్రాభవమొప్పన్॥ ౧౭

క. భూలోకమంతఁ నేలుచు
కాలోచితమైన పనుల గడువులలోనే
యేలోపమేనిలేకను
చేలోకువఁ జేయఁగలను చెప్పుము తరుణీ॥ ౧౮

సీ. సకలావనీ పాల సత్సామ్రాజ్య పాదుండ, నీదుకోర్కెలదీర్ప నేరనటవె
శంబరాదులగెల్చి శక్రుపూజలగంటి, నీదుకోర్కెల దీర్ప నేరనటవె
దశరథనామంబు దగుకీర్తిదాల్చితి, నీదుకోర్కెలదీర్ప నేరనటవె
విశ్వవిజయులైన విమలతేజులగంటి, నీదుకోర్కెలదీర్ప నేరనటవె

గీ. కమలమిత్రుని కులమున గలిగినాడ
క్రతు శతంబుల జేయంగ గలిగినాడ
నిఖిలజగముల సత్కీర్తి నిల్పినాడ
వర మునీంద్రుల కరుణను వరలినాడ॥ ౧౬

క. హితమాచరించ గడగితి
నతి కుతుకముతోడ నిపుడె యతివేగముగా
పతిమాట మీరకుండుము
మతిగలిగిన కోర్కె దెలుపు మహితగుణాఢ్యా॥ ౨౦

గీ. అనుచు మోహాంపు టురిమెడ యందు దగిలి
బలుకు దశరథు వాక్యాళి పడతి వినుచు
శపథ మొనరించినాడవు శమద మాఢ్య
గనుక జెప్పెద వినుమయ్య కమలనయన॥ ౨౧

వ. అని బలికి మూసిన కనులఁ దెరచి రాని నవ్వు నవ్వుచు ప్రాణనాథా! నాయనుభవమును బట్టియు లోకవాదుకను బట్టియు నీవాడినమాట దప్పినవాడ వెన్నడును గావనియు, సత్య వ్రతనిష్ఠుడ వనియు, నేనెరుగుదు నదియునుగాక క్రొత్తగ కోరుననియుఁ గాదు.

గీ. శంబ రాసుర సంగర సమయమందు
గరుణ నిడినట్టి వరముల గాంక్షతోడ
నడుగ దలచితి నవియిప్పు డధిప యిమ్ము
దాచుకొంటిని నీచెంత ధరణినాథ॥ ౨౨

క. నాకవసరమగునప్పుడు
నాకీవరయుగ్మమిమ్ము నాథుడయనుచున్
నీకపుడె చెప్పియుంటిని
నాకిప్పుడు వానినిమ్ము నయగుణ విభవా॥ ౨౩

వ. అని బలికిన దనప్రియురాలి వాక్యంబులవిని మాయ నెఱుంగని దశరథావనీశుడు కామమోహపరవశుడై రాబోవు కష్టంబుల బరిశీలించనేరక ప్రియురాలి సౌందర్యవారి రాశిమునిగి దరిగానలేక కొంత తడవుండి తెలసి లోకసామాన్యములగు ధనాదులగోరుఁనని తన మదిఁ నూహించి

క. శంబర సంగరమందున
సంబళ మేమడగకుండ సాకిన కతనన్
డంభము లేక నె వరయుగ
మంబుజదళనేత్ర యిడితి సరమరలేకన్॥ ౨౪

వ. నీవాయుద్ధంబున నాకొనర్చిన యుపకృతి మఱువదగినది కాదు. నీ నేర్పునకును, నీకృతజ్ఞతకును నేను మిగుల మెచ్చితిని గావున,

క. దాచిన సొమ్మును బడయగ
దాచిన వారర్హులగుట దడయకఁనిపుడే
దాచిన వరయుగ మడుగుము
దాచినసొమ్మిచ్చినటుల దడయకనిత్తున్॥ ౨౫

—♦ కైక దన కోరిక నెఱింగించుట ♦—

వ. అనిబలుకు రాజేంద్రుని మాటలవిని యితండిపుడు మోహాంపుటుచిందగులువడియె. నాతలంపు విసపింప నిదియె తరి యనిదలచి దన చేతితోడ నాతని శరీరంబు స్పృశించుచు రాజరాజనీవు సత్యసంధుడవు. నీవంశంబున బుట్టిన హరిశ్చంద్రాదుల జగంబు బాగుగ నెఱుంగును.

నీవును జగద్విదితుండవు. నేటివరకును నీవాడిన మాటల దప్పినవాడవు గావు. నీకతిప్రేమాస్పదుడగు పుత్రునిపై శపథంబు జేసితివి. గాన, నాకోర్కెల వినిపించెద. నాకోర్కెలదీర్చి తీర్ణప్రతిజ్ఞుడవుగమ్ము. రాజేంద్రా! శరీరంబులును, రాజ్యంబులును శాశ్వతంబులుగావు. చంచలంబులు, కీర్తియొకటియె నిలిచియుండును. నీవెరుగని ధర్మమేమిగలదు. వినుము నాకాంక్షితముల దెలిపెదను.

సీ. మనుపాలితంబైన మహితరాజ్యరమకు భరతుడుభర్తయై బరగ
వలయు
పదునాల్గుసమములుపావన మునివృత్తి వనమున రాముడువరలవలయు
వరములీరెండును వరదకోరితినేను నిజవంశధర్మంబు నిలుపవయ్య
యిచ్చినవరముల నిపుడు కోరితిగాని క్రొత్తగనేమియు గోరలేదు

గీ॥ రామపట్టాభిషేకార్థ రమ్యలగ్న
మందు భరతునకభిషేక మధికవిభవ
మలరఁజేయుము బిలిపింపు మతనినిపుడె
శపథమును దాటకుండుము శస్త్రముగను॥ ౨౬

క. శంబర సంగర మందున
సంభవమైనట్టిబాధ సరభసమొప్పన్
దంభంబున దోలగించిన
సంబరపడి వరయుగంబు సరసతనిడవే॥ ౨౭

గీ. కష్టపడువారి కష్టముల్గనుచు తగిన
ఫలముఁగూర్చినవాడెపో బాహుజుండు
కష్టపడితిని ఫలమునుఁ గలుగజేతు
వనుచుబలికితి వడుగంగ నర్హగానె॥ ౨౮

క. ఇటుజేయవైతి వేనియు
దటుకున నేనిపుడె విసము దడబడకుండన్
పటుమతి దిని యసువిసరము
చటులార్భటి విడుచుదాన జగతీనాథా॥ ౨౯

చ. అరమరలేక, నీవరము, లార్యులుమెచ్చఁ నొసంగి సత్యసు
స్థిరతను వంశజన్మముల శీలయశంబులఁ గాచి కొమ్ము భూ
వరులకు సత్య మొక్కటియె వైభవ మెల్లనుఁ గూర్చుగావె నీ
వెరుగవె సూర్యవంశజులఁ నెవ్వరుకల్గి రసత్య భాషణుల్॥ ౩౦

వ. అంత.

క. అతిదారుణ వాక్ఛరముల
నతులిత నృపహృదయ దృషద మాదటబగిలెన్
అతిశోక రసము వెడలెను
మతిఁగలిగిన కోర్కెలన్ని మలినము లయ్యెన్॥ ౩౧

## — దశరథుని మూర్ఛ —

సీ. ధరమీద బడియెను దశరథు డప్పుడు మూర్ఛను మునిగెను మూఢుడయ్యె
కొంతదడవురాజు కొరతలేమెరుగక తెలివిగలుగగానె తెరపి లేని
చింతాని మగ్నుడై చేతులుజోడించి చెప్పుటకేమియు చేతఁగాక
కనులుదెఱచిమూసి కాంతనుగనుగొని కనులబాష్పముగార్చి కరుణ బుట్ట

గీ. నేల గూర్చుండి నేర్పున నెలతఁగాంచి
వినయ భయమోహ విస్మృతు ల్వొలయుచుండ
వెలది యిదియేమి నీవిట్టి వెడగుమాట
లాడ జొచ్చితి వాశ్చర్య మయ్యెమిగుల॥ ౩౨

వ. నీకేమైన చిత్తచాంచల్యము గలిగినదా? కైకవుగావా? శత్రు డెవఁడైనాఁ దనమణిమంత్రౌషధ బలంబున నీకిట్టి మార్పును కలిగించి నాఁడా? యిదియేమి చిత్రము నీవెన్నఁడైనా యిట్టి దారుణవేషమును వేసి యిట్టికఠినంపు బలుకులు బలికితివా యని యేమేమియొ బలుక బోయి వివశుండై

క. అహితుండి యంత్రమండల
మహిమాతిశయావబద్ధ మహితాహివలెన్
మిహిరోత్తమకులజనితుఁడు
మహిఁగూలెను రోషశోక మథితేంద్రియుఁడై॥ ౩౩

గీ. మూర్ఛదెలసిన వెనుకను ముదితఁజూచి
వ్యాఘ్రిఁ గనుగొను పెన్నిఱ్ఱి వలెను రాజు
గుండెదడదడనతివేగ గొట్టుగొనఁగ
కనులతోడుతమాట్లాడ గడఁగెనపుడు॥ ౩౪

క. కోపముమాట్లాడించెను
తాపముచేనతఁడు వేగ తహతహపడియెన్
ఛీ పలుగాకీ యనియెను
పాపముసూ పట్టువిడువు పాపీయనియెన్॥ ౩౫

ఉ. ఓసికృపావిహీన యయయో యిదియెంత విచిత్రచర్యయే
మోసముజేసినావుగద మూర్ఖవు పుట్టినచోటు దల్చవే
యీసున కేమికారణమొ యెంతటి కొంటివె రాతి గుండవే
వీసముదోసమైన రఘువీరుని పట్లనుజూపశక్తవే॥ ౩౬

ఉ. తల్లికి నీకు భేదమును దల్చునె రాముఁడు దుష్టబుద్ధుఁడే
యుల్లమునందు నీవిటుల నుద్యమమిట్టిది దల్చినావుహా
యిల్లుకు హానిఁగూర్చితివి యిట్టిదెరుంగను మోసమయ్యెపో
కల్లరి దానవాంగనవె కాలభుజంగమ నన్ను జంపెదే॥ ౩౭

గీ. చంద్రునందున మారామచంద్రు నందు
గనులు గలవారి కెల్లర గన్నులకును
సమ రసంబైన ప్రీతియె సంభవింప
నీకు విపరీత మతియేల నెలత బోడమె॥ ౫౮

క. విడిచెద బో కౌసల్యను
విడిచెదను సుమిత్ర నిపుడె విడిచెద నసువుల్
విడువగ నోపను రాముని
పడతీ! నాయందుభక్తి ప్రబలిన వానిన్॥ ౩౯

దశరథుడు కైకను బ్రతిమాలుట

ఉ. శౌర్యధనుండు రాఘవుడు సత్త్వనిధానము కాంతి భూమిగా
ధీర్యపుటెంకి సత్కళల పెన్నిధి రూపముదాల్చినట్టియౌ
దార్యము ధైర్యరాశి సముదాత్తయశోదయ మా యనింద్యసౌం
దర్యరసాబ్ధిధర్మగుణ తర్పితలోకుడు రాముడీధరన్॥ ౪౦

సీ. సూర్యుడులేకున్న సోలును లోకంబు జలములు లేనట్టి పైరుబోలి
రాముని విడనాడ రమ్యదేహమునుండి జీవంబుబోవును శీఘ్రగతిను
నింత కఠినమైన యీకోర్కె గోరుట తగదు వీడుము దీని తరుణి
యిపుడె
నీకాళ్లపైనైన నిర్నిద్ర వృత్తిని బడివేడు వాడను పడతి వినుము

గీ. కరుణ యుంచుము నాయందు కమలనేత్ర
జగము నేలినవాడను జడుని పగిది
దాస భూతుడ ననునీవు దగినరీతి
గావ జూచెదో గడతేర్చ గలవో చెప్పుమా॥ ౪౧

గీ. భరతు మించును రాముడు భక్తిపట్ల
సకల కళ్యాణ గుణరాశి సత్యరతుడు
ప్రేమ యతనియందుననె పెద్దయంటి
వది యిటుల మారనేలనే యబల బలుకు॥ ౪౨

క. పరిచర్య సేయుపట్లను
భరతుని మనరామచంద్రు బహు విధములుగా
బరికించి చూచినాడను
భరతుని యందధికమున్న బలుకుము తరుణీ॥ ౪౩

చ. భరతుని యందు నెయ్యమును బాగుగగల్గునో లేదో యంచునీ
వరయగ గోరి నన్నిటుల యల్జడి బెట్టుచు నుంటి వంతెగా
క రఘుకులంబు జొచ్చిన కాంతకు పాపపు బుద్ధి పుట్టునే
భరతుడు మాత్ర మొప్పునటె భవ్యునిరాముని వేరు సేయుదే॥ ౪౪

క. గురుజనముల శుశ్రూషను
పరులను దనవింటనీవి పరిచారకులన్
వరసత్యంబున లోకము
పర వనితల భక్తి రామభద్రుడు గెలిచెన్॥ ౪౫

క. ఆర్జవము గలుగువాడును
నిర్జరవరుబోలువాడు నిరుపమయశుడై
యూర్జితగుణుడగు రాముడు
వర్జింపగ దగినవాడె వనితా చెప్పుమా॥ ౪౬

గీ. దయయు దానంబు సత్యంబు ధర్మనిరతి
భూతరక్షణ శుభకీర్తి భూరిశక్తి
గలిగి వర్తించురాముని కానకనిపి
యెటుల జీవించువాడనో యింతి చెప్పుమా॥ ౪౭

గీ. సాగరావృతమైనట్టి సర్వధరణి
వలన సంప్రాప్తమయ్యెడి వసువితతిని
గవ్వయైనను గోరక కాంతనీదు
కరమునందున నిడువాడ గరుణజూడు॥ ౪౮

గీ. సాగరావృతమైనట్టి సర్వధరణి
శైలకానన యుతముగ సత్వరముగ
నీవెగ్గెకొని సుతునకు నీవెయిడుము
రాముబంపకు నడవికి రాజవదన॥ ౪౯

ఉ. నెంజలి మాన్పుమీయబల నేర నధర్మపదంబు ద్రొక్కఁగా
నంజలిజేతునీకిపుడె యంఘ్రులనైనను చేతముట్టెదన్
కంజదళాక్షి రామునిట గన్నులజూడగనుండ నిమ్మురా
ముజ్జలపెట్టనేమియగు మూర్ఖవె గావగదే తలోదరీ॥ ౫౦

వ. అనిపలుకు దశరథభూమీశునిగాంచి కైక కటకటబడుచు కోపావేశంబున నిట్లు బలుకదొడగె.

—♦ కైక కరినోక్తులు ♦—

క. ఒకచోట రాజులందరు
వికసితముఖులౌచు గూడి వికవికనగ గా
నకలంక కైకవరముల
సుకరంబుగ దోసిరాజు జేసెదెజెపుమా॥ ౫౧

క. గురుడు వశిష్టుడునినోన్న
ధరణీశ్వర సత్యమెపుడు తప్పకుమనగా
వరములు కైకకునివ్వక
నిరసించితి సత్యపదవి నిజముగ ననుదే॥ ౫౨

సీ. యిప్పుడె నీవిటనిచ్చెదనన్నట్టి వరములులేవని వసుమతీశ
యనృతంబులాడిన నార్యులు మెత్తురే శిబిపేరుజెప్పగ జెవులవినవే
వీరు నలరుకఁని పవిత్ర చరితంబు వీనులవినలేదె విశ్వనాధ
చెలియబికట్టను చెరుపదు కడలియు సమయంబు దాటుట
సాధువగునె

గీ. జాలయోచించి నీవాక్కు సత్యసరణి
దాటకుండగ గాపాడు ధరణినాథ
దాటదలచిన విభువను ధర్మవిదులు
గొడ్డుబోయిరె పెద్దల గోరుకొనవే॥ ౫౩

గీ. ఆశ్రితంబీక తప్పిన యాతుణంబె
విసము దినినైన ప్రాణంబు విడచుదాన
కోశ లేశుని పట్టికి కొదవులేని
ముదము గలుగును నీకును ముదము గలుగు॥ ౫౪

క. కౌసల్యను గనియందరు
భాసురముగ సతులు నుతులు భక్తిసజేయన్
మోసము జెందిన కైకకు
వాసిగ నిముసంబునైన వశమే బ్రతుకన్॥ ౫౫

ఉ. ధర్మమువీడి సత్యమును దల్చక నీవిక రామచంద్రుని
గ్గూర్మిని రాజుచేసినను కుత్సితబుద్ధిని కైక గూల్చెనన్
నిర్మలమైన నీకులము నీతికి బాహిరమయ్యె నంచుని
న్నర్మతులెల్ల దిట్టుదురు కాలుని గొల్తురు నీదు వంశ్యులున్॥ ౫౬

చ. అనవిని దుఃఖ వార్ధిబడి యావలియొడ్డు గసంగలేక యో
చనఁ గనలేక యగ్గిబడు చాడ్పున మండుని భంగి భీతిచే
గనుగొనలేక నెవ్వరిని కాంతకు బొంగితిసంచు సిగ్గునన్
మనసు వశంబుజేయగల మార్గ మెఱుంగక నావులించుచున్॥ ౫౭

చ. వరములఁగోరె భామయును వాసిగ నిచ్చెద నంటి మోహినై
కర మరుదైన కోర్కెలను కాముని గోరెను రామచంద్రునిం
సిరి విడిపించి కానకును జెచ్చగ జాలును వోచ చేవియు
న్బరువడి దేహము న్విడుతు భార్యయె మృత్యువు గాగ నయ్యెడిన్
౫౮

చ. పిడుగులో కైకవాక్యములో భేదము నెంచఁగఁ జాల నాయెడన్
దోడిబడి స్రుక్కఁజేసె గద దుర్వ్యవసాయముఁ బూని యెంతయుం
దోడరెనో కాంతయంచు మది దోడ్డగ నమ్మితి నంచు నెంచుచుం
మిడుకును బాసదల్చుకొను మీదను జూచును నుస్సురంచనుం॥ ౫౯

క. రామ రామ రామయనుచును
భూమీధవుడు నేలబడె పొలుపరి యపుడే
యామూల నాసితంబై
భూమిని పడిపోవునట్టి భూజముబోలెన్॥ ౬౦

గీ. మత్తు నున్మత్తు మతిలేక మసలువాని
భూరితరరోగపీడను బొందువాని
భోగిమంత్రాళి తేజంబు బోయినట్టి
పామువిధమున దీనుడై బలికెరాజు॥ ౬౧

ఉ. నొవ్వగజేసి నామనసు నోటికివచ్చినరీతి బల్కఁగా
నెవ్వతెబోధచేసెనొకొ యేటికి లేశము భీతిలేక నీ
వెవ్విధి వక్రవర్తనము నేటికి నేర్చితివే తలోదరీ
క్రొవ్విదమేల జెప్పుమిక కోమలి నీ తెఱగంతమారెబో॥ ౬౨

ఉ. ఏటికి భీతినొందితివొ యేటికి రామునియందు కోపమో
పాటిగజూడు బాలునకు పట్టముగట్టుట రాముకానకున్
నూటిగఁదోసి పుచ్చుటయు సొంపటె నీమదియెట్లుదోచెనే
వీటనెరుంగరే జనులు వింతలు కొత్తగ నేర్చినావటే॥ ౬౩

ఉ. కోపము నీకుగల్గుటకు కోమలి కారణమేమొ చెల్పవే
పాపపు బుద్ధి యేలనొకొ బల్కుము రాముని యందు నాయెడన్
జూపుము దోషమించుకయు పోకెనె దయ్యము నీతిఁ దప్పితే
బాపురె తేట తేటకిటుబల్కుట ధర్మమె సాధ్వి రీతియె॥ ౬౪

—♦ దశరథుడు భరతునకు రాజ్యమివ్వననుట ♦—

క. రాముడు పోవకానలకు
పామరుడై భరతుడేల పాల్పడ గలడే
రాముడెరుంగును ధర్మము
భామరో నీపుత్రుడెరుగు భవ్యుండగుటన్॥ ౬౫

సీ. పట్టాభిషేకంబు బరపెదనీకని బలికిన నోటనె బరుషముగను
అడవికి బోవోయి యవనిని భరతుడు పాలించు నని నేను బలుకు
టెట్లు
సకల దిక్కులనుండి జనుదెంచి యున్నట్టి వసుమతీశులు నన్ను
వరసదిట్ట
గురుడు వశిష్టుండు కులగౌరవంబెల్ల బోకార్చి తేయున్న బాదు
నెటకు

గీ. జనుడు ముమ్మేల బాలించు జాలుజాలు
దెలివి లేనట్టి వాడని దెలియ చెపుడు
కైకమాటల బుత్రుని కాన కనిపె
ననుచు బ్రజలన్న నేనేమి యనగగలను॥ ౬౬

సీ. యుపకారమును జేసి యున్నత వరములు బడసినదానవు పడతి నీవు
యుపచారములు జేసి యున్నతరాజ్యంబు బడసెను మా రామ
భద్రుడిప్పుడు
సత్యంబు గాపాడ జాలుదు నేనని యిద్దర సంతోషి మెట్లు గూర్తు
బహుమంది వినుచుండ బలికితి రాముడు రాజగు మీకని రాజవదన

గీ. ఎన్ని విధముల బలికింప నిహము బరము
నున్నయని దోచె నీమాట నుంత విన్న
రాము నడవికి బంపగా రాదు నాకు
భరతునికి రాజ్యమిచ్చుట బరువు గాదు॥ ౬౭

సీ. సమయానుసారంబు సఖియును దాసియు సాధ్వియు మంత్రియు సహజతల్లి
ప్రియవాక్య ప్రియకామ ప్రియపుత్రి ప్రియకార్య ప్రేమకు నర్హయు పెద్దభార్య
యైనట్టి కౌసల్య కవమానముల జేసి నిన్నాశ్రయించితి నియతిలేక
నీదయ నార్జింప నేజేయునది యెల్ల పొల్లయ్యె నేటికి పొసగియుండె

గీ. ఆమ యగ్రస్తు డిసుమంత యరయలేక
దిను సపత్న్యన్న మొనరించు తీరుగలిగె
కప్ప కూతల గూసిన కార్ద్రి వేయ
సర్పమట్టుల సమయింప జాలినావు॥ ౬౮

క. రాముని యడవికి బంపగ
భామామణి సుమిత్రగని భావము నందున్
యేమాడ్కినన్ను నమ్మును
నామాటలు విశ్వసించు నరులుందురటే॥ ౬౯

క. సీతేశు డడవికేగిన
నాతరమా బ్రతుకగాను నాతిరో వినవే
సుతుడును నీవును భూమిని
మీతలలనె గట్టుకొనుచు మిడుకుడు ఖలులై॥ ౭౦

గీ. కల్లకపటంబులెరుగని కాంతుజంప
నిచ్చకాలాడ నేర్చితి వెట్లుతరుణి
క్రూరమృగయుడు శ్రవ్యమౌ కూతగూసి
నెమ్మిజీకను జంపగ నేర్చినట్లు॥ ౭౧

గీ. పడతితోడుత సంతోషపడగ దలచి
కన్నకొడుకును బంపెను కానకితడు
కల్లుద్రావుచు వీధుల గంతులిడెడి
విప్రుపగిదిని యనబోరె వివిధజనులు॥ ౭౨

గీ. ప్రజలుగోరిన యాతడె ప్రభువు సుమ్ము
ప్రజలకిష్టుడుగాకున్న ప్రభుడుగాడు
ప్రజలుగోరుట రాముడే ప్రజల ప్రభువు
బ్రజలుగోరని భరతుడు ప్రభుడుగాడు॥ ౨౩

క. ఆమతిమంతుడు దోసపు
భూమిని యగునాకు నేల పుత్రుండయ్యెన్
రాముడ యోనావలనను
వామాక్షీ వనముకేగు వాడయ్యెగదా॥ ౨౪

క. భానుడు లేనివర్షమును
వానలు లేనట్టిపంట వసుమతిలోనన్
కానని యట్లేరాముడు
కానకు దాబోయెనేని కానవు నన్నున్॥ ౨౫

క. బొంతల నార గుడ్డలను
స్వాంతము దుఃఖింపగట్టి చానరో యడవిన్
వింతగతిరుగగ సీతా
కాంతుని గనిదట్టినన్ను గర్హించరటే॥ ౨౬

క. అంతల పొంతల వారల
చింతల సైరింపలేని సీతావిభునిం
సంతత దుఃఖములందగ
బంతము వనికంప నీకు పద్మదళాక్షీ! ౨౭

క. ఇంతిరో బతిమాలెదమది
పంతంబిక విడిచిరాము బంపకుమెటకుం
వింతల కాంతులగనియగు
కాంతము మారాము ముఖము కాంతముగనులన్॥ ౨౮

క. వనమున కరుగుము రామా
యనఁ జేరును రాముఁ డపుడె యటవీస్థలికిం
వనితా యతి డెనరాజిన
మన మానందంబు నొందు మారాడకుగా॥ ౭౯

సీ. వనికి రాముఁడు జేర నరగుణకౌసల్య నాశోడ జనుదెంచు నరకమునకు
ఛాయనుబోలుచు జనియించు సౌమిత్రి యన్నజనినదారి యనుసరించు
శత్రుఘ్నుఁ డప్పుడె జనెభరతునితోడ సాధ్విసుమిత్రయు జనునుడివి
యదిజూచి జనులెల్ల ననుసరింతురునన్ను విపినమై వెలయును
విపులయంత

గీ. పట్టిబయలుగ నున్నట్టి వసుధనెల్ల
తలమగట్టుకు మోయుము తరుణిసవు
భరతుఁడెప్పుడు నీమాట బట్టబోఁడు
పాపివని నిన్నువిడుచును భవ్యుఁడగుట॥ ౮౦

గీ. అనుచు నీరీతి విలపించె యవసివిభుఁడు
నీరజాప్తుఁడు బోయెను నింగివిడచి
చుక్కలును చంద్రుఁడంబర చుంబులైరి
గగన తలమును విభుఁడప్డు గనుచుబలికె॥ ౮౧

ఉ. వోసిలిబట్టి మ్రొక్కెదను దొడ్డగసిట్టుల నుండు రాతిరీ
కోసలరాజపుత్రికను కోమలగాత్రిని చూడలేను ఛీ
దోసపుకైక మోముగన దుఃఖము మిక్కిలిగల్గె గావునన్
మీసము జాగుజేయక నె వే తెలవారుము లేచిపోమెదన్॥ ౮౨

క. అనిపలికి కైకమోమును
గనుగొని కరయుగము మోడ్చి కార్యవశమునన్
గనికరము గల్గునట్టుల
వినసొంపగు వాక్యజాల విసరము నెఱపెన్॥ ౮౩

ఉ. దీనుని నీకధీశ్వరుని ధీబలమేమియు లేనివానినో
మానిని నన్ను వేగముగ మన్ననతోఁ గరుణించి గావుమీ
మానముఁ బీడి నిన్నిప్పుడె మాటికి మాటికి వేఁడువాఁడ నే
డీనిఖిలోర్వి రామునికి నిచ్చితి నంచని బాసజేసితిన్॥ ౧౪

క. ఖేలీల మాటదప్పుదు
బాలా నేనెపుడు మాట బాయగలేనే
పాలింపుము నావాక్యము
జాలింబడకుండ గావు చవితుని నన్నున్॥ ౧౫

సీ. సీదయ రాజ్యంబు నిత్యమై గలుగుట సంతోషమును రాముసమియు బొందు
శాశ్వతసత్కీర్తి సంభవించును నీకు నివివాకు రాముని కెల్లవారి
కిని భరతునికిని గురులకు ప్రజలకు సమ్మతమగునని జాలిగాను
బలికిన బతికిని బ్రతిమాలువానికి కనుల నశ్రులవేగ గార్చువాని

గీ. గనికరింపక మూర్ఖయై కసరుదాని
బెంకెమాటల దుఃఖంబు బెంచుదాని
కైకగనుగొని రాముడు కానకరుగ
వలె నటంచును భూపుడు వనటజెందె॥ ౧౬

సీ. సుతుని నడవికి బంప సూనృతము నుపిడ జాలక జింతను చాలగుంది
యాకెంటి లోపల నాత్మజు విడుచుట తప్పనను మదిదలచి దలచి
యనృతమాడగ లేక నతిదుఃఖమున భూమి బడిపొర్లు వానిని బాపి కైక
గని బాస తప్పిన కలుషమంటుచు నిన్ను నసువుల విడిచెదయనిప నేను

గీ. శంబ రాసుర సంగర సమయమందు
వరము లివ్వగ లేదని పలుక గలవె
వరము లిడువాడ నడుగుము వనిత యనుచు
బాస జేయగలేదని బలుక గలవే॥ ౧౭

గీ. సుతునిపై గల దయచేత సూనృతంబు
విడువ గలవని దోచెను విబుధ వినుత
పెద్దలను జేర్చి పెట్టిన పెద్ద తగవు
చాలమన ధర్మవేత్తలు చచ్చుదాన॥ ౮౮

ఉ. సత్యము బ్రహ్మనా పరగు సత్యమె ధర్మనివాస భూమియౌ
సత్యమ యక్షయంబనుచు చాటును వేదము శాస్త్రసంఘముల్
సత్యము వీడకుండిననె శాశ్వతమైన పదంబు గల్గెడిన్
సత్యము బూనుమీ మదిని శాశ్వతకీర్తికి గోర్కె యుండినన్॥ ౮౯

ఉ. చచ్చిన జచ్చుగాక యని సత్యము దల్చక సాహసంబునన్
మచ్చికలాడి మంత్రులను మాన్యవశిష్ఠముఖ ద్విజాతులన్
హెచ్చుగ మోసపుచ్చినను హేతువు లెన్నియొ జెప్ప జాలినన్
మెచ్చునె లోకమంతయును మేలును కీడును దల్చుచుండునే॥ ౯౦

ఉ. వచ్చినవాడు చచ్చినను వాస్తవమెప్పుడు పోదు గావునన్
సచ్చరితంబు వీడకుము సత్యవచస్కుడ వౌచు గ్రాలుమీ
మెచ్చును లోకమంతయును మేలగు కీర్తియు నీకు గల్గు నా
కిచ్చిన బాస దోయవల దిప్పుడె రాముని కాన కంపుమీ॥ ౯౧

క. నాతోడ బాసజేసియు
నీతిమిన బల్కనేర్చి తేలా చెప్పుమా
నీతోడు నేను యిప్పుడె
బాతును ప్రాణంబు లిచట బరికింపుమికన్॥ ౯౨

ఉ. జంకును గొంకువీడి యిటు జంకెనలాడెడి కాంతకై స్వనా
శంకర దానమిచ్చు బలి ఛాయను సూనృతదామ బద్ధుడై
బింకము లేక లేశమును పెచ్చుపె పేయుని నెత్తి మోముతో
పంక మిదేలనే యనుచు పట్టిన పట్టును వీడవే యనున్॥ ౯౩

క. రాయివలెను మనసు కరుగక
పాయని మూర్ఖంపు పట్టు పట్టినవనితన్
ఛీయని మోము నావలికి
చయ్యన ద్రిప్పెను గాంచ జాలకన్॥ ౯౪

—♦ దశరథుడు కైకను శపించుట ♦—

ఉ. పావకు చెంత మంత్రవిధి పట్టిన పాణిని నిన్ను నీసుతుం
తాపక బంధువర్గమును దల్చిన దోసము గల్గు గావునన్
భావము నందు వీడితిని భామరో నీవిక సౌఖ్య మందుమీ
చావగ నున్న నాకికను సర్వము రాముడె సల్ప గావలెన్॥ ౯౫

గీ. ఔర్ధ్వ దైహిక విధులన్ని యోగ్యముగ
రాము డొనరించ మునులును రాజవరులు
గాంచ నీవును సుతుడును గడకుబోయి
చూచు చుండుడు చక్కికి చేరగ వలదు॥ ౯౬

క. ఈవిధి విఘ్న మొనర్చితి
వోవనితా నీవుసుతుడు యోహోయనుచున్
చావని వారలు దిట్టగ
భావాతిగ మైన కష్ట పాటుల బడుడీ॥ ౯౭

గీ. నీళ్ళ వదలగ వలువదు నీవు సుతుడు
కళ్ళ తడిపెట్ట వలవదు కఠిన చిత్త
తృళ్ళిపడియుట్లు జేసిన తుచ్ఛ వగుట
సర్వ విధముల విడిచితి చానసిన్ను॥ ౯౮

క. నీసుతుడు యోగ్యు డైనను
దోషుడె నీవలన బుట్టు దోసము చేలిన్
మోసము జేసిన దానవు
నీసరి వారెల్ల నిన్ను నిందిత పనగన్॥ ౯౯

వ. యిట్లు పరిపరి విధంబుల దశరథ మేదినీకాంతుఁడు బలుకు చుండ నపుడు.

క. రిక్కలు మాసెను వనధికి
జక్కల శాజరిగె తూర్పు సొంపును గాంచెన్
గ్రక్కున రాతిరి బోయెను
మిక్కిలి రోసంబు కైక మెక్కుచుబలికెన్॥ ౧౧౦

ఉ. ఏమిటు మాటలాడెద వికేలను జాగొనరింప దల్చెదో
కామిత మిచ్చి తీరవలె కానకు బంపగ రాము బిల్వుమీ
భూమి సమస్త మేలుటకు బుచ్చుచు నాసుతు రాజు చేయుమీ
పామిక నిస్సపత్నముగ హాయిగ జేయుము నన్నుధన్యగాన్॥ ౧౧౧

క. సతిపల్కులువినియప్పుడె
యతి తీవ్ర కశాభిఘాత హయమును బోలెన్
స్మృతిచెడి ధర్మ బద్ధతను
మతిదలచెను రామచంద్రు మతిమంతు గనన్॥ ౧౧౨

ఉ. రవియుదయించె తూర్పునను రాతిరి చీకటి గొంచు బోయెగా
రవమున తీర్థ మాడి తగు రమ్యపదార్థము లెల్లగొంచు మా
నివరులు శిష్య సంఘములు నిర్మల వృత్తి నరుంధతీశుడున్
పరమ పవిత్ర మంత్రముల బల్కుచు చేరె రయోధ్య చెచ్చెరన్॥
౧౧౩

సీ. సమ్మార్జితంబులు చారువిశాలము ల్కస్తూరిజలసిక్త క్రమవీధు
లాభూషితంబులై యలరు సద్గృహములు చిత్రధ్వజంబులు
చిత్రితములు
విస్తృతబహురత్న విపణివర్గంబులు మాల్యసుమాకీర్ణ మానితములు
చందనాగురుమిశ్ర చారుధూపంబులు సంహృష్టమానవ
సంకులములు

గీ. గలిగెశోభిల్లు పురమును గాంచియలరి
యింద్రుమందిర సౌందర్య మిందుగలిగె
ననుచుబలుకుచు దశరథు నంతిపురిని
చెంతనిలచె వశిష్టుండు శిష్యతతియు॥ ౧౦౪

క. కలకలమను పక్షులతో
బిలబిలజనుదెంచు విప్రపుంగవ గమితో
చెలువొందెడి పురజనముల
నలరిన యంతఃపురంబు హాయిగజూచెన్॥ ౧౦౫

చ. అటగని ధీరుమంత్రివరు నద్భుతశక్తియుతు న్సుమంతునిం
పటుమతి మంత్రకోవిదుని పాటితశత్రుని వేగపార్థివుం
దిటముగ గాంచిత్వద్గురుడు తీరుగ దర్శనకాంక్షిగావునన్
పటుగతివేచి రావలయు పార్థివపుంగవ యంచుబల్కుమీ॥ ౧౦౬

వ. పట్టాభిషేక వస్తుసంభారము లన్నియు సిద్ధపరుపబడినవి. గనుగొనుము.

—♦ వశిష్టుడు పట్టాభిషేక వస్తువుల దెచ్చి చూపుట ♦—

సీ. గంగాదిజలపూర్ణ ఘటములియ్యవిజూడు సాగరజలఘటీ సంఘముదుగో
యభిషేకమునకుగా నౌదుంబరోద్భూత దివ్యపీఠంబది తేరిచూడు
తేనెయు ఘృతమును తియ్యని దధియును మణిగంధలాజలు మహిత దర్భ
లవెవారెకన్యక లదెజూడు ఖడ్గంబు గజముపాలును పూలుగనుము నవిగో

గీ. హయములును నాల్గుజేరును హర్ష మొదవ
గనుము ధనువు చామరములు గాంచుమవియె
యందలము తెల్లగొడుగది యరయుమిదిగొ
గనక కలశమయ్యదిగాంచ గడగవయ్య॥ ౧౦౭

సీ. కనకాంచితంబులై గననొప్పకొమ్మలు పటుమయూరంబున భవ్యతనువు
గలిగిన తెల్లని కమనీయవృషభంబు గనుమ వెసింహంబు గజము నదియె
హయమునుగనుగొను హర్షంబుగలుగునుసింహాసనంబదె సిద్ధమయ్యె
పులితోలుగనవయ్య పూజ్యాంగనలువారె వేశ్యలగనుగొను విప్రులరుగొ

గీ. అదియె మండెడియగ్నియు నదుగొ నృపులు
వారె యాచార్యవర్యులు వరగుణాఢ్యు
లదియె తౌర్యత్రిక మవియె యర్హమైన
పక్షిగములును మృగములు భవ్యతనులు॥ ౧౦౮

గీ. జానపదులును వైశ్యులు చతురమతులు
దూరదేశస్థు లెందరో తూర్ణముగను
వచ్చి యున్నారు గనుగొను వైభవమును
వేగ బిలువుము రాజును విశ్వవిదుడ॥ ౧౦౯

గీ. రామచంద్రుడు లగ్నంబు రాకమునుపె
సిద్ధమైయుండ వలయును శీఘ్రముగను
రాజు దోతెమ్ము పొమ్మిక రవియువచ్చె
ననిన నతడేగె గనుగొన నవని విభుని॥ ౧౧౦

వ. ఇట్లు సుమంతుఁడు త్వరితగతి జని యంతఃపుర వర్తుల వలన దశరథుండుండు తావు తెలసి వినయంబున కైకమందిరమున నున్న రాజవరు నవలోకించి.

—♦ సుమంతుఁడు దశరథుని సమీపించుట ♦—

క. దురవస్థను పడియుండెడి
నరపాలుఁ జేరి యతఁడు నయ హిత సూక్తిన్
పరిపరి విధముల బలికెను
కరములు జోడించి మ్రొక్కి గౌరవ ఫణితిన్॥ ౧౧౧

చ. భగవతి బోయె రాత్రియు నె భానుఁడు దోచెను భవ్య సత్క్రియల్
దగుగతిచేయఁగా వలయు తత్త్వమెఱుంగుదు లేచి రాగదే
నిగమ విధిజ్ఞుఁడౌ గురుడు నిన్గన గోరెను రాము పట్టమున్
దగువిధిగట్ట నాజ్ఞయిడు తద్దయు భక్తిని మ్రొక్కి వేడెదన్॥ ౧౧౨

సీ. కాపరిలేకున్న కాలికి తగురీతి పశువులు బారును పట్టుబడవు
సేనాపతియుఁ లేని సేనలు చెలరేగి తమ యిచ్ఛఁ బోలదిని తరలిపోవు
నెలలేకయుండిన నెగడదు రాత్రియు భానుఁడు లేనట్టి పగటివలెను
గోపతి లేకున్న గోవులు మెరయవు గృహపతిలేనట్టి గృహము భంగి

గీ. విద్యలేకున్న విప్రుఁడు వెలయబోడు
విభుఁడు లేనట్టి వనితకు వేడ్కలేదు
నీతిలేకున్న సంపద నిలువబోదు
రాజు లేకున్న చెడిపోవు రాజ్యమెల్ల॥ ౧౧౩

క. అన విని రాజశేఖరుడు
ఘనశోకము వన్ను ముంప గానక తుదినిన్
గని శోణపు నయనంబుల
దన విబుగును జూపి గనుల తద్దయు మూసెన్॥ ౧౧౫

క. గని యాతని యాహాపము
మనమున సందేహపడుచు మౌనము తోడన్
జని దూరము కేల్మోడ్చుచు
వినయంబున కొంతతడవు వెరపుననుండెన్॥ ౧౧౬

వ. ఇటుల సుమంతుడు కొంతతడవుండి యెన్నడునులేని యిట్టి దురవస్థకు కారణ మెరుగక తెలివి గలిగియు దనతోడ మాటలాడ కుండుటకు గతంబేమియో నరయుగోరి శయ్యకు సమీపమునసుండు యవనిక కడ నిలచి వినయంబున నిట్లనియె

ఉ. అనితరలభ్యకీర్తియును హాయిగ నిస్తుల సర్వసంపదల్
ధనద ముఖాదు లిచ్చెదరు ధైర్యజయాదులు నీకు సొమ్ములే
చనియెను రాత్రిమేలుకొని సచ్చలితంబుల దీర్చి వేగమే
ఘనసభ కేగుదెమ్ము నృప కాచిరి విప్రముఖాఖిల ప్రజల్॥ ౧౧౭

మ. అనిమాటాడు సుమంతు గొంతికను గోత్రాధీశుడాలించి
యనఘా వేజని రాము దెమ్మిటకు నాకాధీశతుల్యుఘ్ననుం
వినయంబొప్పగ బొమ్మటన్న నపుడే విశ్వేశు జూడన్ జనెన్
తనమార్గంబు మనుష్య సంకులము శుద్ధాంతాంత మొప్పారగాన్॥
౧౧౮

క. ప్రేమను వనితలు పురుషులు
రామ ప్రియ కథలనెల్ల రాగముఁ గొడన్
కోమల గతినుతి సుంపగ
కామిత మిదె యనుచు ముదము గాంచుచు నరిగెన్॥ ౧౧౮

చ. చని రజతాచలంబునకు సాటి పురందరు వీటిపాటి యా
ధనదుని సౌధతుల్యముం బుధప్రకరాలయ మో యనంచు చనన్
ఘనమగు తల్పులు న్ముదము గల్గగ జేయు నరుంగు లొప్పుగా
మణిమయ తోరణంబులతి మాత్ర శరద్ఘన శోభ మానమా॥
౧౧౯

చ. మానుగ రాము మేడగని మానిత తత్ప్రియు లెల్లగన్పడన్
జానుగ లోనికేగి యట సత్వగుణాఢ్యులు రామసత్కథల్
గానము జేయుచుండుటను గన్నుల గాంచి శకుంత రావముల్
వీనుల కింపు గూర్పగను విశ్వవిధిజ్ఞుడు సూతు డచ్చటన్॥ ౧౨౦

క. పూసియు దొడగియు కట్టియు
వాసిగ నెట్లట్లు చుట్టి వరలెడి వారిన్
డాసి సుమంతుడు మిక్కిలి
చేసైగల రాము జెచట చెప్పుడటన్నన్॥ ౧౨౧

—♦ సుమంతుడు రాముని గనుగొనుట ♦—

సీ. పూర్వవృత్తము నెఱిగిన పుణ్యుడగుట
సంభ్రమంబున కుర్చీల జక్కడగిరి
వారి లోపల నొక్కడు వాసి నటిగి
వేడ్క సూతుని రాకను విన్నవించె॥ ౧౨౨

క. విని సూతు రాక రాముఁడు
తన తండ్రికి హితుఁడు గాన తద్దయు బిలువన్
వినయ కినీత వేషమున
జని వందన మాచరించి సన్నిధి నిలిచెన్॥ ౧౨౩

వ అప్పుడు సూతుఁడు భయభక్తివినమ్రుఁడై

సీ మహనీయ కనకంపుమంచంబు నందున సరసంపు ముత్యాల సరుల వాని
ఘుమఘుమ లాడు సూకరరక్త నిభమైన గంధంబు మైపూత గలుగు వాని
మెరుపు తీగనుబోలి మెరయుచు నుండెడి సీతచే గనుల వీక్షించు వాని
ధరణిజాన్వితుఁడౌచు దనరి చిత్రాన్విత గమలవైరినిబోలిగ్రాలువాని

గీ. నైజ తేజః ప్రభా పూర నవ్యగరిమ
బూనుటను సర్వసాక్షిని బోలువాని
భూరి వైభవమున శక్రు బుణుకువాని
నెనరు గలవాని రాముని నియతి గనియె॥ ౧౨౪

గీ. కనుల కగుపించు కమనీయ కాంతి వాఁడె
లోచనంబులు మూసిన లోన దోచె
సర్వ సాక్షియె యితడని సర్వవేది
యలవశిష్టుఁడు బల్కెడే యప్పుడు నాకు॥ ౧౨౫

క. అదిగాక మొదట యుగమున
ముదమున సనకుండు బలికె మురమర్దనుడే
గొదగొని బుట్టు రాముడన
పద గొల్వుము భాను కులుల పరమాత్ముగనన్॥ ౧౨౬

వ. అని యామహర్షి నాతోడ బలికిన నామహాత్మునికి నాయందు గల దయకు సంతసించుచు భానువంశజుల నాశ్రయించి యదిసుత గొలుచుచుంటిని. నాదు భాగ్యవిశేషమున భగవానుడు రామలక్ష్మణ భరత శత్రుఘ్న రూపభేదముల చతుర్వ్యూహముగ నవతరించి మానవ చేష్టల విడబించుచుండె చిరకాంక్షితుండగు నీమహాతేజోరాశిని నాచర్మ చక్షుస్సుల గనుగొన గలిగితి.

ఉ. నీచుడనైననేను గన నేర్చితి పూర్వపు పుణ్యమెట్టిదో
దోచునె సంయమీంద్రులకు ఘోరపు కష్టతపశ్శతంబులన్
యాచతుర్వ్రత మేనృపుల కెచ్చట నైనను గాంచి నాడనే
యాచతురాస్యుడైన గని యద్భుత మందుచు నర్చచేయడే॥ ౧౨౭

క. అనిమనమున తర్కించుచు
ఘనతేజో విజిత సర్వ కరణుండగుచున్
దనపని మఱచి యటుండెను
వినివర్తిత చిత్తవృత్తి విషయుండగుచున్॥ ౧౨౮

గీ. కొంతదడవున కొకకొంత కుదురు పడిన
చిత్తవృత్తిని విషయంపు చేష్టలలర
కరములను జేర్చి మ్రొక్కుచు కరుణబుట్ట
రామచంద్రుని గనుగొని రక్తి బలికె॥ ౧౨౯

క. కౌసల్య గనినబిడ్డడ
వాసవ నిభుడైన విభుడు వాసిగ నిన్నున్
జేసెను గనుగొను వాంఛను
భాసురముగ లేచిరమ్ము పార్థివుగాంచన్॥ ౧౩౦

చ. వరద దయాసముద్రఘనవంశ సముద్భవ సర్వ సద్గుణో
త్కరపురుహూత సన్నిభ జితారి సమూహ నృపాగ్ర గణ్యమీ
కరుసమె సర్వలీలల సుధాంశుని భానన రామచంద్ర యం
చంసి సుఖంబు వేడి వసుధాత్మభవేశుని తోడ నిట్లనుం॥ ౧౩౧

క. కౌసల్యా తనయోత్తమ
వాసవనిభుడైన నృపతి వరసుతునిన్నున్
భాసురముగ గనదలచెను
దాసునితో గూడియిపుడె దయసేయవలెన్॥ ౧౩౨

ఉ. సూతుని పల్కుల న్వినుచు సొంపుగ నాతని సత్కరించి యా
సూతుని తోడనే గదలి సోమని భానన సీత యిప్పుడే
భూతల నాథు నాజ్ఞగొని పూతచరిత్రను నిన్నుగాంచెదన్
చేతుల పువ్వుల న్గొనుచు జేయుము పూజల దేవతాళికిన్॥ ౧౩౩

చ. కైకయు తండ్రియు న్మగుల కార్శ్యసి నాకు నొసంగు వట్లనే
శ్రీకరమైన యోచనను చేయుచు నాకెదొ చెప్ప దల్చుచుం
శ్రీకరు సూతు బంపుటను శీఘ్రమె వారల గాంచ నేగెదన్
చేకురు రాజ్యము న్సిరులు చేకురు కీర్తియు సర్వభోగముల్॥ ౧౩౪

క. కౌసల్య కంటె కైకయె
భాసురసంపదలగూర్చ బలుకును విభుతో
భూసురులను పలుమారులు
నాసుఖమును గూర్చియడుగు నవనవరీతిన్॥ ౧౩౫

గీ. అప్పుడీతడు దూతయై యరుగుదెంచె
సభయు నట్టిది నమకూరె సాధు హృదయు
సకల ధాత్రియు సన్మాన సరణిదనరె
సమయ మిప్పుడు మంచిదై సంభవించె॥ ౧౩౬

క. విబుధుల మెప్పుల బొందుచు
శుభముల లోకంబులెల్ల శోభన లీలం
బ్రబలముగ బొందు నట్టుల
ప్రభుతను నేనొందు వాడ ప్రాభవశక్తిన్॥ ౧౩౭

గీ. కార్యకారణ జాతము ల్గలవుమిగుల
కామినీ మణి సీతోడ గలసి మెలసి
లోకమున కీర్తి నార్జించి లోకులెల్ల
మనల గొనియాడ దిరుగుగ మదిని దలతు॥ ౧౩౮

క. సుదతీ రాజును గనుగొని
యిదె వత్తును వేడ్క నుండు మింతులతోడన్
మది సుఖమును గనుచుండుము
మదిరేక్షణ యనుచు బలుకె మానిని యప్పుడె॥ ౧౩౯

సీ. మహనీయమణిమయ మహితభూషణముల కాంతియె మునుముందు
గదలుచుండ
మహితమంజులదివ్య మంజుల గాత్రంబు కూర్మిగనులవింత గూర్చు
చుండ
యూశాసనముల నిట్లను రాజసూయాభిషేచనమున రాజసేయ నెంచి
విధియింద్రునికి సేయు విధమున నిను వేగ నభిషిక్తు జేయగ హార్దవశత

గీ. దీక్ష గైకొని వ్రతమూను దివ్యచరితు
హారిణ శృంగము నజినము నవధరించి
వెలయు వానిని భజియింప వేడ్కతోడ
నాశ్ర యింతును శుభమతి యలరు నిన్ను॥ ౧౪౦

గీ. వజ్రివహ్ని యమాసుర వరుణ వాయు
ధనద గౌరీశు లెప్పుడు దయను నిన్ను
సర్వదిక్కుల కాపాడి సర్వసిరుల
జయము భద్రంబు నొసగగ జాలువారు॥ ౧౪౧

క. అనిబలుకు సీతమాటల
ఘనముగ సంతోషమంది గాఢప్రేమన్
మనమలర సీతఁ గనుగొని
ఘన రవనిభ కంఠనాద కలనను బలికెన్॥ ౧౪౨

క. అంగన నిలుమిక నీవీ
యంగణమును దాటవలవ దటు జనినిలుమిం
బంగరు బొమ్మల బోలిన
యంగనలట యాటలాడ నలరిరిగాదె॥ ౧౪౩

క. అని బలుక సీత నిలచెను
చన సూతునితోడ రామచంద్రుడు దలచెన్
మనసొకటి బోయె వెనకకు
ఘన పాదములు ముందుకును గదలెను బోవన్॥ ౧౪౪

సీ. గుహనుండి వెడలిన గొప్పసింగముఁబోలె నిజగృహముఁ బువీడి నీటుఁ బ్రోడ
మొదటి వాకిలియందు మోదంబుతో మొక్కి దనతోడవచ్చెడి తమ్ముఁగూడి
నడిమివాకిలి యందు నమ్రులై నిలచిన యమాత్యుల మిత్రుల నాదరించి
చనియగ్రసీమను జ్వలన సన్నిభమును ఘనరవయుక్తమై గనుల కెదుర

గీ. నిలిపియుంచిన రథమును నీటుఁబ్రోడ
తూర్పుకొండ నధిగమించు తొవలరేని
చందమున నెక్కి చక్కఁగ సాగిపోయె
చారునేత్రుఁడు శ్రీరామచంద్రమూర్తి॥ ౧౮౫

సీ. ఛత్రచామరములు చతురతఁ గైకొని సౌమిత్రి వెనుకటి చక్కి నిలువ
సప్తాశ్వ త్రోవను స్తనయిత్నువలెఁబోవు వర రథ గమనంబు వరలుచుండ
నుదయాద్రి దిగుచుండు నుత్పలేశుని బోలి దనమందిరమువీడి దనరుచుండ
కలకల రవమును గలిగించు జనములు గుంపులు గుంపులు గూడి నడువ

గీ. రక్త వస్త్రంబులును ఖడ్గ రాజి గలిగి
వీర భటకోట్లు గుర్రము ల్వెనుక నడువ
గజము నెక్కినవీరులు గలసి కొనగ
రామచంద్రుని రథమేగె రాజవీధి॥ ౧౮౬

ఉ. మంగళ తూర్య రావమును మంజులవంది జయాశిషంబు సా
రంగ తురంగ ఘోషమును రంజిత వీరమహాట్టహాసముం
రంగుగ గల్గి వర్తిలగ రమ్యగవాక్షములందు నిల్చుచుం
పొంగుచు నెల్ల కామినులు పువ్వుల లాజల జల్లిరొప్పగన్॥ ౧౪౭

క. ఇలపై సౌధంబుల కిటి
కీలను చూచు సతులు తను కీర్తించిన సీ
తాలలనాధినాథుడు సు
మాళీ సుకుమారుడు గని హర్షము నొందెన్॥ ౧౪౮

వ. అపుడు పురమున గల వనితామణులు రాము నుద్దేశించి కాకలీ కలరవంబుల నిట్లనిరి.

సీ. కరినంపు వ్రతముల కౌసల్య నినుగను భాగ్యంబువడసెను భవ్యనియతి
చంద్రుని రోహిణి సంగతిగనినట్లు సీతామహాదేవి శ్రీసమాన
ప్రాణేశ్వరుని నిన్ను ప్రబల పుణ్యముచేత ఒటయగ గలిగెను పరమసాధ్వి
నినురాజుగా బొంది నిరుపమ సుఖముల ననుభవించగ నుంటి మార్యవర్య

గీ. కష్టమననేమొ దెలియగ గాంచనట్టి
రామ రాజ్యంబు దశరథ రాజుమాకు
గలుగ జేయగ బూనెను గరుణతోడ
కామితంబుల నెల్లను గాంచ గలము॥ ౧౪౯

సీ. శ్రీరామ శ్రీరామ శ్రీరామ నీనాము మాధుర్యమే మాకు మధుర పదము
శ్రీరామ శ్రీరామ శ్రీరామ నీరూప సౌందర్యమే నిత్యసౌఖ్యపదము
శ్రీరామ శ్రీరామ శ్రీరామ నీరాజ్య పాలన మానంద పరమపదము
శ్రీరామ శ్రీరామ శ్రీరామ నీపాద నీరేజయుగ్మమే నిధి పదంబు

గీ. తండ్రి తల్లియు గురువును దాత భ్రాత
దైవతంబును సర్వార్థ తతియు నీవె
దశరథేశ్వరు కరుణను ధరణివిభుడ
వగుచు మమ్ముల పాలించు మధిక తేజ॥ ౧౫౦

క. తాతల తండ్రుల వలెనే
చేతో మోదంబు గూర్చి చిరకాలంబున్
భూతలమును, బాలింపుము
మాతల్లివి తండ్రివివె మధురుచినావమా॥ ౧౫౧

వ. అనిబలుకుచు లోకంబున నశ్రుతచరములగు రామచంద్ర సకల, కళ్యాణ గుణ గణాకృష్ట సర్వేంద్రియులై మనోనయనంబుల కన్వాహంబును నియతలక్ష్యంబగు శ్రీరాముని దివ్యమంగళ విగ్రహమును తృప్తినొందకుండగాంచుచు సర్వంబును మఱచి పరిత్యక్త సర్వవ్యాపారులై రామరాజ్య సుఖాస్వాదనాభిలాషులై రామపట్టభిషేక మహోత్సవావలోకన వ్యగ్రచిత్తులై దమలలితాపాంగావలోకనంబుల నాతని యందు నియతలగ్నంబులజేసి తన్మయులై యుండిరప్పుడు

క. యే కులమువాడు గానీ
యేకాలపువాడుగాని యెపుడగుపడినన్
యేకాదరమున గనుటను
లోకులు శ్రీరామునందు లోలులు నుండీ॥ ౧౫౨

వ. అట్టి శ్రీరామచంద్రమూర్తి యపుడు

గీ. రత్నహాటక మయమైన రమ్యవర్ధ
మానగృహముల విలసిల్లు మహితజనక
మందిరము శక్రమందిర మాన్యవిభవ
మైనదానిని జొచ్చెను హర్షవశత॥ ౧౫౩

గీ. మూడువాకిళ్లు, రథముతో, మూకతోడ
దాటికాల్నడ కక్ష్యలు దాటిరెండు
యచట నిలచిరి మహితులు వార్శ్వగృహము
నధిగమించెను రాఘవుఁడధికభక్తి॥ ౧౫౪

—♦ రాముడు దశరథునవలోకించుట ♦—

వ. చని, చని, యగ్రభాగంబున మహావిశాలంబగు నొక పర్యంకంబున నాసనోపవిష్టయగు కైకకు బెడముఖంబుగ బసుండి, గన్నుల బాష్పంబులొలుక బెనువనట గుందుచున్న దనతండ్రిని గన్నుల గాంచి, రామచంద్రుడు నిర్విణ్ణహృదయుడై యభివాదన మొనర్చి, కైకకు వినయంబున మ్రొక్కి దశరథున కభిముఖుడై వినయంబున నిలువబడిన దన యనుంగుబుత్రు నవలోకించి, శిరంబు వంచి రామా యని యధిక శోకభరంబున మాటాడలేక దుఃఖించుచున్న జనకు నీక్షించి యతిభీతుండై కైకంగని, తల్లిరో, నా జనకుండేల నన్ను గననొల్లడు. దుఃఖంబునకు గతంబేమి? నేనేమైన యపరాధ మొనర్చితినా? నాయందుగల ప్రేమ యేమయ్యె? దేహపీడయా? మనోవ్యాధియా? లేక నా ముద్దు తమ్ముకుర్రలు రాజగృహంబున, మాతులగృహంబున సుఖంబుండిరా? యప్రియంబేమియు వినబడ లేదుగదా? తల్లులప్రియవాదులు గాలేదుగదా, యీతడాడినమాట దప్పెనా, నీవైన కరుణించి నాకెఱుంగింపజనదా, నేను నీపుత్రుడను గానా, ప్రియపుత్రునియందు నీకును దయలేదా, నాజనకుని శోక కారణమును నేనే తొలగింప సమర్థుడగానా, యాకారణంబు దెలిపి నన్ను కృతార్థునిజేయుము,

## —♦ కైక రామునితో మాటలాడుట ♦—

సీ. అనిబల్కు రాముని కప్రియవాదిని కైకయిట్లనిబల్కె కరుణవిడచి
లజ్జనువిడనాడి లాభంబె గోరుచు ధర్మంబుదలపక దారుణముగ
కోపమునీమీద కొంచము లేదయ్య కోరికదెలిపిన కోపగింతు
వనుచు భీతిని చెల్ప డవని నాథుడునీకు విభునికోరికదెల్ప విస్తరింతు

గీ. నప్రియంబును నీతోడ ననగలేక
కుందుచున్నాడు నీవైన కోర్కెదీర్చి
ధర్మపథమును నీతండ్రి దప్పకుండ
జేయుదలచిన నీకది జెప్పుదాన॥ ౧౫౫

సీ. తల్లిదండ్రులమాట దాటవు నీవెప్డు ధర్మమునందున దవిలియుందు
వరులను మిత్రుల నరయుదు సమముగ సత్యంబు విడనాడ జాల
వెపుడు
తమ్ముల మనుజుల తనయులవలె జూతు వటుకయున్నదినీకు
నసలె లేదు
గష్టసుఖంబుల గణనజేయవు నీవు కరుణయె నీయందు గాంచగలిగె

గీ. కపటమన్నది యెరుగవు కమలమిత్ర
వంశమందున బుట్టిన వారిలోన
వాసిగాంచిన వాడవు వరదు జనకు
నసృతవార్ధిని బడకుండ నరయవయ్య॥ ౧౫౬

క. దననోట నప్రియంబును
వినిపింపగ లేకనీకు విభుడిట్లుండెన్
వినిపింప మనెద వేనియు
వినిపించెద ధర్మమగుట వినుము కుమారా॥ ౧౫౭

ఉ. సంగరమందు గాచితివి శంబరు మాయల నొందకుండగా
పొందుగ నీతడిచ్చె నుమి పొల్పుగ రెండువరంబు లప్పుడే
సంగతి గల్గఁగోరెదను నమ్మతి నప్పుడొసంగు మంటినే
నింగిత మిప్పుడిమ్మనిన నీతడసత్యము లాడ బొల్పడెన్॥ ౧౫౭

గీ. కల్లలాడగ నీతడె గడగెనేని
కల్లలాడని వారలు గలరె పుడమి
కల్లలాడక సత్యానుగామి గాగ
జాల తండ్రిని కాపాడు జానకీశ॥ ౧౫౮

ఉ. మన్ననతోడ నాకు బహుమాన వరద్వయ మీతడిచ్చుటన్
పన్నుగ దాచుకొంటి మన పార్థివు చెంతనె దాని నిప్పుడే
గ్రన్నన గోర దుఃఖమును గాఢముగా నిటు బొంద నేలనో
యన్న గతాంబు నేతు రిచ నార్థిని బోలెను లాభ మెద్దియో॥ ౧౬౦

గీ. తండ్రి ధర్మాత్ముడనిపింప దలచితేని
తల్లికోర్కెను దీర్పంగ దలచితేని
ధర్మ శృంఖల నీకాళ్ల దగులు నేని
చెప్పగలనయ్య కోర్కెల చిత్తమలర॥ ౧౬౧

క. యీకరణి కైకబలికిన
భీకర వాక్యాళి వినుచు ప్రియుజనకుం మనం
బేకరణి కలిగియుండెనొ
ప్రాకటముగ దెలియగోరి పటుగటిబలికెన్॥ ౧౬౨

శా. ఇస్సీ తల్లివి నీవు పుత్రునిటు నీవేలా కృపాహీనతన్
లెస్సా బల్కితి విట్లు నీవెరుగవే లేశంబు నాచిత్తమున్
నిస్సారంబగు దేహ మగ్నినిడెద న్నిర్నిద్రత న్దాల్చెదన్
దుస్సాధ్యంబగు కాలకూట విషము న్గోల్ల నోర్తుం జనున్॥ ౧౬౩

క. భూమిపుడు గురుడు దండిగ్రియు
   కామితముల నెల్ల గూర్చు కారుణి కుంజను
   యేమని యాజ్ఞాపించిన
   రాముం డద్దాని జేయు రాజిత భక్తిన్॥ ౧౬౪

క. భూమిపుని యాజ్ఞ నెఱపెద
   కామిత మేమైన దెల్ప గడగగ వలయున్
   నామాట నమ్మ వలయును
   రాముడు మారాడరాడు రామామణిరో॥ ౧౬౫

క. చక్కని రాముని మాటల
   నిక్కము కైకేయి మనసు నిక్కెను యెసఁ
   టక్కరి దగుటను మిక్కిలి
   చిక్కని మనసగుట వికృతి చెచ్చెర బాచెన్॥ ౧౬౬.

వ. కైకదనమనంబున రాముడు వెఱ్ఱివాఁడు, సాహస సత్త్ముడు, కపటోపాయంబుల నెఱుగడు దశరథుని వలన కార్యసిద్ధి మాకము గానేరదు. రాముని వలననే కార్యమును సాధించు కొనవచ్చును. రాముడు యోగ్యుడని కరుణించి కార్యమును విడచుట నాకు శ్రేయస్కరముగాదు. రాము డెట్టివాడైననేమి నాపుత్రునకు రాజ్యప్రాప్తిని గలిగించుటయేగదా నాకు పరమధర్మము. ఆత్మలాభముకంటె యధికమేమియునులేదు. అని మనంబున నిశ్చయించి రాముని చేతనే తన కార్యమునకు తగిన త్రోవ నేర్పర్చనెంచి రాముని గనుగొని

—♦ రామునకు కైకదనకోర్కె దెలుపుట ♦—

సీ. అమరుల కసురుల కతిఘోర కలహంబు గలిగెను పూర్వము కమల నయన
   అసురులు నీతండ్రి నధికశరార్తుని జేసిన నేనపుడు చెంతనుంట
   గర్వితరిపులను గణనచే యక నేను గాచితినప్పుడు కార్య మెఱిగి
   యుపకార మెఱిగిన యుర్వీశు డప్పుడు వరముల రెంటిని వనితగోరు

గీ. మనుచు బలికిన నృపునితో నంటినిటుల
కోర వలసిన వన్నియు కొదువలేక
గలిగి యుండుట నిపుడేమి గాంక్షజేయ
వలసి నప్పుడు కోరెద వర యుగంబు॥ ౧౬౭

గీ. కరణ నిప్పింపు కాలంబు గడచె నసకు
మనుచు బలికితి చిరకాల మయ్యె యిప్పుడు
గోరు కొంటిని వరముల గోర దగునొ
దగదొ చెప్పుము ధర్మంబు దరచి నీవు॥ ౧౬౮

క. రెండు వరంబు లందు నను
ఖండితముగా నొకట నీవు కానకు నేగన్
రెండవ వరమున భరతుడు
దండిగ నభిషిక్తు డగుచు ధారుణినేలన్॥ ౧౬౯

గీ. రామ పట్టాభిషేకార్థ రమ్య వస్తు
భరత పట్టాభి షేకార్థ భవ్యగతికి
వలయు రాముడు పదునాల్గు వత్సరములు
నడవిలో నుండవలెననియంటి నేను॥ ౧౭౦

క. నామాటవినెనొ లేదో
యీమాదిరి దుఃఖపడుచు సీత డిటుండెన్
యేమని జెప్పుదునీతో
రామామారాడ రాకు రఘుకుల తిలకా॥ ౧౭౧

క. జనకునకు సీత మిక్కిలి
ఘనమగు నపకీర్తి రాని కార్యము వినుమీ
వనమున కేగుమి యిప్పుడె
మునివృత్తిని జడలుదాల్చి మునిహితచరితా॥ ౧౭౨

గీ. మనువు మొదలగు మాన్యుల మహిత యశము
మఱచిపోయెను మీతండ్రి మమత చేత
నశ్వరంబని సకలంబు నమ్మవయ్య
సత్యవర్తను తండ్రిని సలుపవయ్య॥ ౧౭౩

సీ. దశరథాత్మజవిను దయతోడ నామాట తండ్రివాక్యము దాట
దలపకయ్య
పదునాల్గు సమములు బాగగ వనమందు జడలు నారలు దాల్చి
సరవి నిలుము
పట్టంబు గట్టంగ భరతుని బిలుపింపుడనుచు మంత్రులతోడ ననగ
దయ్య
సత్యహరిశ్చంద్రు సద్ధర్మవృత్తిని మనసున నెప్పుడు మరువకయ్య

గీ. చకిత మతులను గాపాడ జాలవయ్య
దయయు సత్యంబు ధర్మంబు దలపవయ్య
నిరుపమంబైన కీర్తిని నిలుపవయ్య
పోవు నన్నియు కీర్తియె పోవదయ్య॥ ౧౭౪

ఉ. ఈగతిబల్కు నిష్ఠురము లెల్లను రాముడు వించు బుద్ధినే
కాగ్రతనుంచి యుంచుకయు గాంచ డహంకృతి శోకమేనియున్
క్రాగె మనంబు భూపతికి గల్గె వియోగ మటంచు చింతచే
వేగమె ఒల్లటిల్లె మృతివేళయె డగ్గరు వాని రీతిగన॥ ౧౭౫

—♦ రాముని వనవాస ప్రతిజ్ఞ ♦—

చ. వినుట కశక్యమౌ నుడులు పీనుల సోకిన ధీరుడాటచే
ఘనరిపు మర్దనుండు ఘనకార్ముక హస్తుడు రాముడిట్లనున్
వనమున కేగుటెంతపని వారిరి దుఃఖమిదేల బొందెడిం
మనమున శంకదక్కి నృప మాన్యుడు బొమ్మన బోదునిప్పుడే॥ ౧౭౬

క. జడలును నారల జాలిచి
కడువడిగా కాననేగ గడగెదవిప్పుడే
బెడిదపు మాటల నృపునికి
నడలింపకు నృపుని వరము నగు సార్థకమున్॥ ౧౭౭

క. నాకొక్కటి జెప్పవమ్మా
యీకరణిని మాటలాడ నేలనొ తల్లీ
నీకిదె ప్రీతినిగూర్చెద
భీకరమగు కాననిప్పుడె వేబోదునికన్॥ ౧౭౮

క. గురుడును జనకుడు నృపతియు
బరమాప్తుడు హితుడు విశ్వ భార వహుండున్
కరుణించకున్న నాకిక
బనువడి బ్రతుకేల దేహభారంబేలా॥ ౧౭౯

క. ప్రియమైన విషతు దేహము
భయమిసుమంతైన లేక బట్టెద బామున్
దయగలుగు జనకు నాజ్ఞకు
ప్రియమగు నెద్దానినైన పేర్మిని విడుతున్॥ ౧౮౦

ఉ॥ నిక్కముజెప్పెదన్వినుము నీసుతుబట్టముగట్టువాడనం
చక్కటదాను గావిభుడు యాదరమొప్పగ జెప్పరాదొకో
మక్కువ సమ్మతింపనొకొ మాన్యుని మాటను దాటువాడనో
పెక్కుగ దీనికై వగతు ప్రేమ జెడన్గలమేమొ నాయడన్॥ ౧౮౧

వ. అని కైకకు బలికి తండ్రియగు దశరథ భూనాథునకభి
ముఖుడై వందనమాచరించి

క. అపరాధ మేమిజేసితి
కృపనాయెడ లేనియట్టి కారణమేమొ
విపరీత వృత్తిదనగెను
కపటంబిసుమంతమైన గాననితండ్రీ॥ ౧౮౨

చ. భరతున కిమ్మనీవనుచు బల్కినసీతను మున్నునివ్వగే
ధరణిని విత్తమున్నిరుల దమ్మునికిచ్చుట కూడకస్సిమే
ధరణిపు నాజ్ఞచేసిపుడు తమ్మునికిచ్చెద ప్రాణమైననే
నరిగెద రాజ్యమున్విడిచి యార్యులుమెచ్చ నరణ్యసీమకున్॥ ౧౮౩

చ. ధరణిప యేలనోయిపుడు ధారుణి జూచుచు శోకపూర్ణగను
న్వరదలుగట్టనేత్రముల నావిరిదుఃఖమునొంద నేలనో
భరతుని బిల్వబంపుమిక పట్టముకట్టుము నేను కానకున్
అరమరలేకపోయెద మదంబకు చెప్పగ బోయినన్తరిన్॥ ౧౮౪

చ. ధరణిపుసన్నిధానమున తమ్ముడు రాజ్యము నేల కానకున్
నరమరలేక నేనరగ నంబరో కోరినదాన వేగటచే
ధరణిపు నాజ్ఞయైనటుల దల్చివనంబునకేగ బూనితిన్
ధరణిపు నాజ్ఞలేదనుచు దల్పుచు నలకేలజెప్ప నమ్మమీ॥ ౧౮౫

గీ. అనుచు రాముడు బల్కగ నతివమదని
హర్ష మొందుచు రాముని కనిగొనియెటుల
దమ్ముకురగ్గని బిలిపింతు ధరణినేల
దడయకేగుము వేగంబ దండకమును॥ ౧౮౬

ఉ. సగ్గినమగ్గినల్గొనుచు జాలగ దుఃఖమునొంది సిగ్గునన్
క్రగ్గుచు నున్ననీజనకు కమ్మనిమాట లభించబోదుని
వెగ్గుగదల్చబోవకు మహీనపరాక్రమ బొమ్ము వేగమే
తగ్గును దుఃఖమీతనికి దగ్గరనుండక నీవుపోయినన్॥ ౧౮౭

క. ఆమాట వినినతోడనె
భూమీశుడు వివశుడగుచు భోరునబడియన్
రాముడు తండ్రినికయ్యకు
కోమలముగ జేర్చిబలికె కోమలఫణితిన్॥ ౧౮౮

చ. అతులిత సత్య ధర్మముల నార్యజనస్తుత మానసంబునన్
సతతముఁబూనియుండెదను చంచలధైర్యముతోడసంపదల్
వితథములంచు దల్చెదను విశ్వమునేలు వివేకి నీవు మ
ద్ధితమునుగోరిదుఃఖమతి హేయముగావున నీకు మ్రొక్కెదన్॥ ౧౪౯

వ. అని జనకుని తోడబలికి కైకను గనుగొని తల్లీ!

క. పతిహితముగోరుతల్లిరో
యతికఠినముఁగాగబలుక నమ్మాతగునా
పతియే దైవమునుమ్మా
పతిమాటలదాటదగదు పడతికి నెప్పుడున్॥ ౧౫౦

సీ. తండ్రిని మెప్పించదగు పనిజేసిన దనయుని దనయుగా దలపవలయు
భర్తకుహితవును బకువడి దలచెడి భార్యను భార్యగాబలుకవలయు
కష్టదశలయందు కళ్యాణములయందు సమవర్తి సచివుడు సచివు
డగును
యఖిల దుశ్చేష్టల నలుక గాంచనియట్టి బంధుని బంధుగా బలుక
వలయు

గీ. ఇట్టి పుత్రుడు భార్యయు నిట్టిమిత్రు
డిట్టి బంధువు గలవాడె యిహము నందు
బరము నందును మోదంబు బడయ గలడు
పుణ్యవంతుడు నాతడె పుడమి యందు॥ ౧౫౧

క. ధనమేపర మార్థంబని
మనమునగలచంగబోను మదమత్సరముల్
జనియింపఁ(?)నామనమున
మునివృత్తిని దపిలియుందు మదిమును నెపుడున్॥ ౧౫౨

క. జనకుడు చెప్పకమును పే
జననీపదునాలుగేళ్ళు వనమున నుండన్
జనియెద కోర్కెను దీర్పగ
జననాథుని సవిధమందు శపథము జేతున్॥ ౧౯౩

క. భూపతి నిటు నలయించితి
నీపని కాయింతమనసు నెరుగవు తల్లీ
నీపనుపు జేయ కుందునే
పాపాత్ములకైన తల్లి పరదేవతయా॥ ౧౯౪

క. తల్లికి కౌసల్యకు నా
వల్లభునకు నే జెప్పివేగ వచ్చెద నిటపున్
కల్లలు ఒలుకగనేరను
తల్లీ నావచ్చుదనుక దయసైపగదే॥ ౧౯౫

క. పుడమికి రాజై భరతుడు
కడుభక్తిని తండ్రిగొలువ గావలయును సుమీ
కొడుకెంత వాడుగానీ
విడువంగాదగదు ధర్మవితతిని తల్లీ॥ ౧౯౬

క. అనవిని రాజశేఖరుడు
ఘనశోకము వలన మనసు కలతను జెందన్
ఘన రవము జనులు వినగా
పనివడి యావరచినట్లు పలవింపంగాన్॥ ౧౯౭

చ. సలలిత ధర్మవర్తనుడు సాధుశరణ్యుడు రాముడప్పుడే
వలగొని మ్రొక్కి కైకకును వందన మొప్పగజేసి తండ్రికిం
విలయకృశాను రోషమున విల్లుకు బట్టు సుమిత్ర పట్టిదు
ర్లలితముగాగ వెంట జనలచ్చికి మూలము రాముడత్తరిన్॥ ౧౯౮

## —♦ రాముడు కౌసల్యకడకు బోవుట ♦—

చ. త్వరితముగాగ కాల్నడక తజ్జనమిత్రికి దెల్పి కానకున్
వర మునివృత్తి బోవుటకు వల్లభునాజ్ఞను బోవు జానకీ
వరుని ముఖంబునందునను వాసియు వన్నెయు నించుకేనియు
న్దరుగదు చంద్రు గప్పగలదా క్షణదాగమ మెప్పుడేని
యున్॥ ౧౯౯

చ. వినుట కనిష్టమైనయట వీగమనంబు జానకీశ్వరా
ననమున భేదమించుకయు నవ్యముగా గనుపింప జేయగా
దనరగలేదు ధీయులతిదారుణమైన హృషీక చేష్టచే
బొనుపకువారుగారు తమ భోగములెల్ల తృణంబు వారికిన్॥ ౨౦౦

సీ. కదుకొను దుఃఖము గనపడనీయక కోపము దనమది గోప్యపరచి
ఖడ్గము చాపంబు గైకొని దనతోడ సౌమిత్రి దనవెంట జనుచునుండ
బంధుల మిక్కిలి మన్నించి ప్రియవాక్యములచేత మిత్రుల ముదము
నెఱపి
పెద్దల గనుగొని పేర్మిని మ్రొక్కుచు విన్నపముల దయ వినుచు
మిగుల

గీ. అంతిపురిజేరి కక్ష్యల నధిగమించి
పరమ మిత్రుల మన్నించి పరమ దయను
దివ్యతేజంబు దిశలను తేజరిల్ల
తల్లిగనుగొన బోయెను దగిన యటుల॥ ౨౦౧

వ. అట కౌసల్యాదేవి

సీ. దనపుత్ర హితవును దనమది గోరుచు శ్రీవిష్ణు పూజల సేయుదాని
వివిధ వ్రతంబుల విధివిధానముగాగి శిష్టులు మెచ్చగ సేయుదాని
ఉపవాసముల డస్సి యుచితదీక్షల బూని శ్రీదేవి పూజల సేయు
దాని
మహిత మంత్రంబుల మంగళాగ్నుల వేల్చి జిష్ణుసుఖార్చన
సేయుదాని

గీ. దధిఘృతంబులు లాజలు దర్భతతులు
పాల కడవలు పువ్వులు పక్వ ఫలము
లెల్ల సమకూర్చి భక్తి తదేకదృష్టి
నున్న తల్లిని గని మ్రొక్కె యుచితరీతి॥ ౨౦౨

క. వచ్చిన సుతుగని వేగను
మచ్చికతో గవియు శబళి మూదిరి యుపుడ
గ్రుచ్చెను కౌగిట రాముని
ముచ్చటతో సుతుని శిరము మూర్కొనె కసుణను॥ ౨౦౩

క. కౌసల్య యనియె రాముడ
భాసుర రాజర్షి లబ్ధ పరమాయుస్సున్
వాసిగ బొందుము ధర్మము
నేసము వీడంగ బోకు విశ్వేశుడవై॥ ౨౦౪

సీ. దశరథావనిపాలు దయయావస్త రాజ్యాభి కారంబు నీకిప్డె గలుగు
నయ్య
ఆడిన మాటల నాతడు దాటడు దడయక కేగుము వేగ తండ్రి కడకు
సత్యధర్మంబులు సవుర్గొప్ప కులమున జనియించి నాడవు జగము
నేల
యీపీటపై నుండి యింపుగ భుజియించి యాశ్వరే నుజూడ సేగు
మయ్య

గీ. తండ్రి బోలుచు బ్రతుకుము ధర్మపథము
దాట బోకుము దాతవై ధరణి సురలు
దైవ తంబుల గతిగొల్చి తండ్రి పగిది
ధరణి గలవారి నెల్లను దనుపవయ్యా॥ ౨౦౫

వ. అంత రామభద్రుడు

క. అతిమాత్ర వినయ సంపద
క్షితిజాపతి కెట్టెడు సహజ సిద్ధంబగుటన్
అతినుగుణి తల్లి దగ్గిర
మతిమంతుడు బలికె వినయ మహితాత్మకుడై॥ ౨౦౬

—♦ రాముడు దనవనవాసమును కౌసల్యకు దెల్పుట ♦—

ఉ. పీటను చేతిసంటి కడు భీతియు లజ్జయు భక్తి మిక్కిలి
న్నాటము గాగ గల్గగను వందన మొప్పగ జేసి తల్లితో
బాటిలె దుష్టకాలమిక భవ్యతరాటవి నుండ బోవలెన్
మాట లికేల నాల్గుపది మానితహాయనముల్ప్రపాజ్ఞచే॥ ౨౦౭

క. భరతునకు యౌవ్వ రాజ్యము
ధరణీశు డొసంగి నన్ను దండక కనిచెన్
ధరియించి మౌని రూపము
చరియించెదపదియునాల్గు సమములు తల్లీ॥ ౨౦౮

క. తల్లీ నీకును సీతకు
సల్లలితుడు లక్ష్మణునకు సచివుల కెల్లన్
యుల్లము బగులగ జేసెడి
కల్లోలము బుట్టెనమ్మ కాలము దప్పన్॥ ౨౦౯

క. వనమున పదునాల్గేడులు
మునివృత్తిని యుండవలసె మునిబృందముతో
ఘనమగు శోకము నీకును
మనమునఁ నిలుపంగవలసె మానుగనిపుడే॥ ౨౧౦

ఉ. బరహితకార్యతత్పరుఁడు భవ్యగుణాఢ్యుఁడుతమ్ముఁడుఁ బ్రౌఢౌ
భరతుఁడు నీకు తండ్రికిని భక్తుఁడు రాఘవవంశమౌక్తికం
బరిజన మృత్యుదేవతయు బాలన సేయుచు నుండ నిత్యమై
బరగు శుభంబు లోకులకు భావమునందున చింతవీడుమా॥ ౨౯౧

క. దినిమొద కూరల గాయల
దినకుండెద మాంస మికను ధీరులు మెచ్చన్
వనమున మెలగెద ననవిని
వనిగొడ్డట బడ్డ సాలవృక్షము భాతిన్॥ ౨౯౨

ఉ. దివమునువీడి కాశ్యపని దిద్దిరపడ్డ సుధాంశు కైవడిన్
భువిపడియున్న తల్లిగని భూమిసుతాపతి మూర్ఛ దేర్చగా
సవిధము జేరి బాహువుల జక్కగనెత్తి సఖ్యోపచారముల్
సవరణ జేయగా దెలసి సన్నిధి నున్న సుతాననంబునన్॥ ౨౯౩

చ. విన్నదనంబున న్గనుల వింతగ బాష్పము లొల్కుచుండగా
సన్నిధినున్న లక్ష్మణుని చయ్యన జూచుచు తండ్రులార నా
పన్న శరణ్యులార బహు పాపము జేసిన దాన గాన నా
సన్నుత పాత్రుఁడౌ సుతుని సాధుశరణ్యుని బాయనోచితిన్॥ ౨౯౪

ఉ. నాయన లక్ష్మణుఁడ తగునా జననాథుం కార్య కార్యమే
ఛాయను బోలివర్తిలెడి చక్కని మిత్రు నరణ్య సీమకుం
శ్రేయము బాపి బంపుటకు చేతమ దెట్టుల నొప్పె సీతనిం
బాయగ వ్రాసె నానుదుట పద్మజు డెట్టుల దప్పిపోయెడిన్॥ ౨౯౫

ఉ. నాయన రామచంద్రమును నాయుదరంబున బుట్టకుండినన్
బాయని దుఃఖ మీపగిది బాల్పదకుండును నేను గొడ్డునై
యేమెటు లొక్కకాలమును యేగగ జేయనె యద్దెమేలెయా
యీ యవమాన దుఃఖముల నేనెటులోర్వగ నేర్తు జెప్పుమీ॥ ౨౯౬

ఉ. బిడ్డలు బిడ్డలంచు నిల బిడ్డలకై పలవించ నేలనో
బిడ్డలగన్న నారి బహుభీషణ కష్టములెల్ల జూడరో
బిడ్డలు లేకయుండినను భీతియు దుఃఖము లేక యుండెడిన్
బిడ్డల నింక గోరకను వేరు ప్రతిష్టల గోరగా వలెన్॥ ౨౧౭

క. బిడ్డలు లేరను చింతయె
గొడ్రాలికి గలుగు వేరె గొడవలు గలవే
బిడ్డలు గల్గినవారికి
చెడ్డలెగాకేది మేలు జెప్పుము తనయా॥ ౨౧౮

చ. పెనిమిటి పెట్టు పెత్తనమే పెన్నిధి భామల కద్ది లేనిచో
గనుటయె మేలు మృత్యువును గల్గెనె నాకది యెప్పుడేనియున్
మనుటకు కారణంబు వినుమా సుత రాజ్య సుఖాభిలాషయే
మనగలదాన దైవమిటు మారెను మారట వైరియో యనన్॥
౨౧౯

క. పటపట పండ్లను గొరుకుచు
మటమట మొగమందు దోప మాయలమారై
చిటచిట పలుకులు పలికెడి
కటమగు కైకేయి మొగము తీరెలు గందున్॥ ౨౨౦

చ. యిరువది యైదు వత్సరము లేగెను నీజన నాది నేటికిన్
బరువడి దుఃఖభంగముల బాయను సౌఖ్యము గల్గు నెప్పుడో
ధరణిపు సత్కృపారసము దైవమె గూర్చు నటంచు నుండగా
పరిణతి యిట్లుగల్గెనిక ప్రాణము పీడ నుపక్రమించెదన్॥ ౨౨౧

ఉ. పున్నమ నాటిచందురుని బొంగడగించెడి నీదు వక్త్రమున్
గన్నుల గాంచ లేని యర గంటయు నాకు యుగంబు గావునన్
క్రన్నన నాదు జీవితము కాయము నందున నిల్వబోదు నీ
వెన్ని విధంబుల న్బలుకు మీపదు నాలుగు సమంబు లోర్తునే॥
౨౨౨

ఉ. ఎక్కటి కాననంబునకు నేగెద నేనని నీవుబల్కఁగా
 వ్రక్కలుగావు గుండియలు వజ్ర శిలాయస నిర్మితంబులా
 నిక్కము గానిచో నిటుల నిల్వగ నేర్చుట కేమి హేతువో
 జక్కగ బల్కవయ్య ధృఢ సారము చావెటు లబ్బునో యికన్॥
 ౨౨౩

ఉ. చాలికనాకు లేమ యమ సద్మమునందున చోటులేను నీ
 సేవన భూమినుండుటకు వేగమ బోయెద నన్ను దుఃఖ్యాలై
 చావదలంచు నన్ను గొని సాగుడు దండ ఘరుంసు వేశినన్
 చావగ మొత్తినెత్తుకొని సాగెడి పింగము వోలె రాఘవా॥ ౨౨౪

క. జేసితి వ్రతములనెన్నో
 వాసిగ నవి చవిటివిత్తువలెచెడిబోయెన్
 భూసుర సేవల జేసితి
 భాసురమగు వారికరుణ బాసెను నాపై॥ ౨౨౫

చ. వనమున కేనువచ్చెదను వైరుల చెంతను నిల్వ లేను నే
 ననిశము భుక్తిసౌఖ్యముల నద్భుతమొప్పగ గూర్చ దాస ని
 వనితరలభ్య సద్గుణుడ వద్భుతశక్తియుతుండ వాటచే
 వనమున కష్టనష్టములు వచ్చుననంగను రాగుబిడ్డడా॥ ౨౨౬

క. నినువిడిచి నిముష ముండను
 ననుగొని పోవంగ వలయు నరనుత యనుచున్
 గనువారి గుండె లవియగ
 ఘనముగ కౌసల్య యేడ్చె గడు ఘోరముగన్॥ ౨౨౭

వ. తీవ్ర కోప శోక వివశుడైన లక్ష్మణుడు కైకయాడిన కపట నాటకంబును దశరథుని యవివేకంబును రాముని యమాయకత్వంబును కౌసల్య పడియెడి దుఃఖ బాధలను గాంచి సహించలేక రామసన్నిధిని కౌసల్యను గాంచి తానును దుఃఖించుచు నిట్లు జెప్ప దొడగెను.

క. రాముని తల్లిని గనుగొని
సౌమిత్రియు దుఃఖ పడుచు సఖ్యము మెఱయన్
సామము ధర్మము జెలఁగఁగ
కామితమును దెలుప నిటుల జక్కఁగ గడగెన్॥ ౨౨౮

ఉ. ఆఁడుది యాఁడుమాటలనె యాదర మొప్పగ నమ్మి కామియై
పాడి యెఱుంగలేని నృపు బల్కుల బట్టి యరణ్య సీమకున్
బోఁడిమి వీడి పోవుటకు ఘోరున యత్నము సేయ సీతనిం
వేఁడెక నను రాజ్యమును వీడకు దాయవు నీవు గావునన్॥ ౨౨౯

క. సతివలల చిక్కి జనకుఁడు
మతిచెడి విపరీతవృత్తి మహితుని నిన్నున్
పతితుని విడిచిన యట్టుల
సుతు విడువగ దలచె నిదియె సూనృత మనుదే॥ ౨౩౦

ఉ. తప్పగునేని జెప్పుమిక తథ్యమె బల్కెద రాముడెప్పుడేన్
దప్పొనరించె నంచనుచు తద్దయు బల్కెడు వాడు గల్గెనే
గొప్పయొ కొద్దియో నరుడు తప్పొనరించని వాడు భూమిపై
యొప్పఁగలేడు రాముఁడిట నొక్కఁడె గల్గె ధరాతలంబునన్॥ ౨౩౧

ఉ. రామునిఁబోలి నేనెపుడు చిక్కని యుండుట చేత జెప్పెదన్
మాయయు మర్మము న్భయము మాటల చేతల లేదు లేశముం
బాయడు సత్యధర్మముల భక్తిని పూజ్యుల గొల్చు నెప్పుడున్
ధీయుతు నీసుతున్ విడువ ధీరుడు దల్చెను బుద్ధిమాంద్యతన్॥ ౨౩౨

క. దేవతలు మెచ్చువానిని
గావగ రిపునైన గరుణ గలిగిన వానిం
భూవరుడు లిప్త సెల్పక
పోవలె నడవి కనిన పోవగవలెనే॥ ౨౩౩

ఉ. తెల్లముగాదె లోకులకు తెంపున ధర్మము వీడి యిట్టనన్
జెల్లునె నీతిశాస్త్రములు చెచ్చెర బోయెనె రాచబిడ్డడో
తల్లియొకండు లేడటవె తాలిమి బట్టగ బాడబుండటె
పొల్లులు పల్కువాడనటె ఏదునె చాపము రిత్తనైతునే॥ ౨౩౪

గీ. అనుచు వల్లన లక్ష్మణుడన్న గనుచు
గరుణ నాయందు గలిగిన కారణమున
వినుము నామాట విశ్వాస విధినిరామ
భయము భక్తియు నీయెడ బాయలేను॥ ౨౩౫

చ. వినపడకుండ నెవ్వరికి విశ్వము నేల ననుగ్రహింపుమీ
ఘనమగు నీదు శాసనము కాశ్యప యంతయు సమ్మతంబునన్
వినయముతోడ బూను నిక విన్నప మొక్కటి యాలకింపుమీ
ఘనమగు చాపము న్గొనుచు గాచెద నీకొక యస్త్రమున్నదే॥ ౨౩౬

ఉ. భానుసమానతేజ శర భారము చేతను లోక మంతయున్
కానన మట్లు నిర్జనము గాగను జేసెద నాతలోన న
న్నేనరుడైన కైకసుతు నేపునగూడి యభిక్రమేచ్ఛచే
బాణముచేతబట్టినను బ్రాణము బోవగ జేతు వానినిన్॥ ౨౩౭

క. తనయాలి మాటచేతను
తనయుని నినువీడి దారితప్పిన తండ్రిన్
గనికరములేక గట్టుదు
వినుమది గాకున్న జెరను వేగమ దోతున్॥ ౨౩౮

చ. విను మొకమాట జెప్పెదను వేడబ మేమియులేదు నిక్కమౌ
ఘనమగు వహ్ని నేనియును గానకు నైనను రామచంద్రుతో
మునుజనువాడ గాదనిన మూడు జగంబుల గెల్చి దర్పిరో
మనునృప రాజ్యపీఠమున మాన్యుని నిల్పెదు రామచంద్రునిన్॥
౨౩౯

ఉ. ఏమి దలంచి తండ్రియిక నేమిబలంబును నమ్మి నేరమే
మేమిగ జూపి వీడె నిను యేమియు గాదది కైకమాయయే
కామిత మెట్లు చేకురునొ గల్గెనె సాయమొనర్చ వారమా
రాముడు నేను వైరులమె రాజ్యము కైక సుతుండు నేలునే॥ ౨౪౦

క. అనాలక్ష్మణ వాక్యంబులు
విని దుఃఖము పొరలుచుండ వేగమ తనయున్
గనుగొని తమ్ముని పలుకులు
విని యేమని పలుకగలవొ వినగా వలయున్॥ ౨౪౧

సీ. సవతి తల్లి పలుకు జవదాటగాలేక కన్నతల్లి పలుకు కాదటంచు
దనకు నర్హంబైన ధర్మంబు విడనాడి దగని ధర్మము బూనదలచి మిగుల
సవతి తల్లికి సౌఖ్యసంగతి గలిగించి కన్నతల్లికి శోకకధలగూర్చి
తనతమ్ము కుఱ్ఱని తగుమాటలను వీడి దాయల మాటల దగిలి నీవు
గీ. బంధు మిత్రుల నెల్లను బాయదలచి
వంశమర్యాద లన్నియు వదలివేసి
యాశ్రితాళుల యాశల నడచి గలిపి
యడవికేగుట ధర్మమా ననెపె రామ॥ ౨౪౨

సీ. బడయగ బుత్రుల పడరాని పాట్లెన్నొ పడితిని కొన్నాళ్ళు భాను వంశ్య
నవమాసములు మోసి నానా విధంబుల గర్భబాధలచేత కష్టపడితి
పుట్టిన దాదిగ పుడమినేలగజూడ కోర్కెల గోరితి కోట్ల కొలది
కళ్యాణ గుణములు గలవాడ వనినిన్ను మును లనుచుండగ మురియుచుంటి
గీ. ఆశ లన్నియు నీరీతి యడవి గలసె
యవని విడనాడి యడవికి యరుగ నీవు
ఘడియ యైనను నిలువంగ గలనె యిచట
తోడు కొనిపొమ్ము వచ్చెద తోయజాక్షా॥ ౨౪౩

క. వినియుండవె కశ్యపుఁ డను
మునిఁ దల్లిని గొలిచి భుక్తిముక్తిని గనఁడే
మనమున శంకల దక్కుమ
జననొల్ల ననుజ్ఞయిడను చాలును నిలుమీ॥ ౨౭౪

సీ. నినుబాసి నివసింప నిముసంబు నోర్వను యన్నంబు నాకేల నన్నె
మేల
నీరము యసువులు నియతియు నాకేల సౌఖ్యసంపద లేల సఖ్య
మేల
సత్యంబు ధర్మంబు సత్వంబు నాకేల పెద్దల పిన్నల పేర్మియేల
బంధులు మిత్రులు బలగంబు నాకేల కాయము గేహము కల్గనేల
గీ. నీవు గలిగిన యువియన్ని నిలుచు నాకు
నీవు లేకున్న నిముసంబు నిలువబోవు
నీవు గలిగిన నిలయంబు నిలయ మగును
నీవు లేకున్న నిలయంబు నిరయ మగును॥ ౨౭౫

క. నామాట వీడి యడవికి
రామా నీవేగితేని రౌరవ నరకం
బేమాఁదిరి పోవున్నో
యీమాతృప్రాప్తదుఃఖ మీఁగని కతనన్॥ ౨౭౬

క. నేనింట నిటుల నేడ్వఁగ
గానకు బోవంగ నీవు గడగుట తగునా
మానుమురు మాన వేనియు
బూనుదు ప్రాణంబువిడువ భూవరతనయా॥ ౨౭౭

క. కటతటమున బాష్పంబులు
పటుగతి ముత్యాల సరుల పరువున బడగా
చటులార్భటి బహుళదుఃఖ
స్ఫుటితాత్మను తల్లిజూచి సువ్రతు డనియెన్॥ ౨౭౮

క. తల్లీ ధర్మ మెరుంగుదు
 వుల్లంఘింపంగ తండ్రి యుక్తుల దగునే
 యుల్లంబున బరికింపుము
 చల్లగ నాకాజ్ఞ యిడుము సాగిలి పడుమున్॥ ౨౮౯

సీ. జనకుని వాక్యంబు చయ్యన గైకొని గడతేర్చె గోవును కండుమూని
 జనకాజ్ఞ భూమిని సాహసమునదర్పి జంపిరి జంతుల సగరులెల్ల
 దనతండ్రి యాజ్ఞను దనతల్లి కంఠంబు పరశువుచేద్రుంచె భార్గవుండు
 మతిమంతులెందరో మహితమౌ జనకాజ్ఞ కావించి కాంచిరి కాదె యశము

గీ. గనుక నెప్పుడు పూర్వులు గన్న త్రోవ
 బోదు మార్గంబు విడనాడ బోను నేను
 జనకువాజ్ఞను కానకు జనుదు నేను
 నిశ్చయంబుగ జెప్పితి నిర్ణయంబు॥ ౨౯౦

ఉ. తమ్ముడ లక్ష్మణుండ విను ధర్మము సూక్ష్మము దాటశక్యమా
 సమ్మతి నాదు మాటలను జక్కగ యోజనజేసి చూడుమా
 నెమ్మది నీదు విక్రమము నెమ్మియు నాకిట గొత్త లయ్యెనే
 సొమ్ములె నీకు శస్త్రములు సోలరె నీకెదిరించి దేవతల్॥ ౨౯౧

ఉ. తల్లియు నిట్లు దుఃఖమున తాల్మి యొకింతయు లేక గుందగా
 జెల్లునె నీకునిట్లనుట చేతము చిక్కగ బట్టి ధర్మముం
 దెల్లము గాన ధైర్యమును దెంపుగ బూనుచు కార్యజాలము
 లొల్లము గాగ జేయుటకు మోదముతో దగు రీతి జెప్పుమీ॥
 ౨౯౨

సీ. ధర్మమలంఘ్యంబు ధర్మము సేవ్యము ధర్మము గాపాడవలచవలయు
 ధర్మ రక్షకుడైన తండ్రియానతిదాట ధర్మంబుగాదని దలుపవలయు
 తండ్రి వచనమును తల్లి వచనమును విప్రునివచనము వేడ్కజేయ
 నంగీకరించియు నదిజేయకుండుట దగదని మదిలోన దలచుమెపుడు

గీ. తండ్రిమాటల మన పినతల్లియాజ్ఞ
ననుమతించితి దప్పగ నర్హమగునె
దగదు ధర్మంబు దయను వీడ
దలప బోవకు నామాట దలపు మెపుడు॥ ౨౫౩

క. కనికరమున తమ్మున కిటు
లని కరముల మోడ్చి తల్లి యమలాంఘ్రులపై
దనశిరము జేర్చి మ్రొక్కుచు
జననాథుని పెద్దకొడుకు చయ్యన బలికెన్॥ ౨౫౪

శా. అమ్మా కానన సీమ కేగెదను నా కాజ్ఞం బ్రసాదింపవే
లెమ్మా దీవన లిచ్చి బంపుటకు మేలే యిట్లు చింతించుటల్
తెమ్మా యక్షత లిమ్ము రక్షల దయన్ తెమ్ము వేమాలికల్
యిమ్మా విప్రుల కెల్ల నిష్టముల నా కిష్టంబు సిద్ధింపగన్॥ ౨౫౫

చ॥ మగుడగ నేనువచ్చెదను మానవనాథుని మాటచెల్లగా
వగవకు నేను తమ్ములును వైశము నీవును తల్లులందరుం
జగమున గల్గువారలును చయ్యన నాతని మాటదాటగా
తగదని నమ్మిమీ జనని తత్వ వివేకము నీ వెరుంగవే॥ ౨౫౬

గీ. అర్థవంతము ధర్మమై యమలమైన
తనయ వాక్యంబులెల్లను తల్లి వినుచు
శోకసంతప్త హృదయమై సోలి ధరణి
తెలిసి దైన్యంబు దోపగ దెలిపె నిటుల॥ ౨౫౭

సీ. తల్లి దండ్రుల లోన తల్లిని మొదటను వేదంబు బలుకుట వినవె నీవు
నవమాసములు మోసి నవ్యబాధలకోర్చు తల్లినియిటుబల్క తగునె నీకు
పతితుల గురువుల బరగ విడువవచ్చు తల్లి పతితయైన తగదు విడువ
యనుటచే తల్లియే యధికయం చనిగాదె ధర్మశాస్త్రంబులు దాని జూపె

గీ. యిట్టివన్నియు యోచించి యెటులనైన
యింట నుండుము కానకు నేగ బోకు
భరతు డేలును రాజ్యంబు భవ్యగతిని
బ్రతుక గలమయ్య మనమెల్ల భానువంశ్య॥ ౨౫౮

గీ. యింట నుండుట కైక కనిష్టమేని
యడవి కేనును జనుదెంతు నచటనుండ
కాల మెట్టులో గడపగ గలము మనము
కష్టసుఖముల నొకరీతి గనగ గలము॥ ౨౫౯

శా. రామా! నీవిటనున్న కాలమున నాప్రాణంబు నిల్చుంజుమీ
యీమాత్రంబునకైన నోచనటరా యిందేమి దోసాబురా
వేమారుం బతిమాలుచుండగను నీవేయిట్లనంజూడగా
నే మార్గంబున బోదు స్వర్గసుఖల న్నేనొల్ల ప్రాపించినన్॥ ౨౬౦

చ. కౌరవుల చేతబట్టుకుని కోపవశంబున తన్నుబట్టగా
పరు లరికట్టగా కరియు పల్మరు వారల లెక్కసేయకే
బరువడి నిచ్చబోవుగతి భానుకులుండు దయాకులాత్ముడై
యరుగుటకే దలంచె పరమార్థము నస్థిరధైర్యమెట్టిదో॥ ౨౬౧

చ. తను వతికంపము న్దవిలి ధాత్రిని గూలిన తల్లిహోరునన్
కనులను కుండె డశ్రువులను గార్చెడి తమ్మునిజూచి ధీరతన్
మనమును జిక్కబట్టి నిజ మానస వృత్తిని ద్రిప్పకుండెనా
ఘనుడగు రాముడొక్కరుడె గాకిలసన్న్యులు నిట్టులుందురే॥ ౨౬౨

ఉ. తమ్ముని జూచి రాముడను దమ్ముడనీవిటు లేడ్చి దల్లితో
నుమ్మలికంబు గూర్చెదవె యూరట మొందుము ధీరులిట్టిరే
నెమ్మది నీదు నెయ్యమును నేర్పు పరాక్రమ కేళీ వింతయే
నమ్మము దాట ధర్మమును నాపయినొట్టుర సమ్మతింపరా॥ ౨౬౩

చ. విను మతీశ స్తధర్మమిది వీడను దీనిని విత్త వాంఛయే
ఘనరిపు వర్గదాయకము కామము కేవలమైన నింద్యమా
గనగు ధర్మమొక్కటియె గల్గదు సేగి యొకింత దానిచే
మనమున బూను నామతము మానుము కోపము లోభ శోకముల్॥
౨౬౪

చ. విడువక ధర్మమూని నను వింతగ గల్గును విత్తకామముల్
పడతి పతివ్రతాత్వమున భర్తకు ధర్మము కామసౌఖ్యము
ల్గనువడి సత్సుతోదయము గాఢపుప్రేమయు సంతసంబునుం
గడనయు గూర్చునట్టులనె గావున ధర్మమె శ్రేయమన్నిటన్॥
౨౬౫

చ. జనకుడు పెద్దవాడు మనుజాధిపు డార్యుడు గిక చేతనో
మనసిజ బాధ కోర్వకనో మాటకు మాఱట గల్గదంచునో
దనసుతునన్ను నిట్లనుప దానివి జేయక పోతివేని నే
దనయుడనే నృశంసుడను ధర్మ విధూరుడ గానె లక్ష్మణా॥ ౨౬౬

గీ. కార్యమిది యకార్యంబని గణన జేయ
దనచ బోకను గర్వించి దారి దప్పి
యున్నవాడైన గురుడెప్పు డుచితభంగి
పూజ్యుడగు వాని వాక్యంబు పూజ్యమగును॥ ౨౬౭

చ. ధరణివిభుండు జేయుమను దానిని నే నెటు జేయకుండెదన్
భరతుడు తల్లులందరును బాలుడు దమ్ముడు నీవు నేను నా
ధరణిపు నాజ్ఞ నించుకయు దాటుట యుక్తముగాదు తల్లికిం
బరమహితంబు ధర్మమును భర్తయె భార్యకటంచు దెల్పుదురా॥
౨౬౮

చ. వనితకు భర్తయేసుగడ వల్లభుడూపిరి తోడనుండగా
ననిశము సేవజేయవలె నాతని వీడుట యొప్పదెపుడున్
తనయులకోటి యిచ్చినను తద్విభు డిచ్చెడి భాగ్య మబ్బనే
తనయునికంటె పూజ్యుడగు తత్పతి దేవత గాంచ సాధ్వికిన్॥ ౨౯౯

చ. వనమున కేను బోయెదను స్వస్త్యయనం బొనరించ వేయికన్
జనకుని యాజ్ఞదీరగనె చయ్యన వత్తు యయాతి యట్టులన్
గనుగొను సుప్రసన్నముఖ కమ్రవిలోచన దృష్టి నింపుగా
మనమున తీర్ణసత్యునిగ మాతరొ దల్చుము ప్రేమ తోడుతన్॥
౨౨౦

ఉ. భోగము గోరి ధర్మమును పోకడబెట్టి యశంబు గూల్చనే
నాగని యాశకట్టుకవడి యర్థము గోరుచు రాజ్యమేలగా
నేగతి బూనువాడ నొకొ యేర్పడ బల్కుము తుచ్ఛమైన యీ
భోగము కాయమాయువ నభోపుర తుల్యము గోరరు పెద్ద లెప్పు
డున్॥ ౨౨౧

చ. కొములుచునున్న నిప్పువలె కోపతకాల భుజంగ ముట్టులం
బొమముడి వక్రమంతటను బొల్చిన కన్నులు రోషభీషణం
బమురుచునున్న తమ్మునిగని యద్భుత మందుచు రాముడిట్లనున్
శమమును బొందుమీ యిపుడె శాంతమె భూషణమంచు నెంచుమీ॥
౨౨౨

చ. వగపును మానము న్నుపయు వైరము బూనకు బూను ధైర్యమున్
దగ దవమాన మంచనకు తాల్మి వహించుము రాజ్యమేలు టే
సుగతికి మూలమంచనకు నేగినె తమ్ముడు రాజ్యమేలినం
పగతురె తల్లి దండ్రులిట పంతమె తమ్ముని సైని లక్ష్మణా॥ ౨౨౩

మ. జనునే రాముడరణ్యసీమ కనలే సౌమిత్రి పోనిచ్చునే
జననేనంచు వచించుటే నిజమొయా సందేహ మింకేలనే
యని భీతిల్లెడి కైకకే యిపుడునే నానంద సంధాయినై
వనికిం బోయెద బంపుమీ యనుజ నీవవ్యాజమౌ భక్తిచే॥ ౨౭౪

క. పలుమాట లేల తల్లికి
పలికితినే తండ్రికెపుడు పరుషము చెప్పమా
పలుకగ లేదను కుంటిని
పలుకుము నీవైన నిజము పరమార్థముగన్॥ ౨౭౫

ఉ. చాలుదు నీవు రాజ్యమును చాపము చేతను గూర్ప తమ్ముడా
చాలరు నిన్ను గెల్వగను సాహసవృత్తిని శత్రులెవ్వరుం
చాలుదు నేను రాజ్యమును చక్కగ నేలగ సాధువృత్తిచేఁ
చాలను తల్లిదండ్రి నుడి సత్యము ధర్మమువీడ లక్ష్మణా॥ ౨౭౬

చ. సగర నృపాల పాలితము సాగర మేఖల నేల గోరినే
నగణిత ధర్మ మార్గమున నవ్యయ సత్సుఖ భోగవాంఛచే
నగరపు తుల్య రాజనకు నవ్య పరాభవ మంద జేసి యే
పగిదిని జూతు భూజనుల పార్థివ లోకము సిగ్గు నొందకన్॥ ౨౭౭

క. చీరజటాజిన ధారిని
దారుణ వనమార్గగతుని దనకన్నులతోఁ
వారక గనుగొని రాముని
తీరుగ చెయివేచి కైక తీరును నిద్రన్॥ ౨౭౮

గీ. ఎవని కరుణ నేసిద మిత్థ మేయటంచు
దెలియ నేర్చితి నాతని తెలివి గేలి
సేయ జాలను నొచ్చిననేగి యతఁడు
నిహము పరమును గలదని నెరుగు మయ్య॥ ౨౭౯

ఉ. వాంఛను గూల్చి కైకయని వాసిగ నీమది నెంచ బోకుమీ
గాంచుట రాజ్యము న్విడచి కానకు నేగుట దైవి కంబులే
వాంఛల బోలి కార్యముల వైఖరియుండదు దైవ మట్లె యా
గాంచగ లేదె వాసవుడు కష్టములెన్నియొ రాక్షసాళిచే॥ ౨౮౦

క. దైవప్రేరిత మిదియని
దేవికి యీగుణము గలుగ దెల్లంబయ్యెన్
గావున నేనిటు దలచితి
భావింపుము కైక పూర్వ భావము నీవున్॥ ౨౮౧

క. భేదము నెరుగ నేనెపుడు
సాదరమున నన్ను జూచి సలుపును హితవున్
మోదము గూర్చుచు దశరథ
భూదయితున కెపుడు బలుకు భూమిజ గుణముల్॥ ౨౮౨

చ. భరతుని కంటెనాయడ నె భావమునందున ప్రేమ హెచ్చుగా
వరలుటచేత భక్త్యముల బంపుచు నాకధికంబు గానిడున్
మఱచితి వేమొ నాకిదియె మంచిగ నవ్వుచు జెప్పుచెప్పుచున్
పరిణతి యిట్టిదౌట కెది భావన జేయుము దైవమన్య మో॥ ౨౮౩

చ. ఒకపరినేను తమ్ముడు మహోత్సవమందున నిల్చియుండగా
మకుటముదాల్చు రామనృపు శీర్షమునందుననుంచు మంచుదా
ప్రకట సువర్ణ రత్నరుచి భాస్వరశీర్షక మంపిభూషితుం
వికసితనేత్ర కైకనను విస్మితయై గని సంతసింపదే॥ ౨౮౪

చ॥ భరతుడు తల్లిచన్గుడువ బాలులతోడుత నీవునేను నా
భరతుని బిల్వబోవగని బాలుని దింపుచు నన్ను గౌగిటం
మురియుచు నెత్తిముద్దిడుచు మూర్కొని కోసల సార్వభౌమునిం
భరతుడ నీవు లక్ష్మణుడు భక్తిని తమ్ముడు గొలుండంచనున్॥
౨౮౫

గీ. తల్లులందరి యందున తారతమ్య
భావమిసుమంత లేదని బలుకనేల
నీకు దెలియని దేదియు నిశ్చయముగ
లేదు లేదని బల్కెద లేశమైన॥ ౨౮౬

సీ. నాతల్లికంటెను నాపినతల్లియె గయ్యగ్గలునదియని దలతుమదిని
దయయంత యిట్టుల దప్పుట కేదెన తప్పునాయందున దడయలేదు
సత్కులమందున సద్గుణములకేడ సాధ్విసైనట్టి సాధుశీల
భర్తనుపీడించి బాధలబెట్టెను కారులనన్నిటన్ కసరిబలికె

గీ. దిట్టమైయిట్లు కట్టడి తీరుదగుట
దైవికంబని నీవేల దలచవయ్య
దైవపౌరుషముల హెచ్చుప్రైవమయ్య
దైవమును గెల్వజాలము దైన్యమేల॥ ౨౮౭

క. కాగలది కాకయుండదు
కాగలదేదో కానిదేదో గానగ వశమా
కాగలదిటులను టెట్లగు
కాగలదని నమ్మినదియె కాకుండుటచే॥ ౨౮౮

క. దలచినది దలచినట్టుల
నలవడుగద కొన్నిచోట్ల నలవడిలేకన
దలచినది దలచినట్టుల
నలవడబోదెంత ధీరుడలజడిపడినన్॥ ౨౮౯

ఉ. యోచనజేయ హేతువయు నొప్పుగదోచను దోచుదైవమే
వాచిక కాయికంబులను వాసిగ లేదపకార మామెకున్
కాచము కాంచనంబుమది గాంచెద తుల్యముగాగ నెప్పుడున్
యీచరితంబిదేలనోకో యేటికో వైరముపుత్రుపాలిటన్॥ ౨౯౦

ఉ. కావున దైవమే యఖిల కారణ మంచు దలంచు మెప్పుడున్
నీవొక వేళ పౌరుషము నేర్పుగ జూపెదనన్న నెగ్గునే
దైవముకన్న పౌరుషము దల్పకు మెక్కుడటంచు తమ్ముడా
దైవము తోడి పౌరుషము దల్పుము కార్య కరంబు గామదిన్॥

౨౯౧

సీ. కార్య ఫలముకంటె గనపడరాదేడ దుర్జయమెంతటి దోర్బలు
నకు
చింతింప గారాదు చెడకురాదు నెప్పుడు మహిమ తెలియరాదు
మాటపడదు
సకలమునకు తానె సద్ధేతు వైయుండు తనకు హేతువు లేక
తనరుచుండు
తరతమ భావంబు తప్పక గల్పించు జంగమ స్థావర జన్మ గూర్చు

గీ. పట్ట బోయెడి వారికి పట్టుబడమ
తెలియగోరెన వారికి దెలియకుండు
జీవ కోటుల నటనకు జీవగఱ్ఱ
దైవ మొక్కటె గలదని దలపు మెపుడు॥ ౨౯౨

సీ. పుట్టుట గిట్టుట పూజల నందుట సౌఖ్యము కష్టము సత్వచయము
కోపము తాపము క్రోధము లోభము శాంతియు దాంతియు
శమము దమము
లాభంబు నష్టంబు లావును హైన్యము మదమును మోహంబు
మత్సరంబు
జ్ఞానంబు దానంబు సంతోష దుఃఖముల్ శౌర్య ధైర్యంబులు
శక్తి యుక్తి

గీ. దైవ వశమున గలుగును దైవమొకటె
మూల కారణ మంతకు మూఢ మతులు
చెరుప బెనుపంగ గలమని చెప్పు చుందు
రదియు నిదియును సున్న యే యనగ వలయు॥ ౨౯౩

సీ. అగునని దలచని దగుచుండు నెట్టులో కాదను నదియౌను కాల గతిని
ధర్మాత్ము లనువారె దగని దుఃఖము నొంద దుర్మార్గులభివృద్ధి తుష్టులగుట
రిక్తులు ధనికులై రిక్తులై యిభ్యులు సార్వభౌము లరణ్యాచారులగుట
కూలిని జీవించు కూళలు రాజులు రాజు లుదాసులై రక్తి చెడుట

గీ. పరమ యోగ్యులు పడరాని పాట్లబడుట
దెలివి గలవాడు రిక్తుడై దేబె యగుట
పరమ బంధులు వైరులై పరగు చుంట
దైవ వశమని మదిలోన దలప వలయు॥ ౨౯౪

క. నామతము ననుసరింపుము
పామరులను బోలియిట్లు పలవింతువయో
యీమమత విడువ వేమొకో
మామక పట్టాభిషేక మహితాసక్తిన్॥ ౨౯౫

క. ఈనిశ్చిత వృత్తిని నే
గానగ నభిషేక ఖేటుల గకవికమైనన్
మానసమున వగపు నేమియు
గానను నేనడవికేగ గడగెద నిపుడే॥ ౨౯౬

చ. వగవకు రాజ్యప్రాభవము వాసె నటంచు మనంబు నందునా
కగణిత రాజ్యభోగము మహావనవాసము నొక్కరూపుగా
నగపడు గాన నుండుటయె హాయిని గూర్చు ప్రియాప్రియంబులే
కగలిని చూచుటే సుఖముగాక మరొక్కట హాయిగల్గునే॥ ౨౯౭

మత్తకోకిల. నన్ను తాత్మక రాజ్యలక్ష్మికి నడ్డుబెట్టెను కైకయం
చెన్నబోవకు కారులాడకు హేతువింతకు దైవమే
యన్నలంతుక నిట్టిమాటల నాడజేసి యరణ్యము
న్నన్ను బంపగ జాలెనెంతటి నాట్యమాడెనొ చూడుమీ॥ ౨౯౮

క. అనిబలుకు రాము మాటలు
విసిలక్ష్మణు డధికశోకవేగము చేతన్
వినమిత మూర్ధుండగుచును
గనుగొన ముఖమంత గనులు గాగనిపించెన్॥ ౨౯౯

సీ. ఆరయగ నిష్కుట స్థాళీవిషంబన నధిక రోషంబున నట్టిరోజి
కుటిలమౌ భ్రూకుటి చటుల నిటాలంబు నందున నాట్యము నమర జేయ
క్రోధసింహపుమోము కోపున వక్త్రంబు చూడశక్యముగాని సొగసుమీర
గజహస్తమట్టుల గరమును ఝూడించి పళ్లను పటపట బలిమి గొరికి

గీ. ద్రష్టలకునెల్ల గలిగించి దగనిభీతి
నడ్డముగ దన కంఠము నట్టె ద్రిప్పి
చూపుకొనలను దనయన్న జూచి యధర
మదర కనుదోయి కెంపుల నలర బలికె॥ ౩౦౦

ఉ. ఎంతకు నైనజాలుదు వదేమిగయో దైవము దైవమంచు నీ
వెంతయొ జెప్పుచుండెద వదే యసమర్థపు దైవమున్నానిం
చెంతకు నీసి యూస్నితము సిద్ధివహింపగ జేయుగానిదా
పాత్రము బూని బంటువలె పారక నిల్వగ నేర్చి యుండునే॥ 301

ఉ. పాపవటంచు బల్కెదవు పాపులనాదృతి జేయుచున్నచో
పాపముగల్గునే నిజము బల్కుము యోచన జేసి గట్టిగా
పాపమురాదె గట్టుచను పట్టమటంచని గట్టుకుండెనన్
పాపపుబుద్ధి నన్నిటుల పంపుట ధర్మమె తండ్రిచేసినాయో॥ 302

సీ. బలిమిని మచ్చిక బలినూలి నూయలు ఘడమిని వేడెదు పుత్రునకును
పదుగురు వినుటకు పలికెను శ్రీరాము చంద్రుడు రాజని సచివులకును
వరములు పూర్వము వాసిగనిచ్చితి నవియిప్పుడిమ్మనె యబల
యనియె
యిట్టి యాడంబర మీరీతి చేయుచు మోసముజేసెనుముదుక డితడు

గీ. మాయనెరుగవు ధర్మంపు మాటదలతు
వెవరు నెరుగని వరముల నేర్పరించి
పదుగు రెరిగిన ప్రతినను పాడుజేసె
ధర్మకంచుక ధారి యీ దశరథుండు॥ 303

క. లోకులిటు జూచుచుండగ
నీకుట్రనుబడక నుండ నిష్ఫడెనిన్నున్
శ్రీకలితు జేయజాలనె
నాకరముల కేదురె నాకనాయకుడైనన్॥ 304

గీ. తల్లిదండ్రులు జేయగా తగనియిట్టి
పనులు జేయుచు పుత్రుల బాధపెట్టు
కామదాసు లనగనొప్పి కారులరచు
తల్లిదండ్రులు పేరుకు తగినవారె॥ 305

ఉ. దైవము గూడ ధర్మమును దప్పనివారల మెచ్చు గావునన్
దైవము నాకు తోడ్పడును ధర్మము జ్యేష్ఠుని రాజ్యమేలుటే
దైవబలంబు దోర్బలము దాల్చిన నాకిట నడ్డమున్నదే
దైవము నీవె నాకెపుడు తమ్ముని యందున బూనుమీ దయన్॥ ౩౦౬

ఉ. దైవబలంబు లేకుఁకి తాపక పట్టముకట్టబూఁడా
భూవరుడంచు బల్కెదవు భూరిభుజాబల విక్రమంబునన్
దైవము గెల్చి రాజ్యమును తావకబాహుబల నిల్వజేసెదన్
దైవమె పౌరుషంబునకు తక్కువయాంచు జనంబులెంచగన్॥ ౩౦౭

శా. అన్నా పట్టము నీకుగట్టునెడ నాకాధీశ ముఖ్యాహితుల్
సన్నాహంబున యుద్ధభూమి నెదురించం జేర శస్త్రాళిచే
ఛిన్నాభిన్న శరీరులై శరణునిం జేరంగ వేజేసి యా
పన్నత్రాణధురీణుడన్బిరుదు సంపన్నంబు నొందించెదన్॥ ౩౦౮

ఉ. ఏమిమొదల్చి దేవవరులేపున తీవ్రతసన్నుదాకగా
భూమికి నేగుదెంచినను బోమనె వారల గెల్వనేరనే
మామక చాపనిర్గళిత మంగళ బాణ పరంపరాహతిన్
క్షేమము లేక పారగని చేరగ నేర్తురె యన్యభూభుజుల్॥ ౩౦౯

చ. భరతుడు రాజుగాడెప్పుడు పాలితులాతని వంశ్యులెల్లనీ
వరమర లేక రాజ్యమును వారిరినేలి యనంతవర్షముల్
బరహితవృత్తి కానలకు భవ్యతపంబొనరింప నేగిరన్
పరసగనీదు పుత్రులట వల్లభు రాదురు వారిపుత్రులున్॥ ౩౧౦

సీ. కమలగర్భసమాన కౌశిక కారుణ్యాభ పదుపదిష్టాస్త్ర భవ్యకలన
దివిజమనుజదైత్య దివ్యాస్త్రవితతిని నిస్నిద్రతను గెల్వ నేర్తునేను
ధర్మపథము బూని ధనువును చేపట్టి పట్టాభిషేకంబు పరగజేతు
గురువులు మంత్రులు గూర్తురునీ కెప్డు కార్యసిద్ధియు వేగ గలుగుసుమ్ము

గీ. మనువు మొదలిడి నేటికి మహితయశుల
జ్యేష్ఠపుత్రుడు రాజుగా జెలగుచుండ
భరతుడిపు డెట్లు రాజ్యంబు బడయగలడు
రాజ్యభారంబు బూనుము రామచంద్ర॥ ౩౧౧

సీ. జనకాజ్ఞ కానగు జనుట నిశ్చయమేని ప్రతినిధిగా నన్ను బంపుమిపుడె
వనమున పదునాల్గు వర్షములుండెదు నీమాట నిన్నెప్డు ప్రేమ గొలుతు
కాదేని రాజ్యంబు కరుణించి యేలుము కార్యక మేగూర్చు కార్యమంతె
కైకేయి కోర్కెల గణన జేయగ బోకు దశరథ వాక్యంబు దలచ బోకు

గీ. సర్వ సర్వం సహాచక్ర సాధుజనులు
భావుకంబగు భవదీయ పాలనంబె
మదిని గోరిరి మంత్రుల మతము నిదియె
మనవి గైకొను బహుజన మతము గొనుము॥ ౩౧౨

క. నీపాద సేవకుండను
భూపాలన మెటులనీవు బూనెదొ చెపుమా
చాపాయుధ ధారుడనై
కాపాడెద జెప్పినటుల కార్యము దీర్తున్॥ ౩౧౩

ఉ. తమ్ముని మాటలన్నివిని తన్నయు నొక్కత బాష్పధారలన్
సమ్మతి చేతులన్నుడిచి చక్కగ కౌగిట జేర్చి కానకుం
బొమ్మని పల్కె తండ్రియటు బోవుటె ధర్మము పోడిమిప్పుడే
యమ్మల నందరం గొలిచి యాదర వృత్తిని నుండు మిచ్చటన్॥
౩౧౪

వ. అపుడు కోసలరాజపుత్రియగు కౌసల్య

చ. తనయుని వాక్యముల్ జెవుల దట్టిన కోసలరాజపుత్రికా
ననమున కేగుటే నిజము నానుడి బోవదటంచు నెంచుచు
న్ఘనమగు శోకవేగమున గ్రాగిన చిత్తము తత్తరింపగా
తనయుని జూచి దైవమిట తప్పదలంచె నికేమి చేయుదున్॥ ౩౧౫

సీ. నాదగు శోకాగ్ని నాగర్భమందున జనియించి భవదదర్శన సమీర
ణమున పెచ్చుపెరిగి నాదుఃఖ శుష్కేంధనసంచయమున వృద్ధిజాల పొంది
బాష్పాహుతులచేత బయలకు వ్యాపించి చింతోష్మధూమమై చిత్రగతుల
నిశ్వాస పీడల నిబిడమై గ్రీష్మార్తి నెండిన పొదలను నేర్చి కారు

గీ. చిచ్చుబోలుచు నీరుగా జేయు నన్ను
గాన లేగను వెన్నంటి గవయు గోవు
పగిది వత్తును గొనిపొమ్ము భవ్యవనికి
యనిన తల్లికి రాఘవు డనియె నిటుల॥ ౩౧౬

గీ. కైక మోసంబు నెరిగియు గడగినీవు
కూడ దగ్గరలేకున్న కువలయేశు
డెట్లు బ్రతుకును నేనిష్టి యేగుచుంటి
గాన నీవుండు మిచ్చట గావ నృపుని॥ ౩౧౭

గీ. సతియె పతినొడబాయుగ జాలెనేని
ధర్మమొకకొంత నిలుచునే ధరణియందు
సతివి సత్కుల జాతవు సర్వ ధర్మ
తత్వ మెరుగుదు ధర్మంబు తప్పనెట్లు॥ ౩౧౮

గీ. పతిని విడనాడు నారులు పతితు లగుట
పతిని నీవెట్లు విడుతువు సతివి నీవు
మనసు నందైన దలచుట మానుదీని
బ్రతికి యుండగ పతినెప్డు బాయరాదు॥ ౩౧౯

చ. జనకుడు నీవు దేహముల జక్కగ ప్రాణము దాల్చి యుండంగా
మనమున నైన వీడుటను మానుము సాధ్వివి నీవు గావునన్
ఘనులకు భర్తృ భార్యలకు గల్గును దేహవిభేదమాత్రమే
మనమున గల్గు ద్వంద్వసమ భావము ప్రాణను ప్రవృత్తి యున్॥
౩౨౦

క. సకల సద్గుణ గణుడౌ రాజ
నక సుతాపతి పలుకులను నారీ తిలకం
బకలంక గతిని విని సుత
యిక పతిసేవల జేయగనిట నేనుందున్॥ ౩౨౧

వ. అని తల్లి బల్కిన వాక్యంబులు విని దశరథ పుత్రుండగు శ్రీరామచంద్రుడు

చ. జనకుడు భర్తరాజు జన జాలము కెల్ల సగ్రీశ్వరుండగు దా
నొక పనిసేయ నాజ్ఞనిడ నోపక జేయక మాన జాల నే
నిక జని దండకాటవిని యుండి తపంబును జేసి వేగమే
నికటము జేరి పాదముల నిశ్చల భక్తిని గొల్చియుండెదన్॥ ౩౨౨

క. శ్రుతి తతియు స్మృతితతియును
హితమిటు జెప్పంగ గల వహీన గుణాఢ్యా
మతి నూహింపుము పూర్వులు
పతితోడిదె లోకమనుచు పాటులు పడరే॥ ౩౨౩

ఉ. కావున నీవు నిచ్చటనె కాంతుని సేవల జేయుచుండుమీ
భావుక మిద్దికాంతలకు బాయగనొప్పదు ధర్మమెప్పుడుం
నీవు సమస్త ధర్మముల నిర్ణయ మెల్ల నెరుంగు దానవే
హేతువుగాని గన్పడదు హేయముసూ పతీవీక్షి యుండినన్॥ ౩-౭౮

వ. మరియు నియత వ్రతంబుల నాక్షేమంబ గోరుచు భగవంతు నారాధించుము. తీర్ణప్రతిజ్ఞుడనై నేనేగుదెంచు. నందాక నా జనకుండు సుఖియై జీవించి యున్న మనకపరిమితానందంబు గలుగునన కౌసల్య తనతనయునిగని నాయనా! కాలంబు సర్వశక్తిమంతంబు. దానిని నాపువారెవ్వరును లేరు. సర్వంబును కాలవశంబున జరుగునుగాన నీమనంబును నేను మరల్పజాల, జనిరమ్ము. నేనేకాగ్ర చిత్తనై నీక్షేమంబునకు నియమవ్రతంబుల నాచరించెద. నీకు శుభజయంబులుసిద్ధంబులు. వామనుడై దనకీర్తుల నఖిలలోకంబుల నాక్రమించిన హరియట్లు నీకీర్తియు సకల లోకంబుల నాక్రమించుగాక యని దీవించి యార్ద్రాక్షతలు శిరంబున నిడి మూలికల విశల్య కరణిని రక్షగట్టి మంత్రంబుల జపించి శిరంబును మూర్కొని ప్రేమపరత నాలింగన మొనర్చి పరితుష్టవోలె గద్గదవాక్యాంత్రయై సిద్ధార్థుడవై సౌఖ్యము గరమ్ము. పునర్దర్శనంబగుగాక, నిష్టావాప్తి నొందుదువు గాకయని మంగళాశాసన మొనర్చిన తల్లి యాజ్ఞ వడసి యమ్మరొ సీతంగన బోయెదనని బలికి దన ప్రియురాలింగన నేగుచుండె నట సీతామహాదేవి.

గీ. భగవదారాధనైకాగ్ర భవ్యచిత్త
సీతభర్తను గనుగొన చిత్తమందు
దలచెరాముడు చేరెను ధరణిసుతయు
సర్వసత్కార సమితిని జరిపెభక్తి॥ ౩-౭౯

వ. శ్రీరామచంద్రమూర్తి దనతల్లితోడ దనయరణ్యావాసమును గూర్చి బలికిన మనశ్శక్తియంతయు దనయనుంగు రాణియగు సీత మహాదేవింగాంచినతోడనే నేమయ్యెనోగాని కొంతదడవువరకును మాటలాడలేక తూష్ణీంభావమునువహించి యూరకుండెను పిమ్మట నెట్లనో మనస్సును కుదురుబరుచుకుని

గీ. సీతగనుగొని రాముడు సిగ్గుబడుచు
వగచె వనమునకేగగా వలసెయిపుడె
నిలువుమిటనీవు నిన్నిద్రనియతవృత్తి
పదియునాలుగు వర్షముల్బడతియిచట॥ 3.౨౬

క. అనవిని సీతరాముగని
దనకేమియు దెలియకుంట ధైర్యముతోడన్
వనశోధింపగదలచితె
వినవొప్పని మాటలిట్లు వినవర్హంబెకో॥ 3.౨౭

వ. మహాత్మా! యిదియేమి రాజలాంఛనంబుల విడనాడి పరిత్యక్తుని కైవడి నిట్లుండుటకు గతంబేమి? రాజ్యపాలనంబేమయ్యె? పట్టాభిషేకంబునకింత యాలస్యమగుటకు గతంబేమి? వనంబునకేల బోవవలసెనని హా రాదావతితంబగు మహాశోకంబు ధైర్యగరిమ నాపుకొని రాముని ముఖంబున నించుకేని వికృతిలేకుండుటకు విస్మితయగుచు నడుగుచున్న దనప్రియురాలింగని గతవృత్తంబంతయు సవిస్తరంబుగ బలికి నాజనని సన్నిధికిజేరి వినయంబున నేతద్వృత్తాంతంబువిన్నవించి తుదకెట్లులనో యనుమతింబడసి వచ్చినవాడనీవును మనంబు జిక్కబట్టి వగవక నాకనుమతి నొసంగుము.సత్వరంబుగ దండకకుబోవవలసె. నీవు సాధ్వీవ్రతవై యింట సుఖంబుగవసించి భగవత్పూజలకాలంబు గడపుచుండుమని వక్కాణించు ప్రాణవిభునవలోకించి

గీ. పేదబలికినవిధమున పేర్మివిడిచి
బలికెదిట్టుల నిదియేమి భాగ్యమొక్కొ
వినగవినగను నాకెంతొ వింతనవ్వు
గలుగుచుండెను గమలాక్ష కష్టమందు॥ 3౨౮

కం. కాలము దప్పగవశమే
కాలము గలిగించుగాదె కష్టసుఖములన్
కాలమునవశులమై మన
కాలముగడుపంగ గలము కలయికచేతన్॥ 3౨౯

కం. మనమిరువుర మొకచోటను
మనమలరగ నుంటిమేని మనసున కెపుడున్
గనపడజాలవు కష్టము
లననేమో బహుళభంగి యలవడియున్నన్॥ 330

చ. తనయుఁడు తండ్రిసోదరుడు తల్లియు కోడలు నాత్మభాగ్య సం
జనితములైన కార్యఫలసారము నొందుదు రందు భార్యయు
దనపతి భాగ్యభోగమును దప్పక పొందు నొకర్తు గావునన్
నినువని కేగుమన్ననను నిక్కము బొమ్మనుటే దయానిధీ॥ 33౧

గీ. కాడు జనకుడు జననియు కాడుసుతుడు
కారు సకియలు బంధులు కారు కారు
కారు సహజులు మామలు కారు సతికి
పరమునందున నిహమందు భర్తయగును॥ 33౨

సీ॰ సర్వసమయముల సర్వావస్థలయందు పతిసేవ జేయగ బడతి కగును
పతినెన్నడును బాసి సతియుండ వలువదు పతితోడునీడనై బ్రతుక
వలయు
పత్నియు భర్తయు పరికింప నొకరూపు సుఖదుఃఖ భావంబు జూడ
నొకటె
యిహామందు పరమందు నింపగు గతినిచ్చి భరియించువాడెసూ
భర్తసతికి

గీ. సతికి పతికంటె చుట్టంబు జగతి లేదు
దైవమన భర్త తగుణీకి దరచి చూడ
కనుల కగుపించు దేవుని కాదటంచు
కనుల కందని వానిచే గలదె ఫలము॥ 333

గీ॰ కాంక్షితంబుల నెల్లను కల్పతరువు
వైన నీతోడ వచ్చెద నడవికిపుడె
యధిప నీవున్న యడవియె యమరపురము
నీవు దరిలేని యూరైన నిరయ మగును॥ 334

క. జనకుని యింటను వలెనే
వనవీధుల దిరుగుచుందు వనటలు లేకన్
జనవర ముల్లోకంబులు
గనకుండ బతివ్రతంబె కాక్షంజేతున్॥ 335

క॰ పరిమిళము పుష్పముట్టుల
హరిదశ్వుడు ఛాయవలెను హరశివల వలెన్
బరువడి చంద్ర చంద్రికల
సరణిని నినుగొల్చి యుందు సతతమురక్తిన్॥ 336

క. అని బలుకు సీత గనుగొని
వనితను గొనిపోవ దగదు వనమున కనుచున్
మనమున దలచుచు మగువకు
వనమందలి కష్టములను వరసగ బలికెన్॥ ౩౩౭

క• పుట్టినది గొప్పవంశము
మెట్టిన వంశంబు గూడ మేటిది సుమిత్రా
పట్టుము ధర్మపథంబును
నెట్టుము వైషయిక వాంఛ నేర్పున నెలతా॥ ౩౩౮

క• వనవాస క్లేశంబును
వినకుండుట చేత నీవు వనమున కరుగన్
మనమున దలచుచు నుంటివి
వనితకు వనవాస మెపుడు వలవదు సుమిత్రా॥ ౩౩౯

గీ. విపిన మననేమొ దెలియవు వినుము భయము
వలన వణుకుదు రటగాన వరలెవిపిన
శబ్ద మన్వర్థ మదిగాన సఖియ నీవు
నిజగృహంబున నిలువుము నియతవృత్తి॥ ౩౪౦

క• మానవ శూన్యము సుమిత్రా
మానాధిక సింహ శునక మారణ కృత్యం
బానగ నీరము దొరకదు
కాననవాసంబు కష్టకరము శుభాంగీ॥ ౩౪౧

క• కానని శార్దూలంబులు
మానస భయదంబులైన మత్తేభంబుల్
పీనులు బగులగ నరచును
కానన వాసంబు కష్టకరము శుభాంగీ॥ ౩౪౨

క. చానరో పరిగెలు రేగులు
జానగు పల్లేర్లు ముళ్లు చండ్రలు గలుగున్
క్షోణిని పాదములుంతువె
కానన వాసంబు కష్టకరము శుభాంగీ॥ 385

క. చన్నీళ్ల మునుగవలయును
సన్నని శర్కరల నేల శయనింపవలెన్
మున్నెన్న డెరుగ విట్టివి
కానన వాసంబు కష్టకరము శుభాంగీ॥ 386

క. మానవ మాంసము దినియెడి
దానవు లంచెందరైన దనరుటచేతం
మానినులందు వసింతురె
కానన వాసంబుకష్ట కరము శుభాంగీ॥ 387

ఉ. జడలధరింపగావలెను జానకినారల గట్టగావలెన్
విడువక కొన్నిరోజులును వింతగవస్తులు బండగావలెన్
అడజడిబొంది దుంపగమి యాకులనేరి భుజించగావలెన్
అడవిని కష్టనష్టముల నొదుటగాని సుఖంబుగల్గునే॥ 388

క. రావల వదరణ్యంబున
కోవని తాగృహామునందె యుండుమమ సుఖానై
నీవిక సద్దముసెప్పకు
వనవాసమున కష్టపడుట మంచిదియాగునే॥ 389

సీ. అనినరామునిమాట లాలించి జానకి కన్నీళ్ళు కాలువ గట్టుచుండ
భవదుక్తకష్టంబు బాధగ దలచను సంతోషముననుందు సరసిజాక్ష
నీశక్తినెరుగుదు నినుజూచుతోడనె బారును మృగములు
భయముచేత
శార్దూలసింహాది సకలమృగంబుల సవిధమందుననుజూచి సంతసింతు

గీ. ఇష్టకష్టము సుఖముగా నెంచబడును
యభిలషించనిసుఖమెల్ల నగునుకష్ట
మఖలమెరుగుదు జెప్పగ నగునెనీకు
భర్తతోనున్న భార్యకు బాధగలదె॥ ౩౮౮

క. నీకడ నేనుండినచో
నాకేశుడు గన్నుదెరచి ననుగను గానునే
నీకడనుండకపోయిన
నాకముకాగలదె ప్రియము నలిన దళాక్షా॥ ౩౮౯

క. పతిదేవతయగు సాధ్వికి
పతిబాయుటగలిగెనేని బ్రతుకుటవశమా
మతినూహింపుము మత్స్యము
బ్రతుకునె నీరంబువిడిచి భవ్యగుణాఢ్యా॥ ౩౯౦

ఉ. ఎంతటివారలో నాజనకునింట వసించెడి కాలమందు సి
ద్ధాంతులు నీవెకాననలకు త్వత్ప్రియతోడుత బోదువంచు నా
చెంతనె బల్కిరట్టులనె చిత్రముగా విధికూర్చెదానినే
వింతయె వేదవాక్యమని విప్రులవాక్యము నమ్మబోలదే॥ ౩౯౧

క. సాముద్రిక మెరుగువారలు
భామిని నీవడవికేగ బడయుదు వనుచున్
రామానను గనిబలికిరి
నామనమున గోరుకొందు నరవరదాసిని॥ ౩౫౨

క. అకృతాత్ముల కగువిధమున
వికటంబులు గావుమనకు విపన్రశ్రమముల్
సుకరంబులనుచు దలచుము
సుకుమారుడ వీవుగావె శుభ్రవిచారా॥ ౩౫౩

క. ఎవరికి చిత్తమువశమగు
భవితవ్యము వారినెటుల బాధించు
అవనీశుడైన జనకుం
డవలోక్యుడు జూడనేత దగ్ధమునగుచుం॥ ౩౫౪

సీ. జలధార జనకుడు జలగ గూర్చినవాడ సన్గతి కిహామును సాక్ష్యమతికి
ధర్మార్థ కామాది దాంపత్యవిగుణకు నతిచార ముసరించ మనుచు
మనసము
యగ్ని సమ్ముఖమున నార్యులచేతను బనికన పలుకులు బదటగలవి
యడవికి నేబోదు ననుగమింపగబోకు మనుట ధర్మముగునె యుసప
సీకు

గీ. చంద్రు చంద్రిక భాస్కరు ఛాయ నగ్ని
నుష్ణముర్వని గంధంబు నుదధి తోయ
మటుల విడువను నిన్నెప్పుడంబు జాతు
నన్ను గొనిపొమ్ము సీతోడ నవ్యకరుణ॥ ౩౫౫

శా. ఈలాగుండిన చిత్తవృత్తిగని నీయిల్లాలి సద్భక్తిస
చ్ఛీలాత్మ న్పతి దేవత న్వినయ సంశ్రీయుక్త సద్వృత్తజిం
తాలోల ప్రియసౌఖ్య దుఃఖ సమతాతత్వాను సంధాన న
న్నేలా యింటవసింపుమీ యనగ నీకెట్లొప్పెనో చెప్పుమీ॥ ౩౫౬

గీ. దుస్సహంబైన దుఃఖాబ్ధి ద్రోసి నన్ను
దంటకాటవి కేగగ దలచితేని
యగ్ని విషజలముల్ దేహ మధిప వేగ
విడువగలదాన నని మది విశ్వసింపు॥ ౩౫౭

గీ. భాస్కరుని యందుగలయట్లె భవ్యతేజ
మధిప నీయందు గలదని యల్పమతులు
దెలియ నేరరు భయముచే దేవినింట
విడిచె నందురు దానిచే విడువజనదు॥ ౩౫౮

మ. నను నీతో గొనిపొమ్ము కానలకు నానందంబుతో వచ్చెదన్
వినుమా నిన్నెడనాడి యుండ నెచటం విశ్వేశ నీతోడిదే
యనఘా వాసము మార్గమందలసి నిన్నాయాసము న్బట్టనీ
మనమానందము నొంద సేవలను వేమారొప్పగా జేసెదన్॥ ౫౯

క. పచ్చిక పట్టుల నీతో
ముచ్చటగా పండియుండ ముదమావహిలున్
యిచ్చటి పరుపుల దలచను
మెచ్చెద తత్సౌఖ్య గరిమ మేలని మదిలో॥ ౩౬౦

క. ఆకులో పండులో కాయలో
నాకుం దయతోడ నీవు నయమున నిడినన్
ఆకలి దీరగ దిని మెద
నీకరణిని కాలమంత నింపుగ బుత్తున్॥ ౩౬౧

గీ. పడతిగా నన్ను నీకిచ్చె భాగ్య కాంత
తండ్రినేమంచు దైవంబె దలచె నిట్లు
పురుషులను మోహవాంఛల బూనజేయు
దేహమహిమంబు తెలియగ వెలిసిగలదె॥ ౩౬౬

క. నినుజూచి మునులు మిక్కిలి
ఘనముగ మోహంబు జెంది కౌగిట జేర్పం
మనమున గోరుచు నుండగ
వనితల పాట్లేల జెప్పవలసెనో జెపుమా॥ ౩౬౭

గీ. పౌరుషము గూడ నీయందు బరగుచున్న
వీరుడెవ్వడు నీచెంత వీక్రమిగు
పౌరుషము గల్గియుంచిన భవ్యగుణుడ
యడవి కేగుచు ననుగొని యరుగలేవె॥ ౩౬౮

గీ. పౌరుషము లేనికతమున భయము నొంది
యడవికేగుచు ననుగొని యరుగలేని
నిన్ను బాధింప ఫలమేమి నిపుణమతిని
యనుచు వలను వీడ యత్నింతు నధిప యిపుడె॥ ౩౬౯

వ అనిపలికి గద్గదస్వరంబున మాటలాడనేరక కన్నీరు మున్నీరుగ శోకించు సర్వాంగ సుందరియగు సీతామహాదేవి కపుడు

గీ. వసుమతీ పుత్రి శుభవక్త్ర వారిజంబు
విడనకుండెడి కన్నీటి వేడుములకు
వాడు వారెను జలజంబు వారిబాసి
వనజ మిత్రుని వేడికి వాడినట్లు॥ ౩౭౦

వ. అంత దయాసాగరుండగు శ్రీరామచంద్రుఁడు దన ప్రాణ ప్రేయసియగు సీతాదేవి వెతపాటున వెక్కి వెక్కి యేడ్చుచుండుట గాంచి నిలువెల్ల నీరై ధైర్యంబు నిలుపనేరక మారు బలుకుటకు గూడ నశక్తుఁడై యవశుఁడగుచు సత్వరంబుగ నిజకరంబుల జానకిఁ గ్రుచ్చి కౌగలించి యూరడించి పలికె. ఇమ్మంది నీమనోవ్యథాకారణంబగు నది స్వర్గంబైనను నాకది సమ్మతంబు గానేరదు. నీమనోదార్ఢ్యంబు బరికింప నింత బలికితిని గాని యాత్మజ్ఞుఁడు ఖ్యాతిని వలె నిన్నెప్పుడును విడువజాల గావున నీవును సత్వరంబుగ మన ధనధాన్య వస్త్రవాహనంబుల విప్రులకు ననుజీవులకు తృప్తిగ నొసంగి పయనంబు గమ్ము. నిను నాతోడ గొనిపోయెద నని బలికి గృహాంతరంబున నివసించి యున్న దన తమ్ముండగు లక్ష్మణుం బిలిచి తమ్ముఁడా! నేనును సీతయు గూడ నడవికి బోవుచుంటిమి. నీవు గృహంబున వసించి తల్లులకును తండ్రికిని సపర్యల నొనర్చుచు సుఖంబుగనుండుము. నిర్వర్తిత సమయుండనై యడవినుండి గృహంబున కేతెంచి సీతతోడ గలసి తమ్ములకు గలతోడ సుఖముగ విహరించగలనని బలికిన విని రోషశోకంబులు ముప్పిరిగొన కొంతదడవు మాట్లాడనేరక తుదకెట్లో రామచంద్రు గనుగొని యన్నా! నీమాటలు వింతగ నున్నవి. యివి యేటి మాటలు. నీవిక్కడ నున్నను మరియెక్కడ నున్నను నీకు మున్నాఁడి యుండెద నిన్ను విడిచి నిముషమైనను జీవింపనేరను. తల్లియగు సీతకును తండ్రివగు నీకును సర్వావస్థల యందును సర్వకాలముల యందును పరిచర్యల జేయుచు మీతోడ సుఖంబుగ వర్తించెద ననిన తమ్ముని నవలోకించి తమ్ముఁడా! నీతల్లి శత్రుఘ్ను నవలోకించి జీవించగలదు. నాతల్లి నీవుగూడ లేకుండిన జీవించనేరదు. గాన తల్లుల బోషించుటకును వారి నోదార్చుటకును నీవు నిలువవలెననిన యన్నా నినువీడి నేను నిలువజాలను తల్లుల బోషించుటకు నేనెవ్వఁడను. నావంటివారల ననేకుల బోషింప వారే సమర్థలు. నీతల్లి తన యనుచరులకు నూర్గురికి నూరు మహాగ్రామంబుల నొసంగె. నంతటి యౌదార్యయుక్తను నేను బోషించగలవాఁడనా?

నాతల్లికిని నీతల్లికిని గూడ యపరిమిత ధన సంపదలు గలవు గావున వారి పోషణకు మనము జేయదగిన నూతన యేర్పాటు లేమియు యవసరములేదు. నన్ను నీతోడ గొనిపొమ్ము నాకింతమాత్రపు చనువు నొసంగి నన్ననుగ్రహించి కూడ గొనిపొమ్ము. మారు బలుకకుము.

గీ. తనరుచు ఖనిత్ర పిటకాది ధారినగుచు
నీకు ముందర జనియెద నిపుణముగను
ఫలములను నీళ్ల దుంపల బాగుగాను
దెచ్చి యర్పింతు భక్తిని చెలివిత్రోడ॥ ౩౨౧

గీ. నీవుసీతయు గిరులందు నిశ్చలముగ
దిరుగవచ్చును కాచెద ధీర వృత్తి
నీవు నిదురించ మేల్కాని నియతముగను
సకల విధముల గాపాడ జాలియుందు॥ ౩౨౨

గీ. తమ్ము కుర్రని పలుకులదయను నీవు
మదిని దలపోసి మన్నించి మహిత ధిషణ
కూడ గొనిబొమ్ము వచ్చెద కోర్కె లలర
సర్వ మెఱిగిన వాడవు సాత్వికుడవు॥ ౩౨౩

క. అనవిని రాముడు తమ్ముని
గనుగొని సంతోష మంది గ్రక్కున బలికెన్
మనువంశ తిలక వేగము
ననుగూడుము నిన్నువీడ నాకును వశమా॥ ౩౨౪

వ. బాల్యమునుండియు మనమిరువురమును వియోగమనునది యెరుగక నేకశరీరులవలె దిరుగుచున్నవారము. నిన్ను విడుచుటకు నామనంబును చింతాక్రాంతం బగుచున్నయదిగావున నీవును, సీతయు గూడ బయనంబుగండు. నీవు సత్వరంబుగ జని వరుణుడు స్వయముగ నొసంగిన చాపంబుల నభేద్యకవచంబుల దివ్యతూణీరముల నక్షయ

సాయకంబులు ఖడ్గములు నుంచుటకు నాచార్యగృహంబునకేగి మున
వనవాస ప్రయాణమతనికి దెలిపి యవియన్నియు సత్వరంబుగ గొని
తెమ్మనె. ధనధాన్య వసన వస్తువాహనంబుల గురువుల విప్రులను
బూజింపుచు. పౌరులనిపలికి రాముడు వసిష్ఠపుత్రుడగు సుయజ్ఞునకు
తత్పత్నికి నమూల్యకంబులగు ధనకనకాభరణాదుల నొసగి సంతృప్తుల
చేసి విప్రుల ననుజీవుల సంతసపెట్టి త్రిజటుడను విప్రునకు
గోసహస్రంబులనిడి యిట్లు సర్వస్వమును దానముచేసి దనచెంత కేతెంచిన
సీతాలక్ష్మణులతోగూడి పాదచారులై యుపేక్షించి విసర్జిత ఛత్ర చామ
రాది రాజ లాంఛనులై పాదచారులై ద్వారంబుల గడచి దుఃఖితులై
తమననుసరించు మహాజనుల గనుచు పితృగృహ సమీపమున
సుమంతునిగని దమరాక దశరథునకు దెలియజేయ నాజ్ఞయిడిన నాతడు
సత్వరంబుగ జని దశరథునకెరిగించిన నాతడు రామునట నుండబలికి
తల్లులనందర గొని తెమ్మనె. సత్వరంబుగ జనుమని బలికిన నతడు వారి
నందర దెచ్చిన వారలతోగూడి దశరథుడు రాముని తెమ్మనిన
సుమంతుడట్లొనర్చెనంత. దశరథుడు పంచాశదధిక శతత్రయ పరిమిత
లగు దన పత్నులతోకూడి రాము నెదుర్కొన లేచియడుగు లవని
నిడలేక తడబడి భూమిపై బడి మూర్ఛనొందిన రామలక్ష్మణసీతలు
సత్వరంబుగ సన్నిహితులై దశరథు నెత్తి పర్యంకమునను నిలిచి
యుపచారములనొనర్చిరి. పిదప దశరథుడు దెలివొందిన బాష్పాకులంబు
లగు శోణనయనంబుల రామునీక్షించిన వినయంబున రాముడు
చేతులుమోడ్చి నమస్కరించి

సీ. సర్వంసహాచక్ర సర్వాధికారివౌ భవదాజ్ఞ శిరమున బరగ దాల్చి
దండకాటవికేగ దలచివచ్చితి నేను సీతయు తమ్ముడు సిద్ధపడిరి
దయతోడ సెలవిచ్చి దయయనుమతి బంపు శోకముపనుపు సూర్యవంశ్య
యనవిని దశరథుడనియె పుత్రుని జూచి మోహింపకుసను వేగ

మూఢమతిని

గీ. నిగ్రహింపుము పాలింపు నియతముగను
కైక వరబద్ధచిత్తుడ కరుణవిముఖ
పట్టభద్రుడవగుమయ్య భద్రగుణుడ
నీకు విజయంబుగలుగును నిర్జరాభ॥ ౩౨౫

గీ. అనిన రాముడు భయభక్తు లతిశయింప
ననియె కరములు జోడించి యధికభక్తి
సత్యధర్మాభి రతుడవై సర్వధరణి
సర్వకాలంబు బాలింపు సర్వసముడ॥ ౩౨౬

క. పదునాలుగు వర్షంబులు
విదితంబుగ నడవినేను విపులాధీశా
సదుపాయముగను బుచ్చెద
నదునెరిగెద నిన్నుగొలువ నకలంకముగన్॥ ౩౨౭

గీ. సత్యపాశ నిబద్ధుడు సవిత్మకులుడు
దశరథేశుడు దనపుత్రు ధర్మనిరతు
గనులగనుగొని కైకేయి కలుషకథల
జెప్పియిక్కాలి దుఃఖించి చేరబిలచి॥ ౩౨౮

గీ. తండ్రి రఘురామ నామాట తథ్యమనుచు
మదిని దలచుము నేనేమి మాయ నెరుగ
వరము లిమ్మన్న నిచ్చెద వనిత యంటి
కోర నీరెండు వరములు కోపి యగుచు॥ ౩౨౯

క. మానిని మాయల బడితిని
గానగ లేనైతి నేను కాపట్యంబున్
వీనులు వినలేనట్టుల
బూనెను మాట్లాడనేమి పోలర మొకో॥ ౩౩౦

గీ. మాట దప్పగ లేనని మదిని దలచి
చేసె నాటకమిట్టుల చెనటి మిగుల
పాపభీతిని దుఃఖాబ్ధి బడితి నేను
చేయునది లేదు చెప్పగ చేతగాదు॥ ౩౮౧

క. శ్రేయము వృద్ధియు నీకగు
సాయము సౌమిత్రి నీకు సలుపుచు నుండున్
మాయల మారుల నమ్మకు
ధీయుక్తిని సీతగొలువ దిరుగుము లంఘ్రి॥ ౩౮౨

క. పదునాలుగు వర్షంబులు
తుది తమ్ముడు నీవు సీత లొల్లాసము గాగన్
ముదమున సుఖమున జేరుచు
సదమల గుణశీలులగుచు సాకేతంబున్॥ ౩౮౩

వ. తండ్రి రఘురామ నినువిడిచిన నిమిషంబులు నాకు యుగ కల్పంబులు. నిను విడువ జాల, నన్నెత నూడజాల, నినువిడిచిన నను విసరంబు నిలువదు. మన మనుకులంబున నన్నుబోలు మూడిన నాడొక్క రుండైన లేడు. నేనందు కొడుకుబడు కాలకుంటే. యీ రెంటియందు దనువులనైన నాశ విడుచుటయు యుక్తంబని దలచితి. నీవు సకలధర్మంబుల నెరిగిన వాడవు. నాకన్నులున్నంతవరకును నిను జూచుచుండు నను కొంటిని. నేనేమి చేయుగలను. దైవమిట్లు దలచెను. పట్టాభిషేకంబు బొనర్చవలెనని బుద్ధిపుట్టనేలనో యీ శుభము నింతి కెరుగింపబోనేల నోవరము లిచ్చెద నడుగుమని బలుకనేలనో యిట్టి దారుణ వరములు గోరనేలనో యిదియంతయు దైవికంబో నాబుద్ధి మాంద్యంబో నేను నిశ్చయింపు నేరను. రామచంద్ర నీకెయ్యదియు క్షేమని దోచిననదిచేయుము. నానోట నేమియు బలుకజాలను. యికవశిష్టాదుల ముఖమును గానిచంద్రబింబము

వలె నాహ్లాదమొదవించు నీముఖముచు గాని గనుగొననివ్వకుండ లజ్జ
యనుయవనిక నాకన్నులబడినది యనిబలికి యిక మాటాడనేరక చింతా
నిమగ్నుడయ్యె. నంతసుమంతుడు కైకను సమీపించి సాధ్వివి సత్కుల
జాతవు. నీవిట్లుజేయుట తగదు. రాముసరణ్యమున కంపకుము.
పాపంబుల బాలుపడకుము. నీకు శాశ్వతమగు నపకీర్తిగలుగును.
సంభావితవగు నీకు అపవాదముకంటె మరణంబు శ్రేయము పిదప
పశ్చాత్తాపముగలిగినను లాభములేదనెను. వశిష్టమహర్షియు రాజ
మహిషివి నీవిట్టి కానిపని వలపెట్టజనదు. దేహమశాశ్వతము. కీర్తి
యపకీర్తులు చిరకాలముండును. గురువాక్యమును రిత్తపుచ్చకుము.
నీపుత్రుడు నీమార్గమును బట్టడు. ధర్మజ్ఞుడు సాధుసత్తముడు రాముని
విపినంబున కంపకుము. భరతుడు రాజ్యమేలిన నేలుగాక యని బలికిన
నాయిరువురి వాక్యంబుల విననొల్లక పెడచెవులం బెట్టె నంత వృద్ధ
మంత్రియగు సిద్ధార్థుడు కైకం గని నీవు మహారాజ పుత్రివి చక్రవర్తుల
గృహమున బడినదానవు దానవి వలె న్యాయధర్మంబుల విడుచుట
దగదు. మనుసింహాసన మెప్పుడును కనిష్టాధిష్ఠితము కాలేదు. హిత
వాదులమగు మా మాటల వినుము. రాజ్యమంతయు మా మాటల
చెల్లుబడి యగునుసుమీ. మేము దలచిన మీ మాటలు సాగనేరవు.
నిజమని బలికిన నపహసించుచు ముదిమిచే నీబుద్ధి పెడమార్గము బట్టిన
దనియె. నదివిని సిద్ధార్థుడు కోపించి నీకు సద్గుణంబు లేలగలుగును. తల్లి
గుణంబులే తనయకు చేకూరును. నీతల్లియు నీతండ్రియు శయన
గృహంబున నుండ నొకపిపీలికాపంక్తిని నొక చీమ బలికిన పలుకులు
విని సర్వభాషావేదియగు నీతండ్రి నవ్విన నదియేమియో జెప్పుమని
బలవంతపరచెను. నేనిది నీకు జెప్పదగదట్లు జెప్పితినేని నాశిరంబు
పగిలి యసువులు బోవుననియె. నది యెట్లు జరిగినను నీవు చెప్పక
తప్పదు నన్నుపహసించితివి యిదినీకు తగదనియె, నావచనంబుల విని
నీతండ్రి మూర్ఖయగు నీతల్లిని విడనాడి సుఖయుండె. నీవు నట్టిదానవె.
మారాజు ధర్మబద్ధుడగుట నిన్నును నీవాక్యంబులను బహిష్కరించ

విశ్వామిత్రు డంతటివాడు పడిన పాట్లు నీజగమెరుగును. వెఱ్ఱివేషములు వేసి జగమును మాయబుచ్చు నీవంటి మాయలాడికి తగిన ప్రాయశ్చిత్తము కావలసిన. చేగదా లేదా సీత నామాట వినక రాముని గూడ నడవి కేగదలచెనా యపుడు వినుము

సీ. మేమును పురమును మేదినీజనులును మంత్రులుబంధులు మహిపులెల్ల
సకలోపజీవులు సపరిచ్ఛదులగుచు నేగుదురవనీశు డేగునపుడె
భరతుడు తమ్ముడు భరియించినారల రాముని గొలుతురు రమణి వినుము
దశరథపత్నులు ధరణిజతో గూడి దండకకిప్పుడె దరలువారు

గీ. చెట్లుచేమలతో గూడి చెడినధాత్రి
శూన్యజనవార ఖలమృగ చోరయుక్త
యగుచు నుండును పిదప నీ బలవీవు
తలనుగట్టుకొను మిడుకుటయు ధర్మహీన॥ ౩౮౫

గీ. రాముడుండిన యడవియె రాష్ట్రమగును
రామశూన్యము వనమగు రాష్ట్రమంత
రామవాసంబు రాజుల రమ్యవసతి
రామ శూన్యము రాక్షస రాజవసతి॥ ౩౮౬

గీ. నీవు భూమిని విడనాడి నింగికెగసి
భూతమట్టుల దిరిగిన భూరిగుణుడు
తండ్రి తాతల చరిత్రల తత్వవేది
భరతు డెప్పుడు నీదారి బట్టబోడు॥ ౩౮౭

గీ. చూడు మిప్పుడు కైకేయి చోద్యమొకటి
జంగమంబులు రాముని సరణి జనును
స్థావరంబులు తలలూచి సాగి వంగి
బోవనున్ముఖవృత్తిని బూనియుండు॥ ౩౮౮

వ. అని పలికి వశిష్ఠుండు సుమంత్రునవలోకించి నీవు సత్వరంబుగ జని ధనాగారాధిపతికి దెలిపి విలువగల వసనంబులును మహార్ఘంబులగు నాభరణంబులును పదునాలుగు వర్షంబుల కెన్ని గావలయునో యన్ని లెక్కించి గొనితెచ్చి రథంబుననిడుము. సీత వానిని ధరింపగలదు. దశరథేశుని యుపేక్షయె యిట్టి విపరీతస్థితిని గలుగ జేసినదనిన విని దశరథుండు సూతునవలోకించి సర్వాజ్ఞలును, సర్వనియంతలు నగు మన గురువులనానతి నెరవేర్పుము. సత్వరంబుగ బొమ్మనిన నాతడట్లొనర్చె. సీత దనపుట్టంబున్పై గట్టిన నారచీరల వశిష్ఠదశరథ ప్రార్థనంబున విడిచి దివ్యాంబరంబుల, దివ్యభూషణంబుల ధరించె. దశరథ పత్నులందరును సీతచెంతకేగి పతివ్రతలకు భర్తయగు పరమ భూషణము పూజ్యుడు ప్రవ్రాజితుడగు మాపుత్రు నెప్పుడును సన్మానించుచుండుము. నిర్ధనుడైనను సధనుడైనను నీకితడే దైవము, ప్రత్యక్ష దైవమగు రాముని భయభక్తి ననుసరించుచునిగి. సీతయు వారి వాక్యంబులవిని యార్యుల నను శాసనముల ననువర్తించెద. బహు సమర్థుండును, మదనసుందరుండును సర్వమనోహరుడగు భర్తననుసరించని వడతి యచటనైన గలదా! కైనె నేను చంద్రునితోడి ప్రభవలె శబ్దముతోడి యర్థమువలె ధర్మభగ్ననై భర్తనుండి ప్రచలితను గాను. తంత్రిలేని వీణయు చక్రహీనంపురథమును ననుపయుక్తములు శతపుత్రులు గల వనితకును భర్తృదత్తంబగు సుఖమె యధికము. తల్లియు, తండ్రియు, పుత్రులు, మితదాతలు, భర్త యమితదాతయని పలుకు

సీతావాక్యంబులవిని రామ జనయిత్రులందరు యీ దాంపత్యము వర్ణనీయమని హర్షించిరి. శుద్ధసాత్వికగుణయగు కౌసల్య దుఃఖహర్ష జములగు భాష్పముల గనులసించె. నంతరాముడు

గీ. తల్లిఁగనుగొని రాముడు తగిన యటుల
సత్కరించుచు బలికెను సరళముగను
తల్లిదుఃఖింపజనదమ్మ తండ్రిగొలిచి
తగినయట్టుల పూజింప దలపవమ్మ॥ 389

గీ. నిద్రలేచినయట్టుల నిన్ను సమయ
మరుగ దమ్ముడు సీతయు ననుసరింప
మిత్ర యుక్తుడనై నేను మిగుల భక్తి
చేరి నీపాదసేవల జేయగలను॥ 390

వ. అని వినయంబున పలికి పాదంబులకు వందనంబులిడి తక్కిన పంచాశదుత్తర శతత్రయ సంఖ్యాకులగు తల్లులనందర క్రమముగ గాంచి, తల్లులార ప్రమాదవశంబున నెప్పుడేని యపరాధంబులొనర్చి యుంటినేని పుత్రకరుణ మరిచి నన్ను మన్నించుడు. మీపాదంబులు గొలువ సమయంబు నెరవేర్చి సత్వరంబున రాగలనని వచించిన రామునివాక్యంబులు విని తల్లులందరును కురరీస్వనాధికంబగు శోకర వమును గావించిరి. పూర్వము దశరథగృహము మురజ పటహ పణవ ఘోషము గలిగి విలసిల్లుచుండెడిది. ప్రస్తుతమున విలపిత పరిదేవిత నారీరవమై వెల్లివిరసియుండె. నంత రాముడు తల్లియగు కౌసల్యకు మ్రొక్కి యనుమతివడసె. లక్ష్మణుడు కౌసల్యకు మ్రొక్కు చెల్లించి దన జనయిత్రి పదంబులబడి మ్రొక్కి వనవాసగమనంబున కనుమతి వేడిన సుమిత్రపుత్రు నాలింగనంబొనర్చి సప్రేమంబుగ నిట్లనియె.

సీ. చంద్రుడు శ్రీరామచంద్రుడు గనుక సమరసహస్రంబు సెలవున్నతన
జననాదిరాముని ఛాయయో యనదగు తనువెల్లనన లెనుగు
కారణమున
కనులకు వ్రేగైన ఘనతేజమొప్పుడు కలిగిరాము సద్గోచు సుమనశ్చేత
సకలసద్గుణములు సంక్షోభవించి యిహపరంబు దాల్చిన యాస్థవలన

గీ. వెంటబోవగ నందరు వేడ్కజెలగి
సెలవుమని నిన్ను నేత్రము నిలువగిలను
ధాతబుట్టించునప్పుడే సంతసెనిట్లు
గాన కాసకు నన్నతో గదలుమయ్య॥ ౧

గీ. రాము దశరథు దలచుము రమ్యమెలుగ
దలచుమీ నన్ను సీతను ధర్మమెఱిగి
దలచు మడవిని పురమును దగిన యటుల
సుఖము గాంక్షించి జనుమయ్య సూర్యవంశ్య॥ ౨

వ. అని పలికి పుత్రున కరణ్యగమనంబున కనుమతి నొసగె. సుమంత్రుడు రథం బాయత్తంబు జేసి దెచ్చిన రాముడును, సీతయు, సౌమిత్రియు నధిరోహించిరి. సుమంత్రుడు వస్త్రంబుల నాభరణంబుల నాయుధంబుల కవచాదుల రథంబునందు నిడి రథంబు నడిపించె. యందరు నిర్విణ్ణులై వెంటనున్న వారటనుండిరి. రాముమోహ ధ్యానులగుచు రామునితో జనుచుండిరి. తత్రత్యులగు నాబాల గోపాలము రాముని గూడి యడవికేగ నిశ్చితమనస్కులై జనిరి. రాముడు దన రథము నాపి వారిం గాంచి యిదియేమి? మీరెల్ల రాజెల్లునె యనిన వారందరు నేకవాక్యంబుగ నినువిడిచి యుంట నుండజాలము మా ప్రాణంబులు సీతోడ వచ్చుచుండ శరీరంబుల నిట నెట్లు నిలువ గలము. గనుక నీవెంటనుండిన మేమందర మచటనె యుండెదము.

పుత్రబాంధవుల మగుమమ్ము గొనిపొమ్మని దృఢనిశ్చయంబుల బలికిన వారిఁగని రాముఁడు విపిన క్లేశంబుల వినిపించిన నీసన్నిధిని వసించుటయె మాకు సౌఖ్యప్రదంబు. క్లేశంబుల నెల్ల సహించగలమని బలికి తోడ నరుగఁజూచు వారిం గని చేయునది లేక కొంత దవ్వరిగి రామచంద్రుఁడు సూతు నవలోకించి సుమంత! యదె గనుము రవియస్తగిరి నధిరోహించుచున్నవాఁడు. గూళ్లపక్షులు విశ్రమించుచున్నవి. మనము, నీ రేయి యిట విశ్రమింతము రథాశ్వంబులును మనతోఁడ జనుదెంచు సర్వ మానవులు నలసిరి. యనిబలికిన నాతఁడు రథమును నిలిపె. నటనందరు కాల్య కృత్యంబుల నెరవేర్చి జలముల మాత్రమారేయి గ్రోలి యందరు విశ్రమించిరి. పదప నందరును మార్గాయాసంబున గాఢ నిద్రా పరవశులైరి. యంత చాల ప్రొద్దుండఁగనె రామచంద్రుఁడు మేల్కాంచి సూతుఁగని సుమంత! గనుగొనుము, యయోధ్యావాసులందరు కటికనేలబడి నిదురించుచుండిరి. వీరి నెన్నివిధముల వేడినను పురికి బోదలచ రయిరి. దీని వచించి జనినగాని మనల విడువరు. నీ వేర్పుకొలది వీరి కెరుక బడని విధంబున రథము నిపుడె దోలుమనిన వల్లే, యని సత్వరంబున గుఱ్ఱముల బన్ని చప్పుడు గాకుండ మెల్లిగ రథము నయోధ్యాభిముఖంబుగ కొంత దవ్వు బోనిచ్చి యటనుండి రథమార్గమగుపించని యటుల సరయూ నదని చమత్కారంబుగ దాటించి కోసలంబు దాటి వేదశ్రుతిని, గోమతిని యతిక్రమించి యనేక దేశంబుల గడచి గంగను గాంచి నతులనర్పించి శృంగిబేర పురంబున రథంబు నిలిపిన గుహుండు సన్నిహితుఁడై వినతి సకల వృత్తాంతుఁడై దశరాజ్యంబును దన సర్వస్వంబును రామున కర్పించి సార్వభౌమాన్వయజాతా! రామచంద్ర! నాయందనుగ్రహించి యీరాజ్యమును గొని యిట సుఖముగ నుండుము. నేను సపరివారుండనై నినుగొలచి యుండెదననియె. రాముఁడా నుడు లాలించి మిత్రమ! నేను వనమున మునివృత్తినుండ దీక్షను గైకొంటిని గాన నేనేమియు! గొన నొల్లను. నశ్వంబులకు ఖాద్యంబు మాత్రమొసగుమనియె. నతండట్లొ

నర్చిన నారేయి యచట వసించిరి. రాత్రి కొంతయైన పిదప సౌమిత్రి
గుహునవలోకించి సుమంతుడు వినుచుండ దన దుఃఖంబు వినిపించి
వారితోఁగూడ బహువిధంబుల శోకించె. నంతనరుణోదయంబైన రాముడు
మేల్కాంచి గుహునవలోకించి "మిత్రమా! భగవతి రాత్రి సుఖముగ
జనియె. భగవానుడు భాస్కరుడుదయించు చున్నవాడు." జాహ్నవి
దరించవలెననిన గుహుండు రాజయోగ్యంబగు నావం దెప్పించి విన్న
వించిన రామలక్ష్మణులు కాల్యకృత్యంబుల దీర్చి గుహప్రదత్తంబులగు
వటక్షీరంబుల జడల దాల్చిరి. ప్రయాణోన్ముఖులై సూతునవలోకించి
రాముండిట్లనియె. సుమంత! నీవిక నయోధ్య కరుగుము. మాసుఖ
గమనంబు మాజనకునకు విన్నవింపుము. తల్లులకు మా మ్రొక్కులు
జెల్లించుము. సత్వరంబుగ బొమ్మనిన రాము విశ్లేషంబు సహింపనేరక
సుమంతుడు దుఃఖించుచు ననుగమనంబు వేడిన రాముడు నీవయోధ్య
కేగకుండిన మాతల్లి కైక మావనవాసంబునకు సంశయము వడయును గాన
తద్విశ్వాసార్థ మయోధ్య కేగుమనిన తదాజ్ఞ నతిక్రమించనేరక
నయోధ్య కేగ ననుమతించె. నట రామలక్ష్మణసీతలు గుహానీతంబగు
నావ నధిరోహించిరి. నావ గంగానదీ మధ్యభాగంబున కేగిన సీత
గంగకు వందనం బర్పించి సుఖాగమనంబగు నట్లనుగ్రహింపుమని
ప్రార్థించె. నంత గంగా దక్షిణకూలంబున నావదిగి దనమిత్రుండగు
గుహుని కౌగిలించి సౌఖ్యం బొసగి యటనుండి గదలి ముందు
లక్ష్మణుండును, మధ్యభాగంబున సీతయు, వెనక రాముడును బయలు
వెడలి బహుదూరము నడిచి యారేయి యొక వనస్పతి చెంత వసించి
యరుణోదయంబున పయనంబై మాధ్యాహ్నమగునప్పటికి గంగా
యమునా సంగమమున ప్రయాగ యందు భగవంతుడగు భారద్వాజుని
యాశ్రమంబున భరద్వాజుని గాంచి యాత్మగోత్రనామంబు లుచ్చ
రించుచు నమస్కారములు జెల్లించిన మహర్షియు మహాహర్షంబున
వారలనర్చించి, కందమూల ఫలాదుల నర్పించి, తృప్తులజేసిన యారాత్రి
సుఖాలాపంబుల బుచ్చి కల్యంబున మేల్కాంచి తదుపదిష్టమార్గంబున

శ్యామవటంబును, నీలవనంబును గని యట నాదినంబు గడపి యుద యంబున వాల్మీకి మహార్షిచే సత్కృతులై తదుపదిష్టస్థలంబున పర్ణ కుటీరంబు నిర్మించి ముమ్వురందు సుఖంబుగ నివసించిరి.

—• అంత నట నయోధ్యా పురవాసులు •—

సీ. భాస్కరు డుదయింప ప్రజలంత మేల్కాంచి రాముని గానక రధము గనక
వంచించి జనెనని నైరాశ్యమున పురిజేరి నివసించి యుండిరి నియతితోడ
సూతుడు పురిజేరి శోకించు దశరధరాజున కెరిగించె రాముకధల
దశరథరాజును దనపత్ని కౌసల్య భవనమందున శోక భరముతోడ

గీ. వాసమొనరించి యాహార వాంఛ విడిచి
రామదర్శన హీనత రక్తిలేక
రాత్రిపగలును శ్రీరామ రామ యనుచు
పలవరించుచు నుండెను పార్థివుండు॥ 3—3

వ. అంత నొకదినంబున నర్ధరాత్రంబున దశరథ భూపాలుండు దన యగ్రమహిషియగు కౌసల్యాదేవి చెంతనుండి

సీ. కౌసల్య గనుగొని కాంతరో! నేనొక కాలంబునందున కాననమున
కార్ముకమునుబట్టి క్రమమృగంబుల గొట్టు మదిరిగితి కోర్కెలలర
బుడబుడ శబ్దంబు బుట్టెనుదూరాన గజబుగ్నిగొట్టితి కమలవదన
మనుజునిశబ్దంబు మహితమైవినిపించె మునిపుత్రు గనుగొంటి ముందుబోయి

గీ. తల్లి దండ్రుల నంధుల తనయు కడకు
చేర్చినాడను చిచ్చున జేరినారు
తనయులెవ్వరు దరిలేని తరినినీవు
చావగలవని దిట్టిరి చాన నన్ను॥ 3—4

వ. శబ్దవేధిశరమున నాకు పాండిత్యంబు మిగులగలదను గర్వంబున, కలశంబు జలంబున మునిపుత్రుఁడు ముంచ గలిగినశబ్దంబు గజంబు జలపానంబుసేయు రవంబని దలఁచి యీగతిని తెచ్చుకుంటిని.

గీ. శబ్దవేధిశరము నాకు చావుగూర్చె
గాన నిప్పుడె మృతినాకు గలుగునంచు
రామరాఘవ శ్రీరామ రామ యనుచు
విడిచె నసువుల రారాజు వింతగాను॥ 38౯౫

వ. అంత కౌసల్యయు, సుమిత్రయు కైకయుంగల దశరథపత్ను లందరును దశరథమహారాజు పశ్చిమావస్థనుగాంచి దిక్కులు బ్రద్దలగు నటులరోదన ధ్వనిసాలించిరి. కౌసల్య దనకాంతుని శిరమును దన యంకంబున నిడి పరిపరివిధముల శోకించుచుండె. నంత తెల్లవారిన గౌతమ, మౌద్గల్య, కాత్యాయన, జాబాలి, కాశ్యప, వామదేవ, వశిష్ట, ప్రభృతి మునిగణంబులును, మంత్రిపుంగవులును, సామంతులు, బంధువులు, పురప్రముఖులు మొదలగువారు జేరి కౌసల్యాదుల నోదార్చి దశరథుని మృత శళేబరంబు తైలద్రోణి నిడి కార్యాలోచనా నిమగ్నులై కర్తవ్యము నెఱిగి దూతల బంసి రాజగృహంబున నున్న భరత శత్రుఘ్నుల బిలిపించ నెంచి దూతల రప్పించి మీరు సత్వరంబుగ రాజగృహంబునకు జని భరతుని గని దశరథుని మృతిని దెలుపక కార్యవిశేషంబు గలుగుట వలన నయోధ్యకు సత్వరంబుగ రావల యునని కులగురు డగు వశిష్టుం డాజ్ఞాపించె నని జెప్పి జాగుచేయక వారింగొని తెండని ఒనికి బంపిన నాదూతలు మాలినీ నది ననుసరించి హాస్తినాపురమున గంగ దాటి పశ్చిమాభిముఖులై జాంగల పాంచా లంబుల జొచ్చి శరదండ యనతిక్రమించి కళింగపు, నభికాళమును, బాహ్లీకమును, సుధామశిఖరిని, విష్ణుపధమును, విపాశశాల్మలీ తరువుల గాంచుచు, గిరివ్రజంబు రాత్రి వేళ జేరి యారాత్రి యొకచో నివసించిరి.

క. ఏరాత్రి రాజగృహమును
చేరిరి యామాతలా నిశీథము నందే
క్రూరస్వప్నము గలుగుట
దారితమై భరతు మనసు తల్లడమంచెన్॥ ౩౯౬

క. ఆకలకు బెదరి భరతుడు
శోకముతో నిద్రలేని సొక్కుచు ప్రక్కన్
చీకాకు పడుచు నుండిన
నాకారణ మరయలేక నాప్తులు చింతన్॥ ౩౯౭

క. కొందరు గానము జేయగ
కొందరు హాస్యంబు నెరప కొందరు నవ్వన్
కొందరు నాట్యము జేయగ
కొందరు లీలావినోద కోటుల నెఱపన్॥ ౩౯౮

గీ. వినడు నవ్వడు గాంచడు వింతపడడు
చిత్తమెచ్చట నున్నదో చెప్పడతడు
చేరి మిత్రులు బ్రతిమాలి చిత్తవికృతి
దెలుపవేదన తప్పక దెలిపె నిటుల॥ ౩౯౯

సీ. కలలో నాతండ్రి గనపడె, మలినుడై ముక్తకేశుడగుచు మహాద్భు పగిది
పర్వతాగ్రమునుండి పడి పేడ మడుగున కప్పగంతు లిడియె కనుల కెదుట
కాయమందున నూనె కలయగ బూసెను తిలలు వేసిన కూడు దినుచునుండె
నూనెను త్రాగెను నూనెను మునిగెను తలకిందుగానుండె ధరణినాధు

గీ. డబ్ధి యింకెను భాస్కరుడు డదరి పడియె
భద్ర మత్తేభ దంతంబు భగ్నమయ్యె
వసుధ బగిలెను గిరులెల్ల నారి మునిగె
లోకమంతయు చీకట్లలోన బడియె॥ ౮౦౦

గీ. నల్లబట్టను గట్టిన నామతండ్రి
నీల నీరద గాత్రలు నిలిపి గొట్ట
నెజ్జి ఘవ్వుల దండల నెడద దాల్చి
ఖరరథంబున గమనించె కారు పురికి॥ ౮౦౧

గీ. రక్తవస్త్రంబు గట్టిన రమణి యొకతె
నవ్వు చుండుచు హాతుసి నాదు జనకు
పరుష వాక్యంబు లాడుచు భయద చూపి
లాగు చుండగ గంటి నీలాటి కలను॥ ౮౦౨

క. ఈరీతి కలకు ఫలమిది
మా రాముడో, రాజో, నేనో, మా లక్ష్మణుడో
దారుణ మరణము నొందగ
కారణ మగుగాన మనసు కలతను జెందెన్॥ ౮౦౩

క. ఖరముల గట్టిన రథమున
బరువడి యేసరుకు గలను బరచునో యతడే
స్థిరముగ యముపురి జేరును
బరమాప్తుడ వగుట నీకు బలుకగ వలసెన్॥ ౮౦౪

చ. ఉడుకుచు నుండె నామనసు యొప్పదు బల్కగ ప్రీతి లేదు యీ
యెడ కరినంపు వార్త విన నేర్పడునో గద గొంతు యెండెడిన్
సుడివడ జొచ్చె చిత్తమును జూచుటకేదియు నింపు లేదు నా
పడియెడి బాధ జెప్ప నగుబాటు జనించునుగాదె మిత్రమా॥ ౮౦౫

క. కల గని నది మొదలుగ నా
తలదిరుగుచున్నను కతన తలచెద నిపుడే
కలుషపువార్తల నేవిన
వలయునో నే ననుచు మనసు వలగొనుచుండెన్॥ ౪౦౩

క. మును పెప్పు డెరుంగని యీ
పెనుగల నామనసు నిపుడె పీడించుటచే
జననాథు డెట్టు లుండెనో
యని చింతను మునిగి యిటుల నలజడి పడెదన్॥ ౪౦౭

వ. అని భరతుడు దన మిత్రుని తోడ దనకు రాత్రి గలిగిన కల నశేషవిశేషములతో వక్కాణించు చుండ వశిష్ట ప్రేరితులగు దూతలు కేకయ రాజును యువరాజగు యుద్ధాజిత్తును గాంచి భరతు సన్నిధికేగి వశిష్ట వాక్యంబుల దెలిపి నీకయోధ్య సత్వరంబుగ గంతవ్య మని బలికిరి. భరతుండును మాతామహానుమతి నొంది గిరివ్రజంబు విడిచి ప్రాఙ్ముఖుండై సుదామను, హ్లాదినిని, నతద్రుదును, పర్వటముల శిలా నదిని శల్యాకర్తన పురమును, చైత్రరథమును, సరస్వతిని, గంగను, కుళింగ మును, దానును, దూతలును, శత్రుఘ్నుడును, గనుచు యమునాతీరమున విశ్రమించి యంశుధాన దేశంబున ప్రాగ్వటపురము కడ భాగీరథి నుత్తరించి కుటికోష్టికాపురిని ధర్మవర్ధనపురమును, జంబూ ప్రస్థమును వరూథపురమును, ఏకసాలంబును, స్థాణుమతిని, వినత పురంబున గోమతిని, లింగపురమున సాలవనమును, గాంచుచు నతివేగంబున నరుణోదయ సమయమున నయోధ్యజేరి నిశ్శబ్దముగనున్న పురమున బ్రవేశించి చిత్తం బుత్తలపడుచుండ జనకుమేడకేగి యట నతనిం గానక జననీ గృహమున తల్లింగని వందన మొనర్చి జనకు డెక్కడ యని యడిగె, నంత కైక పుత్రునింగని.

## —♦ భరతుడు కైకతో మాట లాడుట ♦—

సీ. కాలము గడిచిన కాయంబు విడనాడి నాకపురము జేరె నవని
విభుడు
శ్రీరామ రాఘవ సీతా మనోహర యనుచు ననువుపీడె నవని
విభుడు
మాయన్న రాముడు మాన్యుడు దిరలేక యనిన నడవి కేగె
ననియె తల్లి
నడవి కేగగ నేమి యన్నకు కార్యముగల్గె ననవరముల గోర నవని
విభుని

గీ. వరములెట్టివి దెల్పుము వాసినగ
రాజుగా నిన్ను జేయగ రాజ్యమునకు
పదియు నాలుగు వర్షము లడవులందు
రాముడుండగ గోరితి రాజుననియె॥ రంగా

సీ. లక్ష్మణు డేమయ్యె లావణ్య వరదేహ సీత యేమయ్యెనో
జెప్పుమనిన
లక్ష్మణుడును సీత లలిత సద్గుణశీల యనుసరించిరి రాముననియె
కైక
చెడిపి చేతల నేల జేసితివని యన జేసితి సిరి నీకు జేర్చననియె
పుట్టిన చోటికి పెట్టిన చోటికి నపకీర్తి దెచ్చితి వనిన కైక

గీ. వసుధ యెట్టులో సాధింప వలసియుంట
పడగరానట్టి పాటుల బడితి ననియె
కోరియుంటివి నె రాజ్యంబు కొంపదీయు
పనుల జేసితి విదియేమి పాపి యనియె॥ రంగా

క. నాజనకుని బరిమార్చితి
వోజననీ నీకు నిద్ది యొప్పనె చెపుమా
భూజనుల తిట్ల కెల్లను
భాజనమై పాపివీవు బ్రతుకగ గలవే॥ ౪౧౦

ఉ. ఎవ్వడు నాకు దైవతము యెవ్వడు తల్లియు తండ్రి యెవ్వడో
ఎవ్వడు నాకు భ్రాత సఖుడెవ్వడు పాలకు డెవ్వడయ్యె నే
నెవ్వని కింకరుండనోకో యెవ్వని సద్గుణు డెవ్వడాఢ్యుడో
యెవ్వని పాదపద్మములు నెప్పుడు నామనమందు నిల్చునో॥ ౪౧౧

ఉ. ఎవ్వని నామ మన్వహము నేమరకుండగ సంస్మరింతునో
ఎవ్వని సత్కథామృతము నేదనివారగ గ్రోలుచుందునో
చివ్వున బోయి యావిభుని జ్యేష్ఠుని పాదయుగంబు నందునే
నెవ్విధినైన వేబడుదు నేపున నారల గట్టి గొల్చెదన్॥ ౪౧౨

వ. అని బలికి దిగ్గున లేవబోయి సర్వావయవంబు లవశంబున నుండుట శోకభారవశమున లేవలేక భూమిపై బడి మూర్ఛమునిగిన నిశ్చేష్టితుడగు దన యన్న భరతు నవలోకించి శత్రుఘ్నుడు సత్వరంబుగ సన్నిధి జేరి శిశిరోపచారంబుల దెలివిగలిగించి బాహుల బట్టి యెత్తి సేద దేర్చిన కొంత దడవునకు లేచి గనులు దెరచి శోకాగ్రహంబులు పెనగొనుచుండ నెర్రబారిన కనులతోడ నతిచంచలంబుగ నధరంబు గదలుచుండ గైకంగని ఛీ మూర్ఖ మూఢ నీవు జననివె రాక్షసివి గాకున్న నిట్టి ఘోర కృత్యంబు జేయగలవె. రాముడు నీకేమి యపకార మొనర్చె. రాముడు గుణధాముడు, కరుణా సాగరుడు, పాపంబు లేశంబైన నామహాత్మునియందు గలిగియుండునె. సర్వలోక ప్రియుడు సర్వసత్వనయన మనోహరుడు యీమహాపాతకము యీ బలవద్వైరము యీసాధుజన సంతాపము నేల ఘటించితివి. యిందువలన నీవు బొందు లాభమెద్ది? యాకమలదళాక్షుడు సుకుమార గాత్రుడు. నారల నేల కట్టవలె. నడవికేల బోవలె. యీరాజ్యమేలువాడెవడు. రామరాజ్య

మితరుల కేల కరగతమగు నెవడు నన్ను రాజ్యంబు గావలసెనని ప్రార్థించె. నెన్నడయిన రాజ్యమేలవలెనని కాంక్షించితినా. కానిమ్ము. మాటాడ వేమి. యనిన కైక పుత్రు నవలోకించి భరత నీవు నా పుత్రుడవు. నిన్నెన్నియో పాట్లబడి పెంచితిని. నీ యోగక్షేమములు నాకావశ్యకములు. నీ మేలు నాకాంక్షించు దానను. [illegible] నగయ లేనసెదవా. ధనమేగదా సర్వసుఖకారణము. అదిలేని[illegible] సద్గుణము సున్నయె గదా. ధనము లేక [illegible] నీకు లోకమున మన్నన గలుగునె. పెద్దలు గౌరవింతురె. రాజ్యము లేకున్న ధనమెటుల లభించును. ధనప్రాప్తికొరకు [illegible] యుక్త యావశ్యకము గదా! నాకిచ్చిన వరంబులను [illegible] వరముల గోరుట తప్పా! పోనిమ్ము నీ తండ్రి నాకు [illegible] నెరవేర్చెనా. వరములు గోరదగదని పెద్దలాడిరా? రాము[illegible] భూమిని గోరి [illegible]నా? నీవు వెర్రివాడవు. స్వలాభము నెరుగని వాడవు. [illegible] భూలోకంబున నెన్నడును బుట్టియుండలేదు. ఈ [illegible] నీవు దీనిని వీడిన మరియొక తరుణ మిట్టిది లభించునా. [illegible] రాజ్యమును వీడువాడు గలడా. నీవు పట్టాభద్రుండవు గమ్ము. నీవు పదునాలుగు వత్సరంబులు ప్రకృతి జనుల వశపరచుకొనిన పిమ్మట రాజ్యము శాశ్వతముగ నీకును నీపుత్రులకును క్రమముగ వశమున నుండును. గాని రామశాఖ కెన్నడైన జెందగలుగునా. శాశ్వతముగ ప్రజలందరు నీయందె యనురక్తులగుదురు. గతమున కేల వగచెదవు. ప్రకృతము ననుసరించుము. మనసును చిక్కబట్టుకొనుము. బేలవు గాకుము. భయమును బొందకుము. నీకు నీమాతులుండును. మా తండ్రి మహారాజును తగిన సహాయ మొనర్చగలుగుదురు. నీకేమియు కొరతయుండదని బహుయుక్తుల బలుకు వావదూకయగు తల్లిని గని మహోగ్రహావేశమున వివశుడైన భరతుడు యోసీ! రాక్షసీ! కులఘ్నీ! పతిఘ్నీ! కృతఘ్నీ! చండీ! పరమ కోపినీ! పరమ పాపీ! మాయన్న నడవికి బంపి జనకుని జంపి నన్ను నిందపాలొనర్చి నన్ను రాజ్యమేలమనెదవా.

ఛలముగ నన్యాయముగ నేను రాజ్య మాకాంక్షించువాడనా? జ్యేష్ఠుడుండ కనిష్ఠుడు రాజ్యమేలునా? రామతత్వము ధర్మతత్వము నీవేమెరుగుదువు. తగదని నీకేల దోచలేదు. నాస్వామి నాదైవము నాసర్వస్వము లోకప్రియుడు లోక నయన చంద్రుడు నారామ చంద్రుడు నీకు వైరి యయ్యెనా? నీకన్నుల కాపె రాముని నవలోకించితివా. నీనయనంబులకు రాముడు వెగటుగ గనిపించెనా. రామశబ్దము విన నీచెవులు కాంక్షించలేదా? నీమనంబు నీకిదితగదని బోధించలేదా? రాముడు లేనిసుఖము నేనర్థింతునా. తుచ్ఛమై చంచలమశాశ్వత మస్థిర మగు నీదేహమును నీసౌఖ్యమును నీరాజ్యంబును నేను విశ్వసింతు ననుకొంటివా? యింతపని జేసి మరియు యిటుల కొరవితో గాల్చిన పుందుపై నుప్పుగూర్చినయటుల నింకను పశ్చాత్తాపము నొందక వాచాలవై సిగ్గువిడిచి భర్తృ మరణ శోకహీనవై రాజ్యలాభమున కానందించుచు నిట్లుబలికెదవా. మాతృ వధ మొనర్చిన మహాపాపియని రాముడు నన్ను చెంతకు జేరనివ్వడని భయపడి విడిచిన బ్రతికిపోతివి లేకున్న నిన్ను బరిమార్చి యుండనా. యిన్నిమాటలు బలుకు దానవా. యిదివరకె యసువిసరముతో నాకసమున కెగిరిపోయి యుండవా? నీరాజ్య కాంక్ష రిత్తబుచ్చెద. రాజ్యము రామున కర్పించెద. తన్ప్రతి నధిగ నేనడవి నుండెద నీకోర్కెలయ మొనర్చెద. నాయాత్మకు హానిగలిగించితివి. నేను నీవలె ననాత్మజ్ఞుడ ననుకొంటివా. రాముని మనుష్య సామాన్యునిగ నల్పునిగ దలంచితివా. యిది నీకు తగదు. నీవు నాకిక తల్లివి గావు మహాపకారివి. నేనేమిచేతును. రాము నెట్లు జూతును. అన్నా రామచంద్రా నాయనా! దశరథ రాజేంద్రా! నను మీరిరువురును విడిచితిరా! మాటలాడరేమి! నేనెట్లు జీవింతును? నీలోకాప వాదమును, నీపితృభ్రాతృ వియోగ దుఃఖము నెట్లు తరింతును. తల్లీ నన్ను మహాశోకార్ణవంబున గూల ద్రోసితివా యని పెద్ద పెట్టున హా! యని గొంతెత్తి యావరచి నట్లు శోకించుచుండె.

## —◆ భరతుడు కౌసల్య చెంత కేగుట ◆—

సీ. అదివిని కౌసల్య యపుడె సుమిత్రతో నడుగొని వచ్చె భరతు డార్య
నుతుడు
దనయన్న దనతండ్రి దలచి శోకంబున యడలుచు నున్నాడు
హరిగుణుడు
జని చూత మని లేచి చయ్యన నిలభూమి భరతుడప్పుడు చేరె భక్తి
యుతుడు
కౌసల్య గనుగొని ఘనభక్తి మ్రొక్కుచు కరుణించుమనియె ప్రే
మగుణ బుట్ట

గీ. భరతు గనుగొని కౌసల్య బలికె నిటుల
తండ్రి భరతుడ పాలించు ధరణి నెల్ల
రాము డడవికి బోయెను రాజు జచ్చె
తల్లి యార్జించి నీకిచ్చె ధరణి యిటుల॥ ౨౧౩

గీ. దాయ లెవ్వరు లేనట్టి ధరణి యిటుల
దైవ వశమున నార్జించి తల్లి యిచ్చె
పట్ట భద్రుడ వగుమయ్య భరత యిప్పుడె
చిన్నితమ్ముని సాయంబు జేయుమంచు॥ ౨౧౪

క. యికనీవు తల్లి కోర్కెన
సుకరంబుగ కరమునుంచి సుఖ నిగ్గగలన్
గకవికలు శోకమునడగ
సకలంకత బాంధవమ్ము నతిధైర్యమునన్॥ ౨౧౫

క. కానకు బోయిన రాముడు
కానగ రారెప్పుడును కాంక్షలు దీరన్
మానుము శోకము వేగమె
బూనుము నీధాత్రి నేల భూరిగుణాఢ్యా॥ ౨౧౬

క. నారలు కట్టగ వలెనా
కూరల దిని యడవి యందు గూర్కగవలెనా
ధారుణి నేలిన జాలదె
క్రూరత యిదియేల జెప్పుము క్రోధివిగాకన్॥ ౪౧౭

గీ. ఏక పుత్రుడు కానకు నేగి పోవ
కైక కోర్కెను ధారుణి గలిగె గాదె
నాకు రాముని తోనుండ నరవరేణ్య
కోర్కెగలదయ్య యాచింతు కోర్కె దీర్పు॥ ౪౧౮

## —♦ భరతుడు కౌసల్యతో మాటలాడుట ♦—

వ. అనవిని భరతుడు గోరుచుట్టుమీద రోకలి బడినట్లు మిగుల పరితాపమొంది సహింపలేక ప్రాణములు నిలువున బోయిన వానివలె నామె పాదంబుల బడి కొంతదడ వేమియు దెలియని మూర్ఛావస్థ మునిగి దెలసి తల్లియగు కౌసల్య ముఖమును గనుగొని కన్నీరు కాలువ గట్ట మిగుల నేడ్చుచు, తల్లీ! నాయునస్థితి నీవెఱుగనిదానవు గావు. నీవిట్లనిన నేనేమి చేయగలను? మాతుల గృహమున కేగి పది రెండవ వత్సరము గడచుచున్నయది. నేడువచ్చుచుంటిని. నేనేపాపము నెరుగను. నేనెన్నడును రాజ్యము గోరియుండలేదు. నాతల్లి జేసిన దుర్వృత్తి నేనేమియు నెరుగను. నమ్ముము. నమ్మకున్న నేనేమి చేయగలను. బాల్యమునుండియు నావర్తనము నీవెరుగనిదిగాదు. వేయేల మాయన్న రామచంద్రు డడవికేగ వలెననియు, రాజ్యము నేనేలవలెననియు, నామనంబున నిప్పుడుగాని యింతకు పూర్వముగాని కోరిక యున్నచో గురుముఖమున జదివిన విద్యను విడిచిన వాడను, సూర్యాభిముఖముగ మలమూత్రముల విడుచువాడను, పాపుల జేరువాడను, పండిన గోవును దన్నువాడును, కూలియై కూలినివ్వనివాడును, రాజద్రోహియు,

దన ప్రజల ప్రజలవలె బాలించని వాడును, యజ్ఞ దక్షిణ నివ్వని వాడును, రణమునుండి పారువాడును, గురూపదిష్ట మంత్రంబు మరచువాడును, స్వాదు పదార్థ మొరుల కిడక భుజించు వాడును, తిలమిశ్రాన్నము దినువాడును, కారణము లేక పరమాన్నమును దిను వాడును, పెద్దల దిరస్కరించు వాడును, గురువుల హుంకరించు వాడును, త్వంకరించు వాడును, గురునిందకుడును, విశ్వాస ఘాతకుడును, రహస్యమును ప్రకటించువాడును, కృతమును మఱచు వాడును, సజ్జన పరిత్యాగుడును, లజ్జా విహీనుడును, లోక విద్వేషియు, భక్ష్యవర్గమును బస్తుంచి భుజించువాడును, ధర్మహీనుడును, సంతాన హీనుడును, వృద్ధుల బాలుల వనితల రాజును జంపువాడును, సేవకుల నాశ్రితుల విడుచువాడును, మద్యమును, లక్కను, లవణమును, విషమును, లోహమును, మాంసమును విక్రయించు వాడును, పరస్త్రీ గామియు, కామక్రోధపరవశుడును, ఉదయాస్తమయ సమయముల నిద్రించు వాడును, గురుపత్నిని గవయువాడును, మిత్రవంచకుడును, పూజ్య పూజాబహిష్కృతుడును, బహుయాత్రుడును, స్వభార్తున కన్నమిడని వాడును, మాతృదూషకుడును, లోభియు, ఋతుకాల పరిత్యాగియు, పసిలేగల ద్రాగనివ్వక పాలు బితుకువాడును, విప్రవిత్తాపహారియు, పానీయముల మలమూత్రముల విడుచు వాడును, విషము బెట్టువాడును, గృహదాహకుడును, దప్పిగొనినవారి దప్పి దీర్పని వాడును, పక్షపాతము బలుకువాడును, యనృత వాదియు, వనితపై నపవాదము మోపువాడును, మిథ్యావాదియు, నాస్తికుడును బొందు దుర్గతిని రామపరవాస కాంక్షగాని, రాజ్యకాంక్షగాని గలిగియున్న బొందగల వాడ. నీపాపము లాన నేనే పాపము నెఱుగనని దుఃఖించుచున్న దనయుఁ భరతు నవలోకించి నాయనా! నాకు రాము డొకటియు నీ వొకటియు గాదు. నీకు రామునియందుగల భక్తి నెఱుగుదును గాని పుత్ర వియోగ దుఃఖమిటుల బలికించినది. నీవు శుద్ధుడవని మనఃపూర్వముగ నమ్మితి. నీవు శోకింపకుమని బాహువుల గ్రుచ్చియెత్తి యంకంబున

నుంచి నాయనా! నిన్నుజూచి ప్రాణంబులునిలిపెద. నీవు చిరంజీవివిగమ్ము. సజ్జనులేగెడి త్రోవబొమ్ము, తండ్రి తాతల మార్గ మవలంబింపుమని బలికెనంత. దనవంశ్యుడగు భరతు నోదార్చ ప్రభాకరుండరుగుదెంచె. వానితోడనే వశిష్ఠవామదేవ కాత్యాయనాది విప్రులును, బంధువులును, మంత్రులును, సామంతులు, మొదలగువారందరు జనుదెంచి భరతు పరివేష్టించి హితవాక్యంబుల నోదార్చిరి. వశిష్ఠోక్తమార్గంబున దశరథుని కౌర్ధ్వదైహికంబుల నొనర్ప నియమించిరి. వశిష్టోపదిష్టమార్గంబున పితృమేధ సంస్కారములన్నియు యథాశాస్త్ర సాంప్రదాయములుగ జరుపబడినవి. పిదప నొకదినంబున వశిష్ఠాదులందరును నొక సభాభవనంబున మహాసభగూడి భరతు నాహ్వానించిరి. భరతశత్రుఘ్నులు తమ కర్హములగు పీఠంబుల వసించిరి. యంత సభలోని పెద్దలిట్లనిరి.

## సభికులు భరతునితో మాట్లాడుట

సీ. మారాజు దశరథమహిపతి మముబీడినాకపురముజేరె నరనుతుండు
జ్యేష్ఠుడు రాముడు జేరెను వనమున కవనిజయును దమ్ము డనుసరింప
రాజవుమాకిప్డు రాజపుత్రుడవీవు తప్పించుకొనినను తప్పబోదు
ప్రజలందరునునిన్ను ప్రార్థనచేయుచు సేవించవచ్చిరి శీలయుతులు

గీ. రాజ్యభారంబు బూనుము రాజతనయ
గురుడుమొదలగు వారలు గూడినారు
సకల సంభారసమితియు చాలగలదు
పట్టభద్రుడ వగుమయ్య భరతరాజ॥ ౪౧౯

క. కులగురుడు బలికె భరతుడ
సలలితముగ రాజ్యమిపుడె చక్కగ గావన్
విలసితబుద్ధిని దలచుము
ఖలశిక్షయు సాధురక్ష గావలయుటచే॥ ౪౨౦

క. యనిమూర్ఛ మునిగి భూమిని
దన పీఠమునందు నుండి దబుకున పడగా
దన బాహులతల దమ్ముడు
ఘనపీఠమునందు నిలిపె గాఢపు భక్తిన్॥ ౪-౨౫

గీ. మూర్ఛ దెలిసియు ధీయుని ముఖము ముడిచి
దుఃఖసాగర మందున దూలి పడుచు
కాలమహిమను గురువులు గాని ధర్మ
మిట్లు బోధింప బూనిరి యేమిచేతు॥ ౪-౨౬

వ. అని దన మనంబున దలచి వినయంబున వశిష్టాభిముఖుండై

క. ఆవరచు పగిది యేడ్చుచు
నీవిధి నను దూలనాడ నేటికో చెపుమా
భావిత సర్వాభీష్టుడ
యేవిధమున గర్హ ధర్మమిటు దలచితివో॥ ౪-౨౭

చ. గురుడవు తండ్రి బోలుదువు గోప్యములైన రహస్య ధర్మముల్
బరువడి నీవెఱుంగుదువు భానుకులోద్భవు లెల్లవారు నీ
కరుణకు పాత్రులైరి ననుగారియ బెట్టిన నేమిలాభమో
బరిభవ వాక్యమీసభను బల్క నధర్మము ద్రొక్క నేలనో॥ ౪-౨౮

సీ. మాతుల గృహమున మాపిన తమ్మునితో నివసించి యుంటిని నిపుణముగను
యిచటి వృత్తాంతంబు లేమియు నెఱుగను తల్లికోర్కెల దీర్చ తలపులేదు
దశరథ పుత్రుడు ధర్మంబు దప్పుట ధరగల్గునని మీరు దలపవలదు
జ్యేష్ఠుడు రాజ్యంబు చేయుట ధర్మంబు రాజును జేయుడు రాము నిపుడె

గీ. వంశ మర్యాద నంతను వమ్ముజేసి
రాజ్యకాంక్షను రాముని రాజ్యమెల్ల
నపహరించగ దలచితి నంచుమీరు
దలచు టర్హంబె దశరథ తనయులార॥ ౮౨౯

సీ. మావంశ మర్యాద మదినెంచి చూడగ జ్యేష్ఠుడే రాజ్యంబు జేయుచుండె
జ్యేష్ఠుడు రాముడు జేయును రాజ్యంబు నాతని నేగొల్తు నధికభక్తి
దాతయు భ్రాతయు తండ్రియు గురుడును దైవంబునాకని దలతు మదిని
ప్రతినిధి నైనేను పదునాల్గువర్షము లాతని పనభూమిని గడపగలను

గీ. భక్తి పట్టాభి షేకార్థ భవ్యవస్తు
వితతి గొనిపోయి యడవిస వేడ్కతోడ
జేయనెంచితి పట్టాభిషేకమిపుడె
రండు నాతోడ మీరును రాణులయును॥ ౮౩౦

క. పవనాగ్ని దెచ్చినట్టుల
నవనీ పతిదెచ్చి మీకు నవనికి మేల్గన్
నవ నవ శుభముల జేర్చెద
భవితవ్యము దెలసిరండు భద్రము బొందన్॥ ౮౩౧

సీ. తగిన వారిని నేను దారి శోధింపంగ బంపించ దలచితి భవ్యులార
చతురంగసేనతో చయ్యన మీరెల్ల నాతోడ నింపుగ నడువవలయు
రాముని సేవించి రాజ్యమర్పణజేసి ప్రార్థించి తెత్తును పార్థివేంద్రు
వనమున నివసింప వలసిన పదునాల్గు వత్సరములు నిల్తు వాసిగాను

గీ. రాజ్యమేలగ రాముడు రాకయున్న
ఛాయ బోలుచు సేవల జరుపువాడ
నాదునిశ్చయ మిదియని నమ్మవలయు
గురుడు తండ్రియు దైవంబు గూడ నతడే॥ ౮౩౨

గీ. కైకనిప్పుడె గడతేర్చ గలనుగాని
తల్లిజంపిన పాపిని దరికిఁ దీయ
దగదటంచును విడనాడ దలచునేమొ
రాముడని మానియుంటిని రభసవృత్తి॥ ౪౩౩

వ॰ మహాత్మా! యరుంధతీ ప్రాణనాయకా! కరుణా సాగరా! సర్వజ్ఞమూర్తీ! నన్నేల కుపథంబున బడ నాజ్ఞయిడెదు. నావంశంబున కనిష్ఠుడెన్నడేని రాజ్యమేలెనే? రాముడు రాజ్యమేలదగినవాడు గాడా? ధర్మవర్తనుడు గాడా? నన్ను శోధించ దలచి యిట్లు బలుకుచుంటివా? లేకున్న నీవేమి? యిట్లు బలుకుటేమి? నాహృదయమును నీ వెఱుంగవా? నీకుదెలియని దేదైన గలదా? నీవు త్రికాలవేదివి. మావంటి పామరులతో నిట్లు క్రీడింతువు గాకున్న నీవు రాముని విపినమునకు బోనివ్వక నిలుప లేక నిట్లుపేక్షించితివా? నీయభిమతమును భవితవ్యమును నావంటివాడు తెలుసుకొనగలడా? పోనిమ్ము. నేను రాజ్యమేలుట ధర్మమని నిజముగ నీవనెదవా? యది ధర్మమగునా? నీశిష్యుడనగు నేనధర్మమున బడుట నీకు సమ్మతమా? గానిమ్ము. నేనేమి జేయగలను. మనఃపూర్వకముగ నాయైహికాముష్మికసర్వస్వము రాముని యధీనమున నుంచి,తద ధీనుడనై స్వాతంత్ర్య కూపమున బడక వర్తించునట్లు నన్ననుగ్రహింపుము. నీవును తల్లులును మహర్షులును రాము వీక్షింప బయలు వెడలుడు. సత్వరంబుగ లెండు లెండని మువ్మారు బలికి మంత్రుల జూచి

ఉ. గోరను రాజ్య మేలగను గూర్తు ననిష్టము కైక కిప్పుడే
వారక శిల్పు లేగవలె నైశమ మార్గము బాగు సేయగా
భారము రాము నందునిడి భవ్యతరాటవి నేనయుండెదన్
వారణ ఘోంట కాన్వితము వాహిని ముందుగ బోవగావలెన్॥ ౪౩౪

చ. అని యభిషేకవస్తువుల నచ్యుతశక్తిని చుట్టివచ్చి మీ
మనముల ధర్మ మెంచదగు మాకుల మందున నగ్రజాతుడే
ఘనముగ రాజు గాగలడు గాదిలితమ్ముల గాచునాతడే
గనుకనె నేను రాముగన కానకు నేగెద రండు మీరలున్॥ ౪౩౫

సీ. అనవిని భరతాజ్ఞ నప్పుడె ఘంకులు కమ్మరి వడ్రంగి కర్మ పరులు
మేదరవాండ్రును మేలైన పనివాండ్రు భయభక్తియుక్తులై బయలు వెడలి
యేరీతి నెచ్చట నేర్పాటు కావలె నటుల జేయుచునుండి రధికభక్తి
గ్రామమునందున గలవారలందరు బాలురు వృద్ధులు పడతులెల్ల

గీ. రామ చంద్రుని గనుగొన రమ్యవనికి
రండు పోదము మీరెల్ల రక్తితోడ
భరతు డేగుచు నున్నాడు భక్తి వశత
నతని యాజ్ఞనుమీరగ నలవిగాదు॥ ౪౩౬

వ. అని యొకరితో నొకరు చెప్పుకొన సాగిరి. యప్పుడు

ఉ. అనఘులు సత్సాభాసదులు హర్ష నిమగ్న హృదంబు జాతులై
గనుగొన వచ్చు రామునను కాంతులు మిక్కిలి హెచ్చు చుండగా
వినయ విధేయ భక్తులను వింతగ జూపుచు బల్కిరిట్లు నీ
ఘనమగు సద్గుణోదయము గణ్యమచింత్యమవాచ్యమేటికిన్॥ ౪౩౭

గీ. ఇటుల కరగత మైనట్టి యిలనువీడి
ధర్మమఱసెడి వారలు ధరణిగలరె
రాము బోలితి సద్గుణ రాజియందు
దశరథాత్మజులందరు ధన్యతములు॥ ౪౩౮

వ. మహానుభావ! భరతరాజ! నీమనసెటుల యొప్పెను. ధనీషణము యీషణంబులలో నెల్ల నధికమైనది. దానిని త్యజించువాఁ డొకడైన గనపడడు. ఒక కానినైన బాలునికిచ్చి మఱల గొనవలెననిన వాడివ్వనేరడు. ధన్యతములలలో నీవేయగ్రేసరుడవు. యిట్టి మహారాజ్య విభవమును తృణ సమముగ విడిచితివి. వైరాగ్య మన నీదియే వైరాగ్యము.

క. అని భరతువినుతి జేయుచు
వనగమనార్థంబులైన వస్తులగూర్పన్
మనములదలచుచు మాన్యులు
ఘనసభ జాలించి జనిరి గాఢాసక్తిన్॥ ౭౩౯

వ. ఆ దినశేషంబున పురవరంబున నిటుల సాటింపు జరిగినది.

గీ. అనఘులైనట్టి ప్రజలెల్ల నధిపుతోడ
బయలుదేరగ నాయత్త పడుడు వేగ
నరుణు డుదయింప కుండగ నరుగ గలరు
గాన భరతుని మీరంత గలుసుకొనుడు॥ ౭౪౦

క. భరతాజ్ఞ మీకు దెలిపితి
పరిపూర్ణ కృపా విశేషభాజను నతనిన్
సరిగా సమయమునందున
విరచితసన్నాహులగుచు వే గలయ వలెన్॥ ౭౪౧

వ. అను నంతలో దివాకరుడు దన వంశజుడగు రఘురాము దర్శింప భరతుని తోడ జనువాడు బోలె, ప్రయాణవస్తు సంపాద నార్థము తన గృహముల కేగునటుల పశ్చిమాద్రికి జనియె. నంత సకల జనులు తమతమ భవనంబులకు భరతాజ్ఞగొనిచనిరి. భరతుండు ప్రయాణ సన్నాహంబు జేయ మంత్రుల కాజ్ఞాపించి, నిజ గృహంబున కఱిగె,

క. జనక సుతా పూజిత పద
మునిజన హితకార్య కరణ మునినుత చరితా
దనుజాధిప సంహరణా
వినతాసుత సేవితాంఘ్రి విపులాధీశా॥ ౪౪౨

మాలిని. కరధృత వరచాపా ఖండితార్తౌఘ పాపా
పరిహృత ముని తాపా పాటితారాతి కోపా
వరరఘుకులదీపా వారితార్థి ప్రతాపా
పరి హృతసత్కలాపా భగ్నగౌరీశచాపా॥ ౪౪౩

శా. లోకాతీత గుణాభి రాముడు రమాలోలుండు రామప్రభుం
డీకళ్యాణ కృతీశ్వరుం డజముఖా భీష్టాగ్రదుండాఢ్యుడున్
శ్రీ కళ్యాణ సుఖంబు లిచ్చునుచుం డెయ్యెడు దంబొప్పగా
ఈకావ్యంబు రచించు తారకలతో నిల్పొందు భద్రంబుగన్॥ ౪౪౪

మ. ఇదిరామానుజ యోగిరాజ కరుణా పృష్ఠాగ్ర తత్త్వజ్ఞతా
పదవి భ్రాజితు యజ్ఞమూర్తిని మదిన్భావించి స్వీయాన్వయు
న్ముదమొప్పారగ రాముతిమ్మని కథన్మా చాపలాభంబుగా
సదయుల్మెచ్చ వచించెమూడవది యాశ్వాసంబు రామప్రభో॥ ౪౪౫

గద్య

ఇది శ్రీమద్భగవద్రామానుజ కరుణాకటాక్ష పాత్రయజ్ఞార్య పవిత్రవంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తదీయపీఠాధిష్ఠిత భారద్వాజస గోత్ర
పవిత్ర శ్రీమత్ తిరుమలై యచ్చాన్ కాండూరు రాఘవాచార్య
దేశిక వేంకటాంబా పుత్ర విబుధజనవినయ చర్య
వేంకట తిరుమలాచార్య ప్రణీతంబగు
భరతచరిత్రంబను మహాప్రబంధము
నందు తృతీయాశ్వాసము
సర్వంబును సంపూర్ణము.

శుభం భూయాత్

శ్రీ శ్రీ శ్రీ



# యీ సంపుటమునకు ధనసహాయము చేసినవారలు

| | | రు |
|---|---|---|
| రా॥ శ్రీ | 1. పెనుముచ్చ సీతారామరాజుగారు సత్యవాడ. | 25 |
| ,, | 2. తల్లాప్రగడ పానకాలరావుగారు ఏలూరు. | 5 |
| ,, | 3. చిమటం వీరభద్రరావు & బ్రదర్సు గారు | 5 |
| ,, | 4. శ్రీరంగనిలయం రామకృష్ణారావుగారు | 3 |
| ,, | 5. మోచర్ల వియన్నగారు | 1 |
| ,, | 6. యీ బాపిరాజుగారు | 1 |
| ,, | 7. తల్లాప్రగడ రామకృష్ణాగారు | 2 |
| ,, | 8. తమిరసి శంకర సూర్యనారాయణ అప్పారావుగారు | 1 |
| ,, | 9. దామరాజు మల్లిఖార్జునరావుగారు | 1 |
| ,, | 10. సింహాద్రి గంగాధరరావుగారు శనివారప్పేట | 2 |
| ,, | 11. యీ వీరరాఘవరావుగారు | 2 |
| ,, | 12. యీ చక్రధరరావుగారు | 5 |
| ,, | 13. గూడూరు మల్లేశ్వరరావుగారు | 2 |
| ,, | 14. గుండెపూడి వీరయ్యగారు | 4 |
| ,, | 15. యీ వెంకటచలంగారు | 1 |
| ,, | 16. తూములూరి దక్షిణామూర్తిశాస్త్రిగారు | 4 |
| ,, | 17. వఝ్ఝుల శ్రీరామచంద్రయ్యగారు | 4 |
| ,, | 18. దామరాజు రాజారావుగారు | 2 |
| ,, | 19. దుగ్గిరాల రామదాసుగారు | 1 |
| ,, | 20. ఆచంట రామబ్రహ్మంగారు బెజవాడ | 2 |
| ,, | 21. గోటేటి లక్ష్మీనారాయణగారు బెజవాడ | 1 |
| ,, | 22. యీ జోగిరాజుగారు కొండివరం. | 4 |
| ,, | 23. నాగసరపు సుబ్బారాయుడుగారు నర్సారావుపేట. | 1 |
| ,, | 24. పాటిబళ్ళ వెంకటస్వామిగారు | 15 |

| | | రు |
|---|---|---|
| మ॥ రా॥ శ్రీ | 25. బొలిశెట్టి ఆదిశేషయ్యగారు | 1 |
| ,, | 26. పసుపులేటి జనార్దనముగారు | 1 |
| ,, | 27. జుజ్జూరి రామయ్యగారు | 1 |
| ,, | 28. యీ హనుమంతరావుగారు | 1 |
| ,, | 29 యీ కాశీవిశ్వనాథంగారు | 1 |
| ,, | 30 యీ సత్యంగారు | 1 |
| ,, | 31. యీ నాగయ్యగారు | 1 |
| ,, | 32. యీ వేంకట సుబ్బయ్యగారు & బ్రదర్సు | 1 |
| ,, | 33. యీ సుబ్బారావుగారు | 1 |
| ,, | 34. చిలకల నారాయణగారు | 1 |
| ,, | 35. సింహాద్రి ఆంజనేయులుగారు | 1 |
| ,, | 36. మురారిసెట్టి నాగరత్నంగారు | 1 |
| ,, | 37. యీ హనుమయ్యగారు | 1 |
| ,, | 38. తాడేపల్లి నారాయణగారు | 1 |
| ,, | 39. జుజ్జూరి సూర్యనారాయణగారు | 1 |
| ,, | 40. చలసాని జయరామదాసుగారు పెనకడిమి | 2 |
| ,, | 41. మానుకొండ జగ్గయ్యగారు తాళ్ళసంకేస. | 1 |
| ,, | 42. చరుకూరి వీరయ్య & బ్రదర్సుగారు | 5 |
| ,, | 43. మామిళ్ళపల్లి చలమయ్యగారు అంకనగూడెం. | 1 |
| ,, | 44. మొరిమినేని గోవిందయ్యగారు | 1 |
| ,, | 45. గల్లా చంగయ్యగారు | 1 |
| ,, | 46. బాచిరాజు పిచ్చయ్యగారు జానంపేట | 1 |
| ,, | 47. మంగవిల్లి జగ్గమ్మగారు దొడ్డిపట్ల | 4 |
| ,, | 48. కొరకళ్ళ ఆండాళమ్మగారు పిఠాపురం | 1 |
| ,, | 49. చామర్తి సత్యనారాయణగారు పసలపూడి. | 1 |
| ,, | 50. ఆచంట భూపన్నగారు | 1 |
| ,, | 51. తురగా నాగరాజుగారు | 1 |

|  |  |  |
|---|---|---|
| ౨॥ రా॥ శ్రీ | 52. మొగళ్ళపు అమన్న & సన్సు వారు | రు 1 |
| ,, | 53. యీ నరసయ్య & సన్సు వారు | 1 |
| ,, | 54. నడింపల్లి సూరపరాజుగారు | 1 |
| ,, | 55. బండారు వీరన్నగారు | 4 |
| ,, | 56. యీరిపెన సత్తెయ్యగారు కాలధరి | 2 |
| ,, | 57. కరుటూరి కామన్నగారు అంకంపాలెము. | 1 |
| ,, | 58. కరుటూరి నరసన్నగారు | 1 |
| ,, | 59. దేవులపల్లి వెంకట్రావు గారు నందమూరు. | 5 |
| ,, | 60. యీ వేంకట అప్పారావుగారు | 3 |
| ,, | 61. దామెర సూర్యారావుగారు | 3 |
| ,, | 62. జలగం వెంకట్రాయుడుగారు రావిపాడు. | 3 |
| ,, | 63. సీమకుర్తి వెంకయ్యగారు అశ్వారావుపేట. | 1 |
| ,, | 64. ఆకే సూరన్న & సన్సు వారు సిరిపురం. | 1 |



# ద్వితీయాశ్వాసము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 21 | ట్టి | ట్టె |
| 16 | 13 | య్యి | యి |
| | 15 | భగ్గనె | ధగ్గని |
| 19 | 6 | మీ | మి |
| 21 | 24 | డే | డె |
| | 25 | మి | మీ |
| 23 | 8 | ను | ని |
| | 8 | ను | ని |
| | 20 | ముచా | మునచా |
| 24 | 10 | చునున్న | చున్న |
| 25 | 25 | నంను | నను |
| 27 | 25 | దీర్గి | దీర్ఘ |
| 29 | 1 | ద్ర | ద |
| 31 | 20 | వేశ | శేశ |
| 34 | 24 | ల్పి | ల్చి |
| 36 | 10 | నే | నె |
| | 20 | వ | వు |
| | 24 | శ్యా | శ్వా |
| 37 | 7 | ఖ్య | క్ష్య |
| | 18 | ముసని | మని |
| | 23 | శాంజు | శాంబు |
| 38 | 4 | సుతు | సుత |
| | 5 | హితు | హిత |
| | 6 | కుజ్జు | కుబ్జ |
| | 22 | రిని | రినిని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 38 | 24 | రనా | రఘునా |
| 42 | 14 | టి | టె |
| 45 | 3 | పృ | ప్రు |
| 52 | 11 | ధు | దు |
| | 22 | త్రు | త్ర |
| 53 | 23 | ను | న |
| 56 | 7 | ష్ట | ష్ణ |
| 60 | 17 | ద్దాం | ద్ధాం |
| 61 | 12 | ద్య | ధ్య |
| 62 | 16 | దా | డా |
| 65 | 8 | గురర | గుర |
| 67 | 1 | కోశ | కోస |
| | 13 | జ | జి |
| 68 | 19 | చుచును | చుచు |
| 71 | 23 | కును | కునకును |
| | 20 | ధు | దు |
| | 15 | శ్వ | శ్య |
| 73 | 21 | ఘ్ను | ఘ్న |
| 75 | 11 | డంద్రు | డంద్ర |
| | | ఖలు | ఖల |
| | 14 | జు | జ |
| | 22 | దం | తం |
| 78 | 4 | దా | ధా |
| 84 | 6 | భా | బా |
| 88 | 5 | జ్ఞు | జ్ఞ |
| 88 | 7 | నోమ్మమోంచా | నోమ్మచా |

# తృతీయాశ్వాసము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 104 | 7 | క్రోశ | క్రోస |
| | 14 | గ్గా | న్గా |
| 105 | 2 | ర్వ | ర్వ్య |
| 106 | 1 | తుకు | తునకు |
| 107 | 7 | ర్ద్రి | ద్ర |
| | 16 | వినవే | నీతను |
| | 17 | సుతుడునునీ | జాతుడునీ |
| 110 | 13 | లవేగ | వులను |
| 111 | 5 | భూాము | భూామి |
| 112 | 1 | లెనుమ | లెమ |
| 114 | 12 | వేచి | లేచి |
| 115 | 18 | ను | న |
| 118 | 3 | యం | యిం |
| | 6 | ముంబు | ముబు |
| | 10 | దల్ | ధల్ |
| 120 | 9 | డబిం | డంబిం |
| | 13 | ర్వత | రత్వ |
| 131 | 10 | గా | గ |
| 132 | 19 | ర్ధ | ర్ద |
| 134 | 22 | డియన్ | డివెన్ |
| 135 | 2 | దను | దన |
| | 4 | హేయ | హేయ |
| 136 | 7 | నే | నె |
| | 10 | భునకునె | భకును |
| | 14 | యున్నను | యును |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 139 | 1 | బ్రతుము | బ్రతుకుము |
| | 2 | రలు | రల |
| 142 | 6 | లై | నై |
| 147 | 5 | గాని | కాని |
| 148 | 3 | ధర్మంబుద | ధర్మంబు నీవునుద |
| | 5 | తమ్మున | తమ్ముని |
| | 23 | పది | పతి |
| 149 | 9 | మిమ్మా | మిా |
| | 18 | వులను | వును |
| 150 | 10 | నో | నో |
| | 14 | దన | దల |
| 151 | 21 | తమ్ముపై | తమ్మునిపై |
| 152 | 18 | రున | రుణ |
| | 20 | వేచి | వైచి |
| 157 | 13 | ఆర | అర |
| 164 | 17 | బుద్ధై | బునుద్ధై |
| 169 | 5 | ఇష్ట | నిష్ట |
| 171 | 6 | దంట | దండ |
| 174 | 6 | దార్ఢ్యం | దారుఢ్యం |
| | 19 | కుమన | కునున |
| 180 | 24 | డిగా | డినిగా |
| 183 | 13 | కుల | కల |
| 185 | 26 | టివి | టిని |
| 188 | 23 | వుయ | వురిని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 190 | 8 | కారు | కాలు | 191 | 11 | యుద్ధా | యుధా |
| | 14 | డో | డొ | 192 | 3 | దర | దరి |
| | | రాజో | రాజొ | | 14 | వెట్టిన | మెట్టిన |
| 190 | | నేనో | నేనొ | 195 | 17 | సగ్గి | సిగ్గి |